శివ వేంకటీయ గ్రంథమాల. తృతీయ పుష్పము.

# జగన్నాథీయము.

(అను పడాలిక్షేత్ర మాహాత్మ్యము)

అడవి సాంబశివరావు

నందగిరి వేంకటప్పారావు

అను



శివ వేంకట కవులచే రచియింపఁబడి, కృష్ణాజిల్లా గుడివాడతాలూకా

అంగలూరు వాస్తవ్యుఁడగు నందగిరి వేంకటప్పారావుచేఁ

బ్రకటింపఁబడియె.



సేతు ముద్రాక్షరశాల, మచిలీపట్టణము.



 వెల 8 అణాలు. రిజిస్టర్డు.

థములు రచించె. వినను నీకవికిఁ బదునాల్గవయేఁడు దాఁటెనో లేదో యనునప్పుడే సకలమాతుల వియోగముఁ గూడఁ గలిగి స్వకుటుంబయోగక్షేమాన్వయముఁ దానే నిర్వహింపవలయు భారము పైఁ బడినందునఁ గైకలూరు విడిచి దానికిఁ గ్రోశద్వయమాత్ర నికటవర్తియగు బొమ్మినంపాడు గ్రామముఁ జేరి, కరణికోద్యోగ ధర్మముల స్వయముగ నెరవేర్చవలసిన వాఁడయ్యెను. ఇట్లు కవితాలతా వృద్ధికి మహాత్తరం బగు నంతరాయంబు సంఘటించినను నీకవి నిరుత్సాహుండు గాక కుటుంబపోషణోద్యోగ ధర్మనిర్వహణమునకంటె నధికమగు పట్టుదలతోఁ గవితాలతాభివృద్ధి యొనరించుచుండె. ఈకవి గురుకులవాసక్లేశము ననుభవింపకయే స్వప్రయత్నమువలన గీర్వాణభాషాభ్యాసమునను దొరకొని ప్రప్రథమమున నా బాల్యంబున నా చేయు విద్యాభ్యాస దశలో జింతనాదిసమయములయందు సహవాసవశంబునఁ జెంగటఁ జేరి స్వయముగానే విశేషాంశములు గ్రహణధారణ పూర్వకముగ సంగ్రహించుచుండినందునఁ దదనంతరము మేఘసందేశకావ్యమును జదివి, దాని నప్పుడే శుద్ధాంధ్రకావ్యముగా భాషాంతరీకరించెను. ఈకవి రచించిన గ్రంథములు.

## రచనాసమాప్తి.

| | | కాలము. |
|---|---|---|
| (1) | శుద్ధాంధ్ర మేఘసందేశము | 1884 |
| (2) | హైమవతీపరిణయము | 1890 |
| (3) | అశ్వలక్షణసారము | 1890 |
| (4) | సత్యనారాయణచరిత్ర | 1891 |
| (5) | అద్వైతమతాదర్శము | 1901 |
| (6) | సాత్రాజితీపరిణయము | 1905 |
| (7) | బిల్వనాయము | 1908 |
| (8) | ఆంధ్రమత్స్యపురాణము | 1914 |
| | హరిహరాది స్తోత్రశతకములు 20 | |

* * * * * *

ఈకవి చిన్నతనంబుననే రామాభ్యుదయము, స్వారోచిషసంభవ మను నాటకమును రచించెనుగాని కారణాంతరమున నవి వామావశిష్టము లైనవి. పిదప

# కవి జీవితము.

---:o:---

"శివ వేంకటకవులు" అను సంసృష్టనామముతో గ్రంథప్రకటనమునకుం దొరకొనిన యీకవి ద్వితీయమునందు,

## ప్రథముఁడు అడవి సాంబశివరాయకవి.

ఇతఁడు ఆరువేలనియోగిబ్రాహ్మణుఁడు. సాంఖ్యాయన సగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, కృష్ణయజుశ్శాఖాధ్యాయి, అద్వైతి, తండ్రి పాపయ్యామంత్రి. తల్లి తమాఁబ. వీరి కాపురము కృష్ణామండలము నందలి కైకలూరు తాలూకాలోని బొమ్మినంపాడు అనుగ్రామము. వీరి పూర్వులనుండియు నీ గ్రామమునకుఁ గరిణీకపువృత్తి వహించియుండిరి. ఈకవిశేఖరుఁడు క్రీ-శ 1864 సం॥ రమున జన్మించెను. బాల్యమున నుండఁగనే పితృవియోగము సంభవించినందున శైశవమునుండియు నస్మన్నివాసమగు కైకలూరు నందు మాతామహ గృహమునమండెను. కైకలూరు తర్కశాస్త్రమునందు దిగ్విజయముచేసి, దిగంతవిశ్రాంత శాశ్వత కీర్తివహించిన యస్మత్పితామహులు, శ్రీకురుగంటి వేంకటరామశాస్త్రులవారి జన్మభూమి. ఈకవికిఁ జిన్నఁదనమునందే మాతులులుగూడ పరలోకయియాసువులైనందున గ్రామవిద్యాభ్యాసమునకుఁ బెక్కుభంగములు దటస్థించెను. ఎట్లయిననేమి "పూర దత్తాచయావిద్యా" అనున్యాయము సార్థకముగా నీకవిపుంగవున కశిక్షితమయ్యు నప్రయత్నముగా సహజమగు కవిత్వ ధారాపటుత్వ మంకురించెను. కైకలూరు కొల్లేరను తియ్యనీటి మహాసరోవరమునకు దక్షిణతీరముననుండుటయుఁ దత్సరోవరము నిరంతరజాజృంభమాణకుముదకల్హారపుండరీకసరోరుహ ప్రకాండహిండమాన మకరంద బిందుబృందచంద్రకితవాః పూర పరివర్ధమాన కమలాకరరమావిరమాణ కైశ్యలీలావిశాల శైవాలకుడుంగరంగసంగచ్ఛరదనేకజల విహంగకులకలకలారావ సంపూర్యమాణద్యావాపృథివ్యంతరంబై దిదృక్షుశ్రోతృజననయనశ్రవణానంద సంధాయకంబై విలసిల్లుటం సి తత్తీరమునం దంకురించిన కవితాలతిక బోదిసేయుట కానుకూల్యకలనంబు గలదనుట వింతకాదుగదా. ఇట్లు, ఆబాల్యముననఁగాఁ బదిరెండవయేటనే జనించిన కవిత్వకన్యక నీకవి స్వప్రయత్న బాహుళ్యముచే సుచితసంస్కార పరిష్కారఁ గావించి పెక్కు గ్రం

హైమవతీ పరిణయాది పైనఁ జెప్పఁబడిన గ్రంథములును, ఇరువదిశతకములును రచించెను. మొత్తముమీఁద స్వయముగా నీకవి యష్టావింశతి గ్రంథకర్త.

## ద్వితీయుఁడు నందగిరి వేంకటప్పారాయకవి.

ఈకవి మధ్వబ్రాహ్మణుఁడు. విశ్వామిత్రసగోత్రుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు ఋక్శాఖాధ్యాయి, ద్వైతి. తండ్రి వేంకటనరసింహాపండితులు. తల్లి శేషమాంబ. వీరికాపురము కృష్ణామండలమున నస్మన్నివాస గ్రామమగు కైకలూరున కనతిదూరమునఁగా యోజనద్వయ మాత్రములో గుడివాడతాలూకాలోని అంగలూరు అను గ్రామము. వీరిపూర్వులనుండియు అంగలూరు గ్రామమునకుఁ గరణీకఁపు వృత్తి నవలంబించియుండెరి. ఈకవిచూడామణి క్రీ॥ శ॥ 1868 సం॥రమున జననమందెను. చిన్నఁదనమునందు బ్ర॥ రెండుచింతల తారామకవిగారియొద్ద ఛందోలక్షణాదుల నభ్యసింపదొరకొనెనుగాని, అచిరకాలముననే అకవిగారు గద్వాల రాజాశ్రయమువలన నచ్చట కేగుటచే నంతరాయము కలిగెను; కలిగినను నిక్కవిపట్టుఁదల విడువక స్వయంకృషివలననే గీర్వాణభాషాపరిచయముఁ గలిగించుకొని సహజయగు కవితాలతికనభివృద్ధి నొందించెను. ఈకవి తన 13 వ యేఁడు నిండనిబాల్యము నుండియుఁ గవిత్వరచనగావింపఁ దొరకొనెను. తొలుదొల్త హనుమద్విజయమను మైరావణనాటకము రచించెను. ఆకాలమునందలి యీకవిగారి మేధాశక్తి, అత్యద్భుతమై యుండెడిది. ఒకనాఁడా గ్రామమున నొక పండితుం డొక గ్రంథము సదివి పురాణము సెప్పునప్పుడు, అందుఁ గథామధ్యమున నొకపత్రము నశించి కొంతవడియుండఁగాఁ బండితుఁడును శ్రోతలును గథా భంగమాయెనని చింతించుచుండ నీకవి, ఆపోయినపత్రమునందలి కథాభాగమును స్వయముగ నాశుకవన ధోరణిచే గద్యపద్యాత్మకముగాఁ జదివి కథాసందర్భముఁ గుదిర్చి వారిచే బహుమతుండయ్యె. ఇదిచాలదా, ఈకవియసామాన్య ప్రతిభఁ దెలుపుటకు! అట్టి యనర్ఘ ప్రతిభావిశేష విలసనమువలననే, అష్టావధానముల నొనర్చి విద్వద్బహుమానితుం డయ్యె. ఈకవి మొదట శేరీ కలవపూడి గ్రామమునకుఁ గరణమై పిదపదిద్దుబాటులో, ఆగ్రామమింకొక గ్రామములోఁ గలపఁబడినందున స్వగ్రామమగు నంగలూరు గ్రామమునకు సహాయగ్రామ గణకుఁడు (అసిస్టెంటు కరణము) గా నియమితుండయ్యె. ఈయన, ఈవృత్తియందు రేయుం బవలును దీరికలేని రాజ యవ్యాపారములచేఁ గాలక్షేపము సేయుచుండియు నెట్లెట్లో తీరిక చేసికొని సద్గ్రంథరచన వలనఁ గవిత్వలతికకు దోహదము సేయుచుండును.

సరస చతుర్విధ కవితా సామ్రాజ్య ధురంధరుల

బ్రహ్మశ్రీ

నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రిగా రొసంగిన

పంచరత్నావళి.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

కం॥ ఈయసదృశ సన్మహిమా, భూయిష్ఠక్షేత్ర చరిత పొనరు జగన్నా
యము సువృత్తలసితము, యుత కవి విరచితంబుఁ దృప్తిగఁ గంటిన్ ॥

కం॥ ఈకవులు తొంటిభవముల, నేకొలఁది సుకృత మొనర్చి యిశ్కా[illegible]ంబుం
జేకొని చేయం గలిగిరొ, శ్రీకరపదవు ల్లటి చిరసుఖ మొందఁగన్ ॥ ౨

చ॥ హరిహరు లొక్కరూపమని యందరకుం దెలుపంగ నైరె యీ
యిరుగురు సత్కవీశ్వరు లహీనసమర్థత లొప్పువార లొ
క్కరుగ వటంచుఁ దోఁచెడిని గాదె సమాఖ్యలటొప్పఁ జా్యముం
బరువుఁ బ్రవర్తనంబు సమపొందిలికై తమ భేద మెన్నఁగన్ ॥ ౩

ఉ॥ చందమెఱుంగ నీ యడవి సాంబశివాహ్వయ సత్కవీంద్రుఁడు
న్నందగిరి ప్రసిద్ధకుల నందన చందన వేంకటప్ప రా
వుం దమ సఖ్య మెల్లెడలఁ జొల్పగ శో లఁజేయు శాంతు పే।
ర్మం దమ రిరు రేకమయి మేల్మిగఁ గూర్చిరి ని నిర్ధరన్ ॥ ౪

ఆ॥వె॥ తనరు నా రవీందుతారకముగ నిది । పండితాళి మెప్పు పడయునట్టి ।
విట్టి కబ్బములు రచించు నిక్కవి । ద్వితయ మతులవిభవయుతులు నగుత ॥ ౫

బందరు

30—1—15

నా. పు.

సామకశాఖలంబరగు బ్రాహ్మణులును వైశ్యులును, రెడ్లును, గాపులును, గొండులును బరమ
భక్తులయి నియతాచారధర్మంబులు నెరవేర్చికొనుచు భూతదయాళురని ఖ్యాతివహించియు
న్నవారు. ఈదేవస్థానపు ధర్మకర్తృత్వమును గురజ జమీన్దారులు విడువగనె లింగాల
వాస్తవ్యులు మొఖాసాదారులునగు కమదన జగన్నాథరాయణంగారు వడాలి వాసులగు
వారణాసి జగన్నశాస్త్రులుగారు మున్నగువారి యాలోచన ననుసరించి ధర్మకార్య నిర్వ
హణము జరిపిరి. నాటంగోలెఁ దద్ధర్మకర్తృత యేకముఖంబున నునికికంటె నాలోచన
సభాముఖంబునఁ బ్రవర్తిల్లుట యుక్తమనుయుక్తి పొడమె. అప్పుడు యొకసభయేర్పడె.
జగన్నాథరాయణంగారు దీనికధ్యక్షులయి యుండిరి. ఇందదినరకె ఏర్పడియుండిన
అడుసుమల్లి సుబ్రహ్మణ్యము మొఖాసాదారుగారి యనంతరమున ముఖ్యులయి తమ
పతెనె గ్రామాంతరవాసులగు దేవరకొండ నాగన్నగారు, వల్లెము వెంకటసుబ్బయ్య
గారు, చిన్నకోట వెంకటవరదయ్యగారు నన్ప్రముఖుల సమయోచిత సహాయంబున
తత్క్షేత్రవాసులగు పూర్వోక్తపౌరగణ నిత సహాయమును బడయుచు దమకుఁగల ప్రసిద్ధ
దైవభక్తి విశేషంబుకొలదిని ధర్మకార్యంబులెల్లను మిగులవర్ణనీయములుగా నెఱ
వేర్పుచువచ్చిరి. ఈలోకంబునఁ గొలిచినక్లై యాలోకంబునఁ గొలువ జగన్నాథసన్ని
ధిశా సుబ్రహ్మణ ముగా రేగిన పిదప తజ్జ్యేష్ఠపుత్రుండగు సూర నారాయణగారా ప
నింబూని తగువారి మన్త్రతంత్రబలంబులు సహాయములుగాఁ గొనియాడఁ బడదగినట్లు
పూనినకార్యము నెఱవేర్చి జనకున కైపరమపదవికింజనియె. ఇప్పుడు తత్పుత్రుండు పితా
మహానిర్మలనామధారియై యాగత కార్య నిర్వాహికాఁగలయోగ్యత ఉత్పన్నములయి
యభివృద్ధినందునట్టుల వర్ధిల్లుచున్నందునఁ దత్పితృవ్యుండగు గోపాలకృష్ణయ గారు తు
మ్మలపల్లి గోపాలకృష్ణమూర్తిపంతులుగారు ద్రోణాదులశోభనాద్రినాయుడుగారు, పర్వ
తనేని మల్లికార్జునుడుచౌదరిగారు, మందలక్ష్మన్నరెడ్డిగారు, వారితోడంగూడియే తద్గ్రంథ
నిర్మాణప్రోత్సాహకులని యిందువర్ణింపఁబడి యున్నట్టియు నీసభకగ్రాసనాధిపత్యము
వహించి సకలసత్కార్యనిర్వహణదీక్షాదక్షుడయియున్నట్టియు శ్రీకొల్లి తయ్యగారికిఁ
గుడిభుజము గాశోభించుచున్నారు. ఇట్టిసభ నెరవేర్చుటంబట్టియే పనులెల్లమిగులశోభిల్లుట
యటుండ సువర్ణమునకు సుగంధము తోడ్పడినట్లు సభికుఁడుకాకుండియు పురనివాసియై
యుండుటంబట్టి లోకానుమతి నెఱింగి వలసినమార్పులు స్ఫురింపఁ జేసి నెఱవేర్పింపఁజేయు
కౌశలంబునఁ బ్రసిద్ధింగాంచిన తరణిగంటి వెంకటనృసింహసీతారామకృష్ణశాస్త్రిగారుని అ
విషయంబులందు నీసభకున్న భాగ్రణికిని సహాయులయియుండుటచే నిప్పుడప్పనిమిక్కిలి

యొప్పియున్నది. ఇట్లు జగన్నాధ సేవాధురంధరులగు నెల్లరకు నెల్లెడల సకల శ్రేయోభివృద్ధి యగునట్లు భగవత్ప్రసాదంబు సిద్ధింపంగోరుచు మేమీగ్రంథమురచియింపం బూను నెడ నిందులకు వలయు నంశములను సేకరించుకొనుటను బ్రహ్మాండాది పురాణముల నొసంగి బ్రహ్మశ్రీ చింతలపాటి వేంకటశాస్త్రిగారు, రామమూర్తి శాస్త్రిగార్లు మాకుసహాయులైనందున వారికి మేము మిగులకృతజ్ఞుల మగుచున్నాము. గ్రంథపరిపాకాది విషయములు పాఠకులకే విశదమగును గాన మేమిచ్చట వ్రాయుట యనావశ్యము.

ఈగ్రంథము బందరునందు సేతు ముద్రాక్షరశాలలో ముద్రింపఁ బడునపుడు వానిని సావకాశముగఁ బరిశీలించు నవకాశము మాకును లభింపకుండుటచేత గ్రంథమునందు పెక్కు స్ఖాలిత్య దోషములు సంభవించినవి. అట్టితప్పులకు శుద్ధపత్ర మిందుఁ బొందుపరుపఁ బడినది చదువరులు ముందుగా శుద్ధపత్రము ననుసరించి గ్రంథమును సవరించుకొని పిదపఁ జదువుటకుఁ బ్రార్థితులు.

రేఫద్వయభేద మీగ్రంథమునందుఁ బాటింపఁ బడలేదు. గ్రంథవిస్తరభయముచే నర్ధానుస్వారపరుషసరళాదిస్ఖాలిత్యము శుద్ధ పత్రికయందుఁ జేర్పఁబడవయె. పాఠకులు మన్నించెదరుగాక.

ఇట్లు
గ్రంథకర్తలు,
వ. వేంకట కవులు.

అంగలూరు,
22—11—14.





ఓం

శ్రీజగన్నాథస్వామినేనమః

# జగన్నాథీయము.

## ప్రథమాశ్వాసము.

ఆత్మాఖ్యా పదయుగ్మకాంక కలనా • త్వంసూచయుక్తా తత్ప్రకృ
త్యాత్మా యోగమత షడక్షరమనుం • శక్తీశ్వ రాభేదతాం
తద్వ త్తారకతత్త్వ మాత్మవిదుషా • మైక్యంచ విష్ణ్వీశయో
ర్వ్యక్తీవ్యష్టా ప్రదదాతున స్వహిజగ • న్నాథ స్సుభద్రాధిపః॥

---

౧ ప్రకృత్యా త్మాయోగము — జగత్ + నాథ: ౮+౩+౧+౯=౨౧ = ప్రకృతి: ౩+౩+౬=౧౨ = పురుష: ౧ ౨ ౬=౯=౨౧

౨ షడక్షర మంత్రము — మరల జగత్ నాథ: ౮, ౩, ౦, ౯=౨౦ = ఓం న మః శి వా య: ౫ ౦ ౫ ౫ ౪ ౧ = ౨౦

౩ శక్తీశ్వరా భేదము — శ క్తి: ౫+౬=౧౧. ఇది జగత్ శబ్దము — శి వ: ౫,౪=౯=౨౦ ఇది నాథ శబ్దము

# జగన్నాధీయము

శా॥ శ్రీరాజిల్లెడు శైవవైష్ణవమను ♦ శ్రేష్ఠార్థ సంధానము
ఖ్యారూఢాక్షరయుక్త సంచితనిజా ♦ ఖ్యాయుక్తి జీవేశ్వరై
క్యారోహంబు ఘటింపఁగాఁ బ్రణవవి ♦ ద్యాశక్తి రాజిల్లు -
తారాముం డ లార్థసిద్ధులను భ ♦ క్తశ్రేణి కిచ్చున్ జయన్ ॥ ౨

శా॥ స్వాతంత్ర్యంబున విశ్వసర్గవిలయ ♦ స్థానాదికృత్యంబు ల
జ్జాతప్రోద్భవ రుద్ర మాధవులచే ♦ సల్పించుచున్ విశ్వరూ
పాతర్క్యప్రణ వాకృతిస్ఫురితయై ♦ యాత్మా వినాభూత యా
తాదేవి మదీయవాంఛితఫల ♦ ప్తిన్ బ్రసాదించుతన్ ॥ 3

శా॥ వాగర్థంబుల భాతి శశ్వదవినా ♦ భావంబుచే నాత్మసం
యోగం బీ నిఖిల ప్రపంచనిచయ ♦ ప్రోద్భూతికిన్ హేతువై
దాఁగుద్యోగముఁ గాఁగ విశ్వజనక ♦ త్వప్రాప్త శశ్వత్కృపా
ప్రాగల్భ్యంబు నుమామహేశ్వరులు మా ♦ పైఁ జూపెద ర్గావుతన్ ॥

ఉ॥ లి యఖండరూపమున ♦ నుల్లము పొచ్చి ముఖాంబుజంబులన్
నాలుగిటన్ బయల్పడలి ♦ నాలుగుపేరుల నొప్పి వేదముల్
గ్రాలఁగ సృష్టి నాల్గగతు ♦ లన్ విలసిల్లఁగఁ జేయుతాత యు
న్మీలిత సత్కృపామహిమ ♦ మించి శుభంబులు మా కొసంగుతన్ ॥ ౫

॥ పరికింప నపరిభా ♦ వ్యస్వరూపంబున, భాసిల్లుఁ దొలుపొల్త ♦ పరయనంగ
నా మీఁదహృదయపీ ♦ తారూఢ యగుచు న, వ్యాకృతస్థితిని బ ♦ శ్యంతి యనఁగ
నవల సంకల్పరూ ♦ పావిష్టయై బహి, రాగమోద్యుక్తి మ ♦ ధ్యమ యనంగ

---

౭×౩×౦×౯=౨౧౬
తారక
౪ తత్త్వము — క్రిమన్యాసము ౬౨౧ లేక ౧౨౬ ౧,౨,౬=౯
తారక కరతా ౦ ప్రణవము.

౨౧౬
శివ — ఏకలోపపత్తే — ౧ న్యా ౦౨౧౫.
౨౦౫ నారాయణ
౫ విష్ణు — జగత్ నాథ ౦, ౪ క శం
భేదము. ౭,౩=౧౧ × ౦ ౯ = ౯ ౯ శివ విష్ణు
౫,౪=౯ ౪,౫=౯

# విషయసూచిక.

——:o:——

పుటం. విషయము.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము

# ప్రథమాశ్వాసము

రూఢిగా వర్ణస్వరూపంబుఁ గొని బహి, ర్గతిఁ గాంచు నెడల వైఖరి యనంగ
గీ॥ నాల్గు రూపంబులను ధాత ♦ నాల్గుమోముఁ, దమ్ములఁ జరించు చక్షర ♦ తత్త్వ యగుచు
నిగమ విద్యా వినిర్ణేత్రి ♦ నిఖిలమాత, యాప సరస్వతి మాజిహ్వ ♦ నలరుఁగాత॥

చ॥ నలు వలరార భౌతికగణంబులకున్ బతియై సుధీవిధా
కలన ననేక పానసతఁ ♦ గైకొని లోకనివిష్టసర్వ వి
ద్యల కధినాథుఁడై ప్రణవ ♦ తత్త్వ విబోధకుఁ డౌ గణాధిపుం
డ్లొలమి మదీయకావ్యమున ♦ కిచ్చెడుఁగాత నిరంతరాయమున్॥ ౭

మ॥ రఘువంశాగ్రణి యానవాలు గొని వా ♦ రాశిన్ క్షణార్థంబునన్
లఘులీలన్ వెస దాఁటి తఁ గని యా ♦ లంకేశు నాత్మీయశౌ
ర్య ఘనోద్వృత్తిఁ దృణీకరించి పతికా ♦ ర్యస్ఫూర్తిఁ జాటించు శ
త్రుఘనధ్వాంత ఖరాంశుమంతు హనుమంతున్ బ్రస్తుతింతున్ మదిన్॥ ౮

మ॥ తతమాయాపరిత స్స్ఫురద్యవనికాంతర్వర్తి పర్షాంతరా
కృతియై దేవుఁడె జీవుఁ డౌ ననుచుఁ ద ♦ త్క్రీడార్థపాత్రాంతర
స్థితి జీవుండు విభిన్నుఁ డంచును బృథ ♦ క్సిద్ధాంతనిర్ణేత లై
యతులఖ్యాతి వహించు శంకరుఁడు మ ♦ ధ్వాచార్యుఁ డ్యు ల్గడున్॥ ౯

మ॥ నిరతోదంచిత గాఢభక్తి విలస ♦ న్నిష్ఠారతిన్ బూని శం
కర నారాయణ పాదసేవన సమ ♦ గ్రప్రాప్తి ష్టార్థులై
పరమఖ్యాతి వహించు మద్గురువులన్ ♦ బ్రహ్మణ్యులన్ గొల్తు మే
మురవన్ బాపయమంత్రి వేంకటనృసిం ♦ హున్ బ్రహ్మసంకాశులన్॥ ౧౦

మ॥ కవితామధ్యమవిష్టపావతరణా ♦ గ్రస్థానసోపానమా
ర్గవిధోదంచితవాగ్విలాసులఁ దొలిన్ ♦ బ్రాచేతసవ్యాసులన్
స్తవసంతుష్టులఁ జేసి బాణసుకవిన్ ♦ దండిన్ మయూరాహ్వయున్
భవభూతిన్ గవి కాళిదాసుని మదిన్ ♦ భావింతు మెప్పొదున్॥ ౧౧

॥ శబ్దానుశాసను ♦ సన్నుతించి యుభయ, కవిమిత్రునకు నమ ♦ స్కారము లిడి
భక్తి మీరఁ బ్రబంధ ♦ పరమేశ్వరు భజించి, సహజపాండిత్యుని ♦ చ్చలును గొల్చి

సంచితకవితా ముఖ ♦ శస్కారుఁ బ్రణుతించి, సర్వగుణసనాథు ♦ నతులఁ దేల్చి
కవిసార్వభౌము వి ♦ ఖ్యాతిఁ బ్రశంసించి, సౌజన్యజేయు నా ♦ క్కరణిఁ బొగడి
గీ॥ వినయవిద్యాసముద్రుని ♦ వినుతిఁ జేసి, యాంధ్రకవితాపితామహు ♦ నభినుతించి
మంజులాంధ్రకవిత్వని ♦ ర్మాణధనుల, ఘనలసత్కీర్తివిభవులఁ ♦ గవులఁ దలఁచి॥

ఉ॥ శీలయు విష్ణుమాసులయు ♦ క్ష్మీబయు మొక్కొకమున్న గాఁగ ని
ర్వేలనిలింపవాస్తయుధ ♦ విష్ణుమహాకృతికల్పనాఢ్యలన్
జాలఁగ వెంగమాంబికయు ♦ శారదయచ్చమనర్యమాదులన్
శ్రీలలితాంధ్రకావ్యకృతి ♦ సిద్ధయశస్కులఁ గొల్తు మెచ్చుచున్॥ ౧౩

చ॥ రసలసమానసద్గుణని ♦ రంతరసంస్కృత సత్పదాఢ్యు లౌ
రసికుల సత్పదంబులు శ ♦ రంబులఁ దాల్చి సమగ్రదోష ల
క్ష్యసకలసంస్క్రియారహిత ♦ కష్టపదాకరులైన యట్టి నీ
రసులకు పత్పదంబులు శ ♦ రంబులపై ఘటియించు టొప్పదే!॥ ౧౪

వ॥ అని యిట్లు ప్రాగీప్సితగ్రంథనిర్విఘ్నపరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేద లక్షణ నిబంధనంబుగాఁ బూర్వరంగప్రసాధనంబు నిర్వర్తించి యొక్క మహాప్రబంధంబు రచియింపఁదలంచి యున్న యవసరంబున.

సీ॥ నలుప్రాఁబలుకు నాదు ♦ గులుక నెల్లజగాలు, గలిగించు నెలతేఁటి ♦ పొలుపుమీటి
పొక్కిలివిరిదమ్మి ♦ నక్కజంబుగఁ గ్రమ్మి, నీటిపుట్టువు కెంపు ♦ నిబ్బరంపుఁ
దళుకు లీనఁగ నాని ♦ వలువ సుట్టిన మేని, జిగికొప్పు మెఱుఁగుతోడి ♦ మొగిలుపోడి
మిజగా దటాయింప ♦ మినుకు లెల్లెడ నింపఁ, గల చుట్టువాగ్గేల ♦ నలరి క్రాల
గీ॥ పులయూ జెసర యుడుగు తా ♦ పురరుటంబుఁ, గన్నపూఁదేనియాల మోక ♦ మిన్నువాఁక
యసుఁగు పైదోఁడు బలుపున్న ♦ యాములవీఁడు, కలుములకు నాలవాలము ♦ కమ్మకోలము॥ ౧౫

॥ అక్షికమ్మపలంబున ♦ నలరు పైడి, పాలగోత్రంబునం గ్రాలు ♦ పాలవెల్లి
నిండుచందురుగతిఁ గీర్తి ♦ పండువెన్నె, లెల్లెడల నింపఁగలవారు ♦ కొల్లివారు॥

ఉ॥ అంకమసీఁడు దానమహి ♦ మాపరకల్పనగంబు సద్గుణా
లంకృతుఁ డిద్ధకీర్తి మహి ♦ శాముఖమండలరాజమానచం

ద్రాంకభవిష్ణుపూర్ణతుహి ♦ నాంశవిబింబవిడంబనుండు స
ర్వాంకషసంపదున్నతి ని ♦ రాకృతశేఖవిభుం డనం దగెన్ ॥ ౧౮

చ॥ అతనికి బుచ్చిబాపయన ♦ మాఖ్యుఁడు మాఘ్యలసత్యమాఖ్యుఁడు
న్నతగుణసంప్రహర్షిత జ ♦ నప్రకరుండు జనించె నాబుధ
స్తుతునకు శౌరి కిందిరయు ♦ ధూర్జటికిన్ గిరిపుత్రి కైవడిన్
సతి లలనాశిరోమణి య ♦ నన్ దనరున్ మహాలక్ష్మి పేరఁటన్ ॥ ౧౯

తే॥ అమ్మిథునము పురాజను ♦ రార్జితోరు, పుణ్యఫల మన జనియించెఁ ♦ బుత్రయుగము
శీతయయు సుబ్బయ యనంగ ♦ ఖ్యాతిసీతి, యాకృతులఁ గొన్నచందాన ♦ నం
దులోన ॥ ౨౦

సీ॥ మతి యహర్నిశము స ♦ న్మతిమీరఁగాఁ బరో, పకృతిప్రవీణ మై ♦ పరఁగువాఁడు
విత్త మంతయు నెప్పు ♦ డుత్తమపాత్రార్త, వితరణప్రవణ మై ♦ వెలయువాఁడు
తలఁ పెల్లవేళలఁ ♦ దలఁగక హరిపాద, జలజాతములయందు ♦ నిలుపువాఁడు
తనమనికి సాధుస ♦ జ్జనసపర్యాయుక్తిఁ, జేకొని సఫలంబు ♦ సేయువాఁడు
గీ॥ పున్నెముల కెల్లదావగు ♦ పున్నమాఖ్య, తనకు సహధర్మిణిగఁ బెంపుఁ ♦ గని
నవాఁడు
కొల్లికులవార్ధిపూర్ణిమా ♦ కుముదహితుఁడు, సీతయాహ్వయుఁ డోకనాఁడు ♦ ప్రీ
తితోడ॥ ౨౧

మ॥ మను గోత్రాత్మభవామనోహరకృపా ♦ మాహాత్మ్యసంప్రాప్తవా
క్పటుదంచత్కవితారసజ్ఞుల మహా ♦ కావ్యప్రబంధాదిశి
ల్పమునన్ బండితమండలీబహుమత ♦ ప్రాగల్భ్యలన్ దత్త్వవి
త్తములన్ సాంబయ వేంకటప్పకవులన్ ♦ దర్శించి తా నిట్లనెన్ ॥ ౨౨

సీ॥ ఉర్వినార్వేల ని ♦ యోగివంశంబునఁ, బేరెన్నిక వహించి ♦ పేరుఁ గొన్న
సాంఖ్యాయనసగోత్ర ♦ సలలితాడవ్వన్న, వాయాంబురాశిపా ♦ ర్వణవిధుండు
మాన్యుఁ డౌ పాపయా ♦ మాత్యమౌళికి . త, మాంబకుఁ బుత్రుఁడ ♦ వగుచు సహజ
పాండిత్యకవితాప్ర ♦ భావంబునను బిల్వ, నాధీయ ముఖ్య నా ♦ నాప్రబంధ
॥ ములును మాత్స్యపురాణంబు ♦ మొదలుపంచ, వింశతిగ్రంథకర్తృత ♦ వెలసి కీర్తిఁ
గంటి సాంబశివాఖ్య స త్కవివరేణ్య!, నీదు చరితంబు బుధ వర్ణ ♦ నీయము గద॥

సీ॥ మధ్వసిద్ధాంత స • మ్యగ్జ్ఞానముకరాజ, కార్యనిర్వాహణైక • గరిమఁ బేరుఁ
గొన్న విశ్వామిత్ర • గోత్రపవిత్రవం; దగిరి వంశాబ్ధి చం • ద్రముఁ డనంగఁ
గర మొప్పు వేంకట • నరసింహరాయార్య, వరునకు శేషమాం • బకును బుత్ర
రత్నమ వగుచు శ్రీ • రామాయణాద్యుభతో, త్తరకాండమాది గ్రం • థములు పంచ
గీ॥ వింశసంఖ్యరచించి క • విత్వతత్త్వ, కోవిదుఁడ వై తనర్చి య • ష్టావధాన
దక్షతవహించి యతుల మే • ధాసమృద్ధి, నలరితివి వేంకటప్పరా • యా! కవిచంద్ర!॥

చ॥ ఉరుతరవాగ్విభూతి కృతు • లొప్పఁగ నింతకు మున్నె వేరుగా
విరచనచేసి చేసి బుధ • బృందము మెచ్చఁగఁ గన్న మీరు మీ
చిరతరమైన చెల్మి విల • సిల్లఁగ నింతటనుండియున్ బర
స్పరమిళితైకనామతఁ బ్ర • బంధములన్ రచియింపఁ బూనుటన్॥ ౨౫

చ॥ ఇరువురి పేరు లొక్కటిగ • నేర్పడఁగా శివవేంకటీయ నా
మరుచిరచిహ్నకల్పన మ • మర్చి రచించు ప్రబంధకోటికిన్
దరమగు మేల్శిరోమణి వి • ధంబున రాజిల నాదుకోర్కె పై
ఖరి చరితార్థమై యొసఁగఁ • గాఁ గృతియొండు రచింపుఁ డింపుగన్॥ ౨౬

మ॥ కర మొప్పన్ బురుషోత్తమాహ్వయము వి • ఖ్యాతంబుగా క్షేత్ర మీ
ధర బౌద్ధాకృతిఁ గన్న విష్ణునవమా • ద్యంబై జగన్నాథ భా
సుర నామంబున నందు నెప్పుడును ని • ల్చున్ దేవదేవుండు శ్రీ
హరి కారుణ్యము మీర మర్త్యులకు స • ర్వార్థంబులన్ గూర్చుచున్॥ ౨౭

మ॥ నరులం బ్రోవఁగ నందు నిల్చిన జగ • న్నాథుండె మార్త్యంతర
స్ఫురణం గైకొని సిద్ధసంయమికృతా • స్తోకప్రతిష్ఠాసమా
దరుఁడై స్వాంశ వడాలిపట్టణమునన్ • దాసావనాత్యంతస
త్కరుణాదృష్టి వసించెడున్ దనమహ • త్త్వం బెల్ల రాణింపఁగన్॥ ౨౮

కం॥ నీలగిరిశిఖరమునఁ గరు, ణాలంకృతుఁ డగుచు నిలుచు • నచ్యుతుఁ డే నేఁ
డీ లీలన్ వసియించు వ, డాలిజగన్నాథుఁ డన బె • డం గగుమహిమన్॥ ౨౯

తే॥ అట్లు గావున క్షేత్రమ • హాత్త్వసహిత, ముగ జగన్నాథచారిత్ర • మును వడాలి
శ్రీజగన్నాథసంప్రతి • ష్ఠితియుఁ గూర్చి, కృతి యొనర్పుఁడు! లోకోప • కృతి
యొసంగ॥ ౩౦

చ॥ ఎవనిపదాబ్జరేణు వొక • యించుక సోఁకిన రాయి నాతియై
యవనిరహించె? నెవ్వనిమ • హత్త్వము కొండలఁ దేల్చె నీటిపై?
నెవని నియుక్తిఁ గ్రోతిదరి • యించె మహాంబుధిగంతులోన నా
రవికులచంద్రుఁడైన రఘు • రాముఁడు కేవలవిష్ణుఁడే గదా ॥ ౩౬

చ॥ హితమతి నిచ్చినక్ శబరి • యెంగిలిపండ్లు పరిగ్రహించి శా
శ్వతపద మిచ్చె దానికి వె • సన్ శరణన్న విరోధితమ్ము నా
యతకృప రాజుఁ జేసె శర • ణాగతరక్షణదీక్షితుండు మ
త్కృతి గ్రహియించి మాకు సక • లేష్టఫలంబు లొసంగ కుండునే? ॥ ౩౭

చ॥ అరయఁగ రామనామము మగు • నాత్మజము సంఖ్యకు నిర్వదైదుగాఁ
బరఁగును బ్రిత్యగాత్మ తదు • పాసన మాత్మసమర్చయే కదా
ధరనిటు లౌటఁ గాదొకొ స • దా నరకోటికి రామనామసం
స్మరణము ముఖ్యకృత్యముగ • సమ్యగుదీరిత మయ్యె నెయ్యెడన్ ॥ ౩౮

వ॥ అట్లుగావున రామభజనంబు నరుల కవశ్యకర్తవ్యం బగుటం జేసి కృతిసమర్పణంబును నారాధనవిశేషంబ కావున నేతత్కృతిరత్నంబు శ్రీరామార్పణంబు గావింపం దలంచి. ౩౯

సీ॥ శ్రీమంతమయిన కృ • ష్ణామండలమ్మునఁ, గయికలూరను తాలు • కాకుఁ జేరి
సహకారసురసాల • జంబుజంబీరాది, రమణీయమందిరా • రామతతుల
నతులశోభా సము • న్నతమై కబొమ్మినం, పాడని వాడెడు • బ్రిస్తాపురికి
శాఖానగరమయి • సమధికలక్ష్మివి, శోభితం బయి యొప్పు • సూర్యపురము
గీ॥ నందు భక్తజనావనా • నందుఁ డగుచు, నాశ్రితావనదీక్షామ • హత్త్వమెసఁగఁ
జిరకృపావైభవము వెం • చేసియున్న, ఘనసుగుణధాము శ్రీరాముఁ • గని భజించి ॥

## కృతిసమర్పణము.

కం॥ రాముఁడు సద్గుణతిలకా, రాముఁడు నతదురితచయవి • రాముఁడు సుమహా
రాముఁడు సమస్తజగదభి, రాముఁడు నిక్కముగ సురల • లాముం డగుటన్ ॥

కం॥ రామునిఁ బ్రొవ్వడ్లలద, శ్యాముని నతిసన్నిహితమ • హామానిమన
ముని సంతతకరుణా, ధాముని భజియించి భక్తి • తాత్పర్యమునన్ ॥ ౪౦

కం॥ రామునిచే దశకంఠవి, రామునిచే నార్తజనశ • రణ్యాయశ్శోని
స్సీమునిచే భాస్కరశత, ధామునిచేఁ గలుగు నీప్సి • తంబు లటంచున్॥ ౪౩

కం॥ రామునికొఱకున్ రవికుల, తామరసోద్వృత్తహాస • ధామునికొఱకున్
భూమిసుతామోదమున్న, కామునికొఱకున్ బ్రణామ • కలనం బమరున్॥ ౪౪

కం॥ దాశరథివలన నుపచిత, గీశరథివలన సమస్త • గీర్వాణవిప
న్నాశరథివలన సాక్షా, ద్వ్యాశరథివలన జగంబు • వెలయు నటంచున్॥ ౪౫

కం॥ శ్రీరామునకున్ జగదా, ధారగుణోద్దామునకును • ధాత్రీతనయా
చారుమనఃకామునకు ద, యారసనిస్సీమునకు స • మర్పణగాఁగన్॥ ౪౬

కం॥ రఘురామునందు నుల్లస, దఘటవఘటనాప్రకాము • నందు బదనమ
న్మఘభగ్నరామునందున, నఘ చంచచ్చిత్తవృత్తి • యభిరతి నొందన్॥ ౪౭

కం॥ రామా! సేవక దురిత వి, రామా! కల్యాణగుణప • రాయణ తాని
స్సీమ! మహిమాభిరామా!, రామ! యశోధామ! సకల • రాజలలామా! ౪౮

అవధరింపుము. భవదంకితంబుగా జగన్నాథీయ మను ప్రబంధంబు వినిర్మింపం బూనితిమి. ఈకృతి బహూకృతిం గైకొని యస్మద ప్రసిద్ధిఁ గావింపుమని విన్నవించి తత్కథావిధానంబు విరచింపం దొడంగెద మెట్లనిన.

## క థా ప్రా రం భ ము ,

తే॥ నైమిశారణ్యమునను శౌనకుఁడు మొదలు, గాఁ గలుగునట్టి సంయమి • గణము దీర్ఘ
సత్రయాగంబు గావించు • సమయమునను, రోమహర్షణతనయుఁడా • రూఢయశుఁడు॥

తే॥ వార లడుగంగ నంచిత • వాగ్విభూతి, దగఁ బురాణాగమార్థక • థాకథనము
సలుపువేళ నా సంయముల్ • సకలగాథ, లింపుమీఱఁగ వినివిని • యిట్టు లనిరి॥

తే॥ సూత! సకలపురాణ వి • జ్ఞాత! వీవు, వ్యాసుని కృపావిశేషంబు • వలన నీకుఁ
దెలియఁ జాలనియర్థంబు • గలుగదొకటి, నీమహత్త్వంబు వర్ణింప • నేర్తుమెట్లు?॥

ఉ॥ వింటిమి మేము నీ వలన • విష్ణుమహాత్మ్యకథావిధానముల్
మంటిమి సర్వదుష్కృతస • మాజవినిష్కృతి నిక్కవంబుగాఁ
గంటిమి పుణ్యహేతుబహు • గాథలుసాధుల సచ్చరిత్రముల్
తొంటితెరంగు లన్నియును • దోరముగాఁ బ్రమదంబుమీఱఁగన్॥ ౫

కం॥ క్షమఁ దీర్థక్షేత్రమహ, త్వము లెన్నియొ వింటి మఖిల • దానతపోయ
జ్ఞములతెఱంగు లెఱింగితి, మమలగుణాకర! సమగ్రమగు • చందమునన్ ॥ ౫౪

కం॥ భావికలియుగమునను మను, జావళి ధీబలవిరహితు • లల్పాయుష్కుల్
గావున యజ్ఞతపంబులు, గావింప సమర్థతరులు • కారించుకయున్ ౫౫

ఆ॥ స్వల్పఫలము లైన • పెక్కుతీర్థక్షేత్ర, ములకు నరిగి యరిగి • యలయఁ జాల
రల్ప మగు ప్రయాస • మధికఫలప్రద, మైన దగు దేమి ? • యానతిమ్ము॥ ౫౬

కం॥ ఒకమాటు చూచి నంతనె, సకలదురితముల నడంచి • స్వశ్రేయసముల్
సుకరముగ నొసఁగఁ జాలిన, యకలంకక్షేత్ర మెద్ది? • యది దెల్పు దయన్ ౫౭

తే॥ సకలలోకోపకారవాం • ఛానిరూఢి, నడుగు చున్నట్టి మా ప్రశ్న • కవహితమతి
వగుచు నొప్పు సదుత్తర • మానతిమ్ము, ప్రాజ్ఞులకు మేలుబంతివి • ప్రజ్ఞ మెరసి॥

కం॥ అని శౌనకాదు లడిగిన, విని సూతుం డతిరహస్య • విజ్ఞానపరా
యణతావిఖ్యాతుఁడు దా, ననియెఁ బ్రహర్షమున వికసి • తాననుఁడగుచున్ ॥

ఇంద్రనీల ప్రతిమావతార కథనము.

చ॥ మునివరులార! మీరలు ప్ర•మోదముతోఁ బలుమారుఁ గోరినన్
వినిచితిఁ బెక్కుగాథలను • వేమరు నెన్ని వచించినన్ మనం
బునకును దృప్తి గల్గదిట • ముందు జగజ్జనతోపకారసా
ధన మగు నిట్టి ప్రశ్న ముచి • తంబుగ మీర లొనర్ప కుండుటన్ ॥ ౬౦

చ॥ అడిగితి రిప్డు మీరు పర • మాద్భుత మైన తెఱంగు దానిఁ
బడియెడు నుత్తరంబు బహు • భద్రవిధం బతిగోప్య మై తన
ర్చెడు జగదాత్మకుం డయిన • శ్రీధరు డానతిఁ జేసి మీకు నే
ర్పడ నెఱిఁగించెదన్ వినుఁడ • పారముదంబున సావధానులై॥ ౬౧

తే॥ విశ్వసర్గేచ్ఛచే ధాత • విపులతపము, నడపి హరిచేత నిగమముల్ • వడసి లోక
ములను సృజియించి ప్రజలకు•నలఘుధర్మ, సిద్ధిమఖములఁ గట్టడ•చేసెఁ దొలుత॥

కం॥ వేదాధ్యయనంబును య, జ్ఞాదిక్రతుదీక్షయును ని • హాముత్రసుఖా
పాదక మైనను సులభం, బై దొరకొని ప్రజల కభిమ • తార్థము లిడమిన్ ॥

కం॥ సులభోపాయంబున హరి, యలఘుకృపాపాత్రమై యి • హాముత్రమహా

ఫలసిద్ధి వరున కేగతిఁ, గలుగు నొకో యనుచుఁ దలఁచి ♦ కమలజుఁ డంతన్ ॥

చ॥ వనరుహనాభు భక్తజన ♦ వత్సలు నీరదనీలవర్ణుఁ గాం
చనమయవాసు శార్ఙ్గధర ♦ చక్రగదాసిధరున్ ♦ బరాత్పరున్
గనుగొని యీప్సితార్థముఁ బ్ర ♦ కాశము సేయఁ బ్రసన్నుఁడై జనా
ర్దనుఁడు సుధామయోక్తు లల ♦ రన్ దయ నానతి యిచ్చె నీ గతిన్ ॥

ఉ॥ తామరచూలి! నీ యభిమ ♦ తంబు నెఱింగితి సర్వలోకర
మ్యామతి నీలశైలమునఁ ♦ జారువినీలశిలాసమంచద
ర్చామహనీయమూర్తి దన ♦ రన్ వసియించి దిదృక్షు కోటికిన్
గామితసిద్ధు లెప్డు నవి ♦ కంపితలీల నొసంగు చుండెదన్ ॥ ౬౬

చ॥ అని కరుణామయుం డగుచు ♦ నానతి యిచ్చినఁ దాత ప్రీతుఁడై
చనియెఁ దదాదినీలగిరి ♦ సంచితవాసవరత్నమూర్తియై
కొని వసియించె శ్రీహరి య ♦ కుంఠితభక్తజనావనవ్రతం
బొనరఁగ నాత్మదర్శనశు ♦ భోన్నతి లోకుల కెల్ల నిచ్చుచున్ ॥ ౬౭

## పురుషోత్తమ క్షేత్రమహిమ.

కం॥ పురుషుం డన క్షేత్రజ్ఞుఁడు, పురుషోత్తముఁ డనఁగఁ బరమ ♦ పురుషుం డగుఁ ద
త్పురుషోత్తమవాసంబై, పురుషోత్తమ మనఁగ క్షేత్ర ♦ మునువిలసిల్లెన్ ॥

కం॥ పురుషోత్తమతీర్థగతున్, బురుషోత్తముఁ జూచినరులు ♦ భూరిభవాబ్ధిన్
దరియింతు రనాయాస, స్ఫురణన్ బహుజన్మపాప, పుంజరహితులై ॥

కం॥ పురుషోత్తమమున సాక్షా, త్పురుషోత్తముఁ డధివసింపఁ ♦ బురుషుండు భవా
తురుఁడై యడలుట సూడఁగఁ, బరమాద్భుత మింతకంటెఁ ♦ బాపముగలదే? ॥

కం॥ చని కనుఁగొన లే కుండిన, మనమునఁ బురుషోత్తమంబు ♦ స్మరియించినఁ జాలో
ఘనదురితము లడఁగును ద, నుఁ డంచితమోక్షపదము ♦ సరగునఁ గాంచున్ ॥

కం॥ మునులార! నన్ను మీరడిగిన ప్రశ్నకు నుత్తరం బ ♦ కిల్బిష మగు నీ
ఘనపురుషోత్తమ ర్థం, బని యెఱుఁగుఁడు కలుగ దిఁకఁ ద ♦ దన్యం బవనిన్ ॥

కం॥ అని సూతుఁడు సెప్పిన న, మ్మును లెడఁదను విస్మయము ప్ర ♦ మోదంబుఁ బెనఁ
గొన నాలకించి యాతనిఁ, గనుఁగొని యిట్లనిరి మరలఁ ♦ గౌతుకమతులై ॥

తే॥ ధాత్రి నా పురుషోత్తమ • క్షేత్ర మెవ్వి, ధర్మునఁ బ్రకాశ మొందె? నా • ద్యంతముసుఁద
దీయమహిమానువర్ణనం • మీయెడన్న, దంతరంగంబు లుప్పొంగ • నానతిమ్ము॥

వ॥ అని యడిగిన శౌనకాదిమహాత్ములకు సూతుం డిట్లనియె.

ఉజ్జయినీపుర వర్ణనము.

చ॥ అలరు సమస్తసంపదల • కాకరమై కర మైనభృత్కలా
కలితవతంసమూర్ధరుచి • కందళకందళదిందుకాంతని
ర్మలవరగోపురాంతరచ • రన్నిటలాంబకభాసమానమై
యలఘునిరూఢి నుజ్జయిని • యన్ పురి మాళవదేశరత్నమై॥

ఉ॥ ఆ పురరత్నసౌధశిఖ • రాగ్రవిచరిష్ణువధూజనస్మరో
ద్దీపకలోచనాంతదృగు • దీరితచంచలచంచరీకమా
లాపరివారితాననవి • లాసమహోత్పలవాపభావళీ
లాపరిభూతి నచ్చరవె • లందులు గండ్రినిమేషదృష్టులై॥

చ॥ త్రిదివనివిష్ట సౌధవిత • తిన్ బరికించి తదీయశిల్పసం
పదకు మెరుంగువెట్టిన క్ర • మంబున నప్రతిమానచాతురిన్
బొదలఁగఁ జేసి రీనగరిఁ • బొల్చెడి మేడల నీడులేని యొ
ప్పిదముల నిట్టివంచు విని • పింపఁగ శక్యమె? మమ్ముబోంట్లకున్॥

మ॥ సకలర్తుప్రచరత్ఫలోద్గమజనుష్ • తాపూర్తికృత్తత్పురీ
ప్రకటారామతరువ్రజంబుఁ బురణిం • పన్ జేసి హో! క్షీరవా
ర్ధికనత్పారభవిష్ణు నిర్జరపురీ • వృక్షంబులన్ దాత సా
మ్యకళన్ బొందమిఁ దెల్పఁగల్పతరునా • మంబుం జేఁజూ వానికిన్॥

మ॥ అతిలోకోజ్జ్వలశిల్పకల్పనల హృ • ద్యంబైన యావీటి యా
ద్భుతసౌందర్యము దృష్టిదోషచలనం • బున్ బొందకుండన్ జుమీ
వితతాభ్రంకషసాలగోపితము గా • వించెన్ గృహాంచత్పర
శ్శతకేతుచ్ఛదగుప్తి మింటి కిడె నెం • చన్ దాత నేర్పొప్పదే!॥

మ॥ నవరత్నాంచితసౌధయూధకృతనా • నాధాతురాగాఢ్యమై
లలితానంబయి దంతురాంతరజనా • లంకారమై విశ్వధా
త్రివిలాసంబునఁ బొల్చునప్పురము న • ర్థిం జుట్టి వీతెంచెనో
లవణార్ణోనిధినాఁ దగున్ బరిఘదు • ర్లంఘ్యప్రాకారోన్నతిన్॥

సీ॥ ఏకముఖంబున ♦ నెల్లవిద్యలు దాల్చి, చతురాస్యు లగు విప్ర ♦ సత్తములును
కువలయానందంబుఁ ♦ గూర్చుచుఁ జక్రిరం, జన మేమరని రాజ ♦ సత్తములును
స్వాశ్రయమిత్రప్రా ♦ పకవసూపగతి లోకోత్తరుల్ ధనదులౌ ♦ నూరుభవులు
హాలముఖప్రాప్తమ ♦ హాప్రాభవాఢ్యులౌ, బలసమున్నతులంఘ్రి ♦ భవకులంబు

గీ॥ శరదములఁ బోలునరదముల్ ♦ ద్విరదములును, తురగములువీరభటులు దం ♦ తురముగాఁగ
నెందుఁ గొరతేని సిరులచే ♦ నిరవుమీరు, నాపురం బొప్పు నధరిత ♦ ద్యోపురంబు॥

తే॥ ఎన్న నాకారభేద మొ ♦ క్కింత గాక, నగము లనరాదె? యష్టద ♦ నాగములను
తార్క్ష్యనామంబు దమకు సా ♦ ర్థకము గాఁగఁ, గదియుఁబురుషోత్తములఁ
దురం ♦ గములగములు॥

తే॥ చారురూపసౌందర్య సం ♦ చారములను, వారు వీ రన వచ్చు న ♦ వ్వారసతుల
నచ్చరలఁ జూచువారల ♦ కబ్బురముగఁ, జూపులో భేద మించుక ♦ సూపకున్న॥

॥ ఇట్లు లెనలేని సిరులచే ♦ నింపునింపు, నట్టి యుజ్జయినీపురం ♦ బనవరతము
నేలుఁజక్రహితుం డయి ♦ యునుఁడనంగ, నిందునహపాత్రియైన ధా ♦ త్రీం
ద్రుఁడొకఁడు॥

కం॥ ఇంద్రద్యుమ్నుం డనఁగా, సౌందర్యయశస్సహితుఁ డై ప్ర ♦ జారంజనని
స్తంద్రగతి నేలు నయ్యవ, నీంద్రుని బోలఁగఁ గలుగ ♦ రెన్నండున్నృపుల్॥

శా॥ నైల్యం బింతుల కొప్పులందఁ బహుబం ♦ ధంబుల్ రతిక్రీడలన్
లౌల్యంబు ల్వనితాక్షులంద కృశత ♦ రామావలగ్నంబులన్
స్థౌల్యం బబ్జముఖీస్తనద్వయి నమాం ♦ ద్యంబుల్ నడన్ దృష్టిచాం
చల్యంబుల్ జనుఁ గాని కల్ల విఁకఁ ద ♦ ద్రాజ్యంబు నం దెచ్చటన్॥

తే॥ విప్రయోగంబుప్రణయోప ♦ వేశములనె, యశ్రుపాతంబుసంతోష ♦ మందె తమము
రాత్రులందెయుత్పథవృత్తి ♦ రతులయందె, కాకతద్రాజ్యమున నెందుఁ ♦ గలుగఁ బోవు॥

తే॥ ప్రజలఁ దాఁగన్నప్రజలట్లు ♦ ప్రబలఁజేసి, ధర్మవృషభంబు నాల్గుపా ♦ దములనడపి
యాతఁ డిల యేలినట్లు మాం ♦ ధాతృముఖ్యు, లైన నేలిరె? పొగడిక ♦ కనుట కాదు॥

తే॥ అవ్విధంబున సామ్రాజ్యపుం • బతులధర్మ, విభవ కీర్తిసమృద్ధులు • విస్తరిల్లఁ
దనరుఁ దానొక్కఁడే సాటి • యనఁగ మేఁటి, యగుచు నిలనేలుచుండెడియవసరమున॥

ఇంద్రద్యుమ్నునికి సంతానము లేకుండుట.

తే॥ ఉల్లమలరెడు క్రొత్తావు • లుల్లసిల్లఁ, జెల్లుగాఁ బూయుఁగాకేమి • మల్లె? కులము
నిలుప నొకపండుపండఁగా • నేరనట్లు, కలిమి కెన లేని కొకసంతు • గలుగదయె॥

ఉ॥ దాపునఁజేరి తల్లికినిఁ • దండ్రికి ముద్దులునూపి వింత రా
రాపులు సేయుచున్ దెలియ • రాని మిటారఁపు ముద్దుపల్కులన్
దేపకుఁదేనె వెల్లువలఁ • దేలుచుఁబున్నియ మబ్బదేని యి
న్నీ! పసిపిల్లలేనియిలు • చీఁకటికోణ మటంచుఁజెప్పరే॥

కం॥ సంతానహీనుఁ డగు భూ, కాంతుం డఖిలక్రియలు • ఘనదానము ల
త్యంతము లగు ధర్మంబులు, సంతుష్టమతిన్ బొనర్చె • సమ్యగ్భంగిన్॥

॥ అఖిలశాస్త్ర పురాణాగ • మాదులందు, హితమతిఁబ్రశంసితము లైన • వ్రతములందుఁ
జెనసికల్పోక్త విధి రాజు • చేయుచున్న, యట్టివ్రత మొక్కటైన లే • దవనియందు॥

తే॥ వ్రతము లెన్నెన్నొ చేసిభూ • వరుఁడు విసికి, వేసరియిదేటిగోడవ యీ • వ్యతేష
ణాత్రయోన్మేషమున సుఖా • నంద మొందు, వారిఁగంటిమె? దుఃఖప్ర • వణులఁగాక॥

సంసారసుఖ నిరసనము.

కం॥ దారాపత్యధనాదులఁ, గోరుట దుఃఖంబు మెండ • గుకన్ దుదకవి చే
కూరినను దుఃఖమే యగు, ధీరుఁ కివ ణజిఘృక్షు • ద్రెకొఁనఁదగునే?

కం॥ పారావారముగతి దుష్పారము సంసార మిందుఁ • బడి యున్నఁడు నే
రముఁ రక యూరకఁ, గారుపడి నశించు నరుఁడు • గర్మవశమునన్॥

తే॥ అతులసంసారఘోరదా • వాగ్నితప్త, లకు సుధారసవర్షమా • లలితవాసు
దేవసేవావిశేషంబు • గావున హరి, పాదభజనాద రుండనై • బ్రదుకువాఁడ॥

కం॥ అనితలఁచి జనార్దనపద, వనజసపర్యానిరూఢి • వర్తిల్లుచు న
నవరుఁడు తదేకథా, ననివిష్టత నన్యచింత • నలుసార నీకన్॥

ఆ॥ తనువు ధనము మనముఁ • దప్పక నిత్యంబు, హరిసమర్పణముగ • నాచరించి
విష్ణుసేవ కాక • వే రొండు కృత్యంబు, మరచిమెలఁగు చుండె• మనుజవిభుఁడు॥

కం॥ ఏ యేసమయంబుల మరి, యే యే తీర్థముల మరియు • నేయేవిధులం
దేయేయర్చారూప, చ్ఛాయల నర్చింప హరి ప్ర•సన్నుండగునో ॥

ఇంద్రద్యుమ్నుని కడకు సిద్ధుఁడు వచ్చుట.

మ॥ అనిడోలాయితచిత్తుఁ డై యవనినా • థాగ్రిసరుం డెందరో
ఘనులన్ సర్వపురాణదర్శనుల వి • జ్ఞానాఢ్యులన్ మానులన్
గని ప్రార్థించుచు నుండుకాలమున సా • క్షాచ్ఛంభుఁ డీతం డనన్
జనుదెంచెన్ వెస సిద్ధుఁ డొక్కఁడు యదృ•చ్ఛన్ దైవయోగంబునన్ ॥

ఉ॥ వచ్చినసిద్ధుఁ గాంచి జన • వల్లభుఁ డీతఁడ నిక్కవంబుగా
నచ్చతురాననుం డనుచు • నర్ఘ్యసమర్చన లిచ్చి భక్తి లో
నచ్చుపడంగ మ్రొక్కి విన • యంబున నిట్లనె నోమహాత్మ! మీ
రెచ్చటనుండి యెచ్చటికి • నేగుచు నిట్లరుదెంచి రీడకున్ ॥

కం॥ ఏయేతీర్థక్షేత్రము, లేయే పుణ్యస్థలముల • నేయే కొండల్
పాయక సేవించితి రిల, నేయే వింతలను గంటి•రెంతయుఁ బ్రీతిన్ ॥

తే॥ మీరు ప్రాజ్ఞులు గావున • మీకుఁ దెలియ, రాని యట్టివిశేషము•లీ నిఖిలము
నందుఁ గలుగంగ నేరవు • నాదుమనవి, విని సదుత్తర మిమ్ము స • న్మునివరేణ్య॥

తే॥ అవని నేతీర్థ మతుల మ • హాత్మ్యకలిత, మెందు నేరూపమునను ము•కుందుఁబూజ
సేయ సంప్రీతుఁ డగు? నతి•శీఘ్రముగను, దాఁపఁకిది యెరిగింపు స • త్యముగ నాకు॥

వ॥ అని యడిగిన నరనాథున కా సిద్ధసంయమి యిట్లని యానతిచ్చె॥ ౧౦౬

ఇంద్రద్యుమ్నునికి సిద్ధుఁడు ఇంద్రనీలమూర్తి మహిమ సెప్పుట.

॥ పార్థివోత్తమ! విష్ణు • భక్తుఁడ వగు నీకుఁ, జెప్పరానట్టి వి • శేష మొకటి
గలుగునే! వినుము నేఁ • గంజగర్భుని చేత, విన్న విశేషంబు • విశద పరతుఁ
బురుషోత్తమం బనఁ • బరఁగుపుణ్యక్షేత్ర, మమరుఁ బూర్వాబ్ధి తీ•రమున నొక
చెలఁగు నచ్చట మేరు•శిఖర మొక్కఁటినిగూ, ఢము గాఁగ నీలర•త్నమయము గుహ

గీ॥ నందు నీలాశ్మమూర్తి శ్రీ•హరివసించు, నంచితాప్రాకృతమహస్స•మగ్రుఁ డగుచు
నచటనయ్యింద్రనీలమూ•ర్త్యంచితుని ము, కుందు దర్శించి కాంక్షిత• మొందు నరుఁడు

కం॥ లోకానుగ్రహశీలుం, డై కమలాక్షుండు నచట • నర్చామూర్తిన్
గైకొని పురుషోత్తమనా, మాకలితుం డై వసించె • ననవధికకృపన్॥

తే॥ పురము దేహంబు తచ్ఛాయి • పురుషశబ్ద, వాచ్యుఁడైన క్షేత్రజ్ఞుండు • ప్రత్యగాత్మ
పురుష కారణుఁడగు పరా • త్పరుఁడు విష్ణుఁ, డలరుఁ బురుషోత్తమాఖ్య చే • నవనినాథ!

తే॥ అట్టిపురుషోత్తముండు స్వ • యంప్రభుండు, నిత్యసన్నిహితుం డయి • నిలుచుకతన
నుర్వి నాతీర్థము పురు • షోత్తమాఖ్యఁ, గాంచు విశ్వంబునందుఁ బ్ర • ఖ్యాతలీల.

తే॥ బహువికల్పంబుగఁ బురాణ • పథములందుఁ, దీర్థమాహాత్మ్యములు పెక్కు • తెలుపఁ బడెడుఁ
గాని పురుషోత్తమక్షేత్ర • కల్ప మైన, తీర్థరాజంబు లేదు సం • దియము వలదు॥

తే॥ విష్ణునకుఁ దుల్యుఁ డగునట్టి • వేల్పు లేఁడ, నంగ నిదియర్థవాద మ • నంగఁ దగునె?
యట్లు పురుషోత్తమము వోలు • నట్టితీర్థ, మెందు లేదు ముమ్మాటికి • నిది నిజంబు॥

కం॥ పురుషోత్తమ తీర్థగతున్, బురుహూతమణిప్రకలిత • మూర్తిసమేతున్
హరిదర్శించిన మాత్రనె, యరనిముసములోన ముక్తి • నందు నరుఁ డొనిన్ ౧౧౪

తే॥ సత్య మిది సత్య మిది త్రిధా • సత్య మిద్ది, మది బరమగోప్యముగ దాఁచి • నదియిసుమి
విష్ణుభక్తుఁడ వని నీకు • వేడ్కతోడ, దీనిఁ దెలిపితి సందియ • మూనవలదు॥ ౧౧౫

వ॥ అని చెప్పినసిద్ధసంయమి నాలోకించి దేవా! యిట్టివిశేషంబు భూలోకంబున గృపాళుండగు వాసుదేవుండు సంఘటించె నేని మధ్యమలోకవాసు లెల్లరు నవశ్యంబుగఁ దద్దర్శనంబునం జేసి ముక్తు లయ్యెదరు గాదె? వేదశాస్త్రసమ్మతంబు లగు కర్మజ్ఞానంబులతోడం బ్రయోజనం బిసుమంతయైనం గలుగదు గదా. ఈసందియంబు నివారింపవే! యని యడిగిన రాజునకు సిద్ధుం డిట్లనియె.

యము డింద్రనీలమూర్తియగు విష్ణుని కడకు వచ్చుట.

కం॥ నరవర! నీసంప్రశ్నం, బురు వెంతయు నిట్టు లముగ • నోపుదు రె! యొరుల్
పరమం బగు గోప్యం బిది, హరిచే మును బ్రహ్మ వినిన • యది యిది వినుమా!॥

చ॥ హరి పురుషోత్తమాఖ్యనమ • దంచితతీర్థమునందు నింద్రనీ
లరుచిరమూర్తిఁ గైకొని మె • లంగుట మధ్యమలోకవాసు లె
ల్లరునుఁ దదీయదర్శనఫ • లంబున మోక్షము నొందుచున్కి న
త్తరణిజుఁ డాత్మసంస్థితి వ్య • థాయగుటన్ సువిషణ్ణచిత్తుఁడై

ఉ॥ అంతటఁ డొక్క-నాఁడు ప్రియ•మారఁగ నుర్వికి వచ్చి సాగరో
పాంతమునన్ మహేంద్రమణి • హారిపుర్ధరుఁ డైన యిందిరా
కాంతునిఁ జూచి భక్తి నవి•కస్వలసంచితపాణికంజుఁడై
చెంత నొగిన్ నమస్కృతులు • చేసి నుతుల్ పచరించి యి ట్లనెన్॥

సీ॥ దేవ! స్వయంవ్యక్త•మై వెల్గు నీ మూర్తి, సాక్షాద్గతిని నీ వె•సంగి యునికి
నిన్ను దర్శించిన • నిఖిలమానవులును, మోక్షభాజనులయి • పోవు చునికి
నా లోకమెల్లశూ•న్యంబయ్యెమదధికా, ర ప్రసక్తియును వ్య•ర్థమయితోఁచె
నదిగాక వేదశా•స్త్రాదిష్టకర్మ వి,జ్ఞానఫక్కులు వృథా•జల్పితంబు

గీ॥ లయ్యె నదిగాన నిదె దండ • మఖిలనాధ!, నీయుసన్నిధి నుంచితి•నాయుతప్పు
సైఁచి భవదీయదర్శన • క్షణనిరూఢ, ముక్తి భాజనుఁ జేయుమి!•భూరికరుణ॥

ఇంద్రనీలమూర్తియగు విష్ణుఁడంతకునితో ముచ్చటించుట.

కం॥ అని విన్నవింప నంతకుఁ, గని వనజాక్షుండు గాఢ • కారుణ్యరసా
భినివేశ మేర్పడంగ ని, ట్లనియెన్ బ్రావృట్పయోధ • రారవఫణితిన్॥

చ॥ పరమదయార్ద్రభావమున • భక్తజనానుజిఘృక్షచే వసుం
ధర నిటు నిల్వఁగోరితిని • దధ ము మామకదర్శనంబుచే
నరులు విమోక్షభాగు లయి • నా రని నీ యధికారపద్ధతిన్
దొరఁగుట మేలుగాదు నిను • తొందరనొందక మద్వచస్స్థితిన్॥

గీ॥ అ తరంగస • మానీతవాలు గా, వితతిచే నీ శైల • మతినిగూఢ
మగఁ జేసి యిందుమ • న్మూర్తి కాంచనలత, వేష్టితంబుగను గా • వించి గోప్య
మొనరింతుఁ బ్రాకృత • జనులకు వృక్షల తావృతంబగు సైక • తంబె దృశ్య
మగుఁ గాక తీవ్రభ • క్త్యతిశయనిష్ఠు లౌ, జ్ఞానుల నీల • శైల మింద్ర

గీ॥ నీలమూర్తియుఁ గనఁబడు•నీ లతాదు, లెల్లఁగాంచనమయము లై•యొసఁగితోఁచు
నట్టి మన్మూర్తిదర్శనం • బ నట్టి, వారికే మోక్షపదవి చే • కూరుఁగాక॥

గీ॥ అన్యులకు క్షేత్రదివ్యమ • హాత్వశక్తి, నిద్ధపుణ్యలోకాప్తి ల • భించుఁ గాక
ప్రాకృతుల కెల్లక్షేత్రద • ర్శనజిఘృక్ష, గలుగకుండఁగ మన్మాయ•సలుపుగాత॥

కం॥ అని యాదేశించి జనా, ర్దనుఁ డచట నదృశ్యమూర్తి ♦ యై నిలిచెను గా
వున నృప! నీప్రశ్నమునకుఁ, బని తే [illegible] ము ♦ పాత్రముగాఁగన్॥

వ॥ అని చెప్పి సిద్ధుండు నిజేచ్ఛం జనియె నదియాదిగా సింహ[illegible]ద్యుమ్నుండు పురుషోత్తమ క్షేత్రదివ్యత్వానుసక్తుండై తత్తీర్థనిర్దేశం బెప్పటినో యనియును నది యెట్లు లభ్యంబగుననియు విచారించుచుండె నిట్లుండునంత

యజ్ఞనారాయణు జననకథ.

ఉ॥ ఆపురిఁ గల్గు నొక్కద్విజుఁ ♦ డాగమతత్త్వరహస్యవేది గౌ
రీపతిపాదపద్మభ్రమ ♦ రీకృతచిత్తుఁడు నుంఛవృత్తి దీ
క్షాపరుఁ డాహితాగ్ని బుధ ♦ సత్తముఁ డంచితకర్మకుండు సు
ద్దీపితబోధశాలి క్షితి ♦ దేవవరేణ్యుఁడు విష్ణుశర్మనాన్॥

విష్ణుశర్మ దరిద్రుఁడగుట.

తే॥ అతఁడు భార్యా ద్వితీయుఁడై ♦ యర్థ్యవృత్తి, నప్పురంబున నివసించుఁ ♦ నవసరమునఁ
బండితులపాలి దేవత ♦ పరమమా ద, రిద్రలక్ష్మి వర్తించె ♦ దద్గృహమునందు॥

చ॥ సిరి పెను పొంద భోగములఁ ♦ జెందఁగ జెందము గందళించి దు
స్తరమగు సంసృతిన్ విడువఁ ♦ జాలక పొందునధోగతిన్ దరి
ద్రిదమయమైన గ్రహంబున వి♦రాగము చుల్కన లభ్యమై భవో
పరముఁ గాంచు జ్యేష్ఠతనుఁ ♦ బాపిలు శ్రేష్ఠత లేమి కొప్పదే?॥

తే॥ అట్లు దారిద్ర్యయుతుఁడై ♦ నతఁడు ధీర, తావినుతుఁడనుగనక ని♦త్యము నయాచి
తోంఛవృత్తి పరత్వంబు♦నొంది బ్రహ్మ, తత్త్వవిదుఁడై వసించు న♦ద్ధాత్రిసురుఁడు॥

యజ్ఞనారాయణు జననము.

తే॥ చక్రవర్తిత్వలక్షణ♦సహితుఁడైన, పుత్రుఁ డొకఁ డుద్భవించె నా♦భూసురునకు
నఖిలలోకైక విఖ్యాతుఁ♦డగు నటంచు, నతని జ్యోతిర్విదులు సమ♦యంబు దెలిసి॥

యజ్ఞనారాయణుని తలిదండ్రులు చచ్చుట.

తే॥ ఎన్నిసల్లక్షణము లుండ♦నేమి! కర్మ, మనుభవింపక తీరునా? ♦ యజ్ఞునకైన
నుచితగతి కొన్ని నెలలు గ♦డచెనో లేదొ, తల్లిదండ్రులు కరవైరి ♦ తత్సుతునకు॥

మాతాపితృహీనుఁడగు యజ్ఞనారాయణుని రాజు పోషించుట.

మత్తకోకిల.

తల్లిదండ్రులు లేనిబిడ్డ యి ◆ కెంజటంబును జూచివా
రెల్ల జాలిజనించి సాకిరి ◆ యెట్టి లోపము లేక నా
పిల్లవాని యదృష్టమెట్టిదొ ◆ బిడ్డ లోపలు లేని భూ
వల్లభుండు పరిగ్రహించెను ◆ వానిఁ బోషితుఁ జేయఁగన్ ॥

క౦॥ మాతాపితృహీనుండగు, నీతని నీతనయు నట్టు ◆ లెద నెంచుచు సం
జాతకృపం బోషించుచు, నాతి! యనిమొనఁగె భూమి ◆ నాథుఁడు సతికిన్ ॥

వసంతతిలక.

ఆరాజపత్నియును నిజాత్మజు ◆ నట్లు ప్రేమో
దారాత్మయై పెనుచుచుండెను ◆ తత్ప్రియామా
ర్గారేఖితీరునఁ బ్రివృద్ధినిఁ ◆ గాంచె నాతం
డౌరా! పురాకృతసుకర్మము ◆ హత్వయుక్తల్ ॥

యజ్ఞనారాయణుని రాజు పుత్రునిగాఁ బెంచుట.

క౦॥ అల్లారుముద్దుగా భూ, వల్లభుఁడును సతియుఁ బెనుప ◆ బాలుఁడు గడువ
ర్థిల్లగ నుపనయనాదుల, నెల్లను విప్రోచితముగ ◆ నే చేయించెన్ ॥ ౧౩౬

తే॥ బ్రాహ్మణోచితసంస్కార ◆ ములెల్ల జరపి, కడుపు విప్రుని యింట నే ◆ నడపుచుండె
దల్లిదండ్రులటంచు నా ◆ దంపతులను, దలఁచి యట్లనె బాలుండు ◆ పిలుచుచుండె ॥

తే॥ యజ్ఞనారాయణుండను ◆ నాఖ్యయొసఁగ, పుత్రనిర్విశేషంబుగా ◆ భూమివరుఁడు
పెంచుచుండఁ గొన్నాళ్ళకా బిడ్డబుద్ధిఁ, దెలిసియిట్లని యోజించెఁ ◆ దలఁపులోన ॥

యజ్ఞనారాయణుని సందేహము.

మ॥ తలిదండ్రుల్లద నాకు వీరు మదిపు ◆ త్రప్రేమ కేలోపమున్
గలుగం బోదటులయ్యు భోజనము నా ◆ కిట్టా దేవు గేహంబునం
దలవాటుగ్ బొనరించి రిందులకు నే ◆ మైనన్ విశేషం బొనిన్
గలుగంగా వలె నంచు నెంచి యడిగెన్ ◆ క్ష్మాపాలు నీ యర్థమున్ ॥

పుష్పితాగ్ర.

నరపతి విని చాటా ◆ నర్వనేలా, ధరణిసురాన్వయవ ◆ ర్థనుండ వెన్నన్
గురుమతి కథ పూస ◆ గుచ్చిన ట్లా, దరమునఁ జెప్పెదఁ జి ◆ త్తగింపు మెల్లన్ ॥

యజ్ఞనారాయణుఁడు బ్రాహ్మణసుతుఁడని చెప్పుట.

కం॥ అని విప్రసుతుం డనుటయు, జననియు జనకుండు మిగుల • శైశవమందున్
జనుటయుఁ దాఁ బెంచుటయును, ననుమానము లేక చెప్పె • నాద్యంతంబున్॥

మ॥ విని యాతం డనె యేమహీసురుఁడఁ బృ • థ్వీభర్తకా దీవు న
న్ననుకంపామతిఁ బెంచితేని యిది న్యా•యంబా! భవద్దివ్యభో
జనమే నూరక చేయ నన్నుచితమా • సత్కృత్యమం దిప్పుడ
నియోగింపు మొనర్తు నామనికి కా•ర్పణ్యంబు సిద్ధింపఁగన్॥

తే॥ అనినవిని భూతలేంద్రుఁడి•ట్లనియె నేన, పుత్రకుఁడ నిన్నుఁ బెంచితిఁ•బుత్రుఁడనుచు
నెరవుగా నేల? యీరాజ్య•మెల్ల నీది, కాదె? తగవానె? నీకు ని•క్కరణిఁ బలుక॥

తే॥ వృద్ధతను గాంచినట్టి నా•వెనుక రాజ్య, కర్త వీవకదా! ఋణ • కలనమెట్లు?
లనిన బాలకుఁడిట్లనె•నవనిసురుఁడఁ, గానరాజ్యార్హతయు నాకుఁ•గలదె? తండ్రి

తే॥ పుణ్యవశమున నీ చేత • భూవరేంద్ర, తనయనిర్విశేషంబుగాఁ • బెనుపబడితి
నింతచాలదె? యిఁక రాజ్య•మేలఁ గోర, భృత్యభావంబు చాలు ను • ర్వీశ! నాకు॥

యజ్ఞనారాయణుని దేశసంచారమునకు నియోగించుట.

వ॥ అని నిర్బంధించిన భూవరుండును నతని తలంపెరింగి యక్లైని వలసిన ధనంబుగొని కతిపయ పరివారసహితుండవై వసుంధరఁ గలయం గ్రుమ్మరి యెందేని యపూర్వంబులగు విశేషంబు లున్న నవి నా కెరింగింపుమనెడి. విశేషంబుగఁ బూర్వసముద్రతీరంబునఁ దిరిగి యచ్చటఁ బురుషోత్తమక్షేత్రంబు గలదని వింటిని; గానఁ దద్విశేషంబు లెల్ల నరసి నాకు నివేదించుమని యాజ్ఞాపించిన నవ్విప్రబాలకుండు తదాజ్ఞానురూపంబుగా వెడలి.

మ॥ బహుదేశంబులు సంచరించి బహుదే • వస్థానము ల్గాంచి త
ద్బహుచారిత్రము లాలకించి బహుచి • త్రంబు ల్విలోకించి త
న్మహితోదంతము లెల్ల భూపతికి స•మ్యగ్భంగిఁ బుత్తెంచుచున్
బహుకాలంబున కేగెఁ బూర్వజలధి • ప్రాంతంబు వీక్షించుచున్॥

యజ్ఞనారాయణుఁడు పూర్వసముద్రతీరారణ్యము సొచ్చుట.

కం॥ పురములు నూళ్లును బల్లెలు, గిరులు సరిత్తులును జెక్కి • కేవలఁ గనుచున్
శరనిధి చెంగటఁ గడు ద, వ్వరిని యరిని చొచ్చె దుర్గ•మారణ్యంబున్.

# జగన్నాథీయము

కం॥ దవ్వెంత యరుగ మానిసి, నవ్వడి యిమ్మంత లేక • శార్దూలాదుల్
గ్రొల్వెసలారఁ జరింపఁగ, నవ్వడిఁబరిజనులు తీఁనంది మరలుదుర్ ॥

కం॥ ఘోరారణ్యం బిది యిం,దే రూపున నైనఁ జిత్ర • మెద్దియొ యుండున్
వేరుగ లే దేమియునని, భూరమణున కెట్లు దెలిపి • పుచ్చెద ననుచున్ ॥

కం॥ తలఁచి మనంబును గడు ని, శ్చలముగ నొనరించి ధైర్య • సహితుండై తాఁ
దొలఁగని పూనిక నొక్కఁడు, నలవున నయ్యడవిలోన • నరిగె రయమునన్ ॥

చ॥ పులులు నెలుంగులున్ శరభ • ముల్ హరులున్ గరులున్ దరక్షువుల్
బలితఁపు పేదులున్ బలుసి • పంగులు మన్నులు దున్నలున్ హాలా
హాలవముదుగ్రపన్నగచ • యంబులు గ్రిందుగఁ దిర్మరన్ మదిన్
గలఁక యొకింతలేక భయ • కంపము నొందక నేగె ధీరుఁడై॥

కం॥ ఆకలియు డప్పియును గడుఁ, బైకొనఁ గాయలును గసరు • భక్షించుచు ని
ద్రాకలన మఱిగి పవలును, జీఁకటి యని యెంచ కేక • చిత్తం బగుచున్ ॥

కం॥ పూనిక విడవాడి వెనుక, కై నీచత నడుగుకంటెఁ • గష్టము గలదే?
మానవుఁడు నిత్యమా! యే, మైనం గానిమ్మ టంచు • నరిగె నుడుగకన్ ॥

కం॥ పృథివీసురబాలుం , విధమున నక్కానలోన • వెసఁ జని చని య
ప్పృథమునకు నవ్వల మనో, వ్యథఁ దఁగఁ గాంచె రమ్య • మగు నొక తలమున్ ॥

యజ్ఞనారాయణుం డరణ్యంబున రమ్యాశ్రమంబు చూచుట.

॥ పులులు మచ్చికఁ దెచ్చి • పులినోటి కందిచ్చి, యింపుగా లేళ్ళఁ బో • షింపుచుండ
దుండంబులను జాఁపి • తొడరి యూయ్యెలలూఁపి, కరులు సింగఁపు శాబ • కములఁ జోపఁ
బడగ లెచ్చగ విప్పి • పరపు నీడలఁ గప్పి, కాలాహిచయ మెలు • కలను బ్రోవ
ఘనపక్షకంబులు పొంచి • గంతులు వేయించి, పలుమారు శశడింభ • ములను ద్రిప్ప
॥ జాగిలఁపు కూనలకు మేత • సంతరించి, గండుఁ గ్రోఁతులు విద్దెముల్ • గరపుచుండ
జాతివైరము విడి వన్య • సత్త్వసమితి, కూడి నెయ్యంబుతోఁ జెర • లాడుచుండ॥

చ॥ సురుచిరపల్లవప్రసవ • శోభితమంజునికుంజపుంజబం
ధురితసుగంధలోలుపమ • ధువ్రతనూతనగానమాధురీ
పరిచయసంతతశ్రవణ • పారణకోకిలకాకలీమనో
హారమ్మదు .తికాకలిత • మై హితమై తగు నిష్కుటం బటన్॥

ఉ॥ దట్టముగాఁ జిగిర్చి విత • తచ్ఛదసంపద యుల్లసిల్లఁ గ
న్పట్టి బెడంగు నీడలఁ బె • నంగి మనోహరలీలఁ జెంత ను
న్నట్టి సమస్తప్రాణులకు • హాయి యొసంగు వనస్పతిప్రజం
బట్టె గనంగొనంగ హృద • యంబు ప్రమోదనిమగ్నతన్ గనున్॥

వ॥ అది మఱియును వటకుటజకపిత్థాశ్వత్థసాలతాలహింతాలరసాలకందరాల జంబుజంబీరవానీరనీరజకోవిదారమందారసిందువారకాబర సహకార మధూకలకాంకోలకతిలకవకులవంజులపిచుళపిచ్ఛిల నిచుళసరళమరువకకురువకపాటలాశోక నాగ పున్నాగపారిభద్రపీతద్రుసర్వతోభద్రకవిద్రుమద్రుమోత్పలమహీలాగరోధ్రఘలీపనస తినిశచంపకచాంపేయజీమూతమాగధీమాలతీ నవమాలికాకుందబంధూకకరవీరబీజపూరప్రముఖమహీరుహనికురంబకరంబితపల్లవాంకురప్రకరసుకరాంశు ప్రశంసనీయప్రవాళమాలికాపరివాతకోరకవారకముక్తాప్రయుక్తకోమలదళనారిన్మణిఫలకతల ప్రసరత్కుసుమరసవిస్పృమరపరాగపూరసందర్శనీయచందనద్రవసమంక విష్ణపసంతనిరంతరోరలీకృతప్రచారసంపాదిత మనోజ్ఞతావిరాజితంబును, శుకపికశారికా కలకలారావమేదురంబును, నగుచు నపూర్వ శోభాభిరామంబై విలసిల్లుచుండె. అట్టి సుందరప్రదేశంబు సందర్శించి యమందానందకందళితాంతరంగుండై యందుఁ జొచ్చి, యా ధరాబృందారకనందనుం డమందగమనంబున నరుగు చుండె నని చెప్పఁ బయ్యెను.

ఆశ్వాసాంత్యము.

మ॥ లవణార్ణోనిధిసేతుబంధన విధా • లంఘ్యప్రభావోదయ
ప్లవమానక్షితిభృత్ప్రధ ప్రవిచర • ల్లావంగ సేనాముహు
ర్లవమానాసురవీరవిక్రమయుత • ల్లంకాపురీగోపురా
గ్రవసద్రావణగర్వనిర్మథనజా • గ్రత్సాక్షికాంచత్కరా॥ ౧౬౦

కం॥ శరణాగతభరణాయత, కరుణాపరిణాహచిత్త • కమలకమలభూ
పరిణీతశుభాచరణా, చరణాగ్రరజఃపునీత • సాధ్వీకరణా॥ ౧౬౧

పుష్పితాగ్రవృత్తం

రవికులజల • రాశిపూర్ణచంద్రా, ప్రవితతసంచిత • భవ్య కీర్తిసాంద్రా
నవభుగధిప • సంస్తుతావనీంద్రా, ర్చ్యవిపుల కీర్తిశ • రణ్యరామచంద్రా॥

గద్య.

ఇది శ్రీమద్వృషాకపి కృపాకటాక్ష పరివర్ధిత సహజసారస్వత
సమ్పాదిత ప్రబంధకవిపంచాననబిరుదాభిరామ విశ్వామి
త్ర బ్రహ్మర్షి సంప్రదాయాడవి నందగిరివంశాబ్ధిసో
మసహజ సౌహార్దమహోద్యమ సాంబ
శివవేంకటప్పరాయకవి లలామ
వినిర్మితంబగు శివవేంకటీ
య గ్రంథమాలయం
దుత్తృతీయపుష్ప
జగన్నాథీయ
మహాప్రబంధ
మున ప్రథ
మాశ్వా
సము.

# శ్రీ జగన్నాధీయము.

## ద్వితీయాశ్వాసము.

---

కం॥ శ్రీమదమేయదయాగుణ, ధామా కళ్యాణగుణక • దంబమహాత్వో
ద్దామ సునామా దశరథ, రామా, లోకాభిరామ • రాజలలామా॥

అవధరింపుము. తదనంతర కథావిధానంబు శౌనకాదులకు సూతుం డిట్లనియె.

యజ్ఞనారాయణుఁడు భూసురకన్యం గలకించుట.

మ॥ విపులామర్త్యకుమారుఁ డందుఁ గనియెన్ • విద్యుల్లతావిగ్రహన్
జపలాక్షిన్ దళితేంద్రనీలచికురన్ • జంద్రాస్యఁ జక్రిస్తనిన్
విపులశ్రోణి విమృగ్యమధ్య కలితన్ • బింబాధరోష్ఠిన్ మిటా
రపుతేజవ్వనిఁ జిత్తసంభవుని సా • మ్రాజ్యేందిరన్ బోలఁగన్॥ ౩

చ॥ ధరణికి డిగ్గి జీవకళఁ • దాల్చినచందురురేక యొక్కొ తాఁ
దిర మయి మేలిక్రొంచలుకు • రెడు కారుమెరుంగుఁదీవెయో
మరు లిడు మేనుఁ గైకొనిన • మన్మథమోహనవిద్యయో యనన్
గర మలరారు నక్కలికిఁ • గన్నులపండువు గాఁ గనుంగొనెన్॥ ౪

కం॥ లలితదరస్మిత చంద్రిక, లలరఁగఁ దిలక మనుచిహ్న • మను వై సొగసుం
జిలుకుపరిపూర్ణశశిమం, డల మగుచున్ దోఁచెఁ జెలివ • దనబింబ మటన్॥ ౫

కం॥ అక్కజము మీర వేలుపుఁ, జక్కెరబొమ్మలను మిగిలి • చక్కఁదనంపున్
జొక్కయిన నలరు వలపుల, యిక్కయన్ దనరెఁ జెలువ • మెల్లం దానై॥ ౬

కం॥ సొపర సతులగర్వా, లాపంబులె కాని రూప • లావణ్యములం
పొలఁతిఁ బోలఁ గలరే, చూపున భేదం బొ కింత • నూపకయున్నన్॥ ౭

॥ మాట మాత్రమె కాని • మంజుఘోషకు నీక, లాలాపలాలిత్య • మబ్బఁ గలదె
చాయపోడిమి గాక • శశిరేఖ యీమంజు, లాస్యకళాయుక్తి • నలరఁ గలదె
ప్రోది నేయుటె గాక • పౌరలేకరంభయీ, మృదులోరుసౌభాగ • మొందఁగలదె
పైపన్నెలే కాక • పసమీరహేమ యీ, కనకాంగిలావణ్య • మెనయఁగలదె

యురువిలాసమె కాక తిలోత్తమాఖ్య, యీసువాసవిలాసంబు ◆ నెసఁగఁగలదె
యచ్చరలు మెచ్చురూపసులను పెక్కాన్ని, నిలువుగన్నులఁగనరె యీ ◆ నెలఁతఁజూచి

చ॥ మెరుపులలోని క్రొమ్మిసిమి ◆ మేలికడాని జగాని గారవుఁ
బరువపుఁ జందమామ జిగి ◆ క్రన్ననిపూవుల సౌకుమార్యముఁ
గెరయుం తలంపుతోడుత నె ◆ నీరజగర్భుఁడు దెచ్చి చేసె నీ
వరసుష మాభిరామ వర ◆ వర్ణినియాకృతి నేర్పు పెంపునన్.

కం॥ చక్కఁదన మంతయును నొక, చక్కని నిబిడ మయి రూప ◆ సంపద గనెనో
యక్కజముగ నన నీమరు, చిక్కని జిగిచిక్కటారి ◆ చెలి విలసిల్లెన్॥

కం॥ కనుఁగొనమె రాచనగరుల, ననబోఁడుల నెందరినో కనం జాలుదుమే
యని రూప్యమాన సౌంద, ర్యనిరూఢిన్ దనరు నీమ్ప ◆ గాత్రిన్ బోలన్॥

కం॥ అబ్బురపాటు జనింపఁగ, బిబ్బోకవతీలలామ ◆ వీక్షించి మదిన్
నిబ్బరపున్ గోరిక లా, గుబ్బుగఁ బెల్లుబ్బఁ దలఁచు ◆ గొనె లోలోనన్॥

ఉ॥ వాసవుతోడియీసు గొని ◆ వచ్చినయట్టి పులోమకన్యయో
యాసర రుహోత్తుడు విడ ◆ నాడి ధరం జరియించు చున్నయా
సతియో విలాసరతిఁ ◆ జేరి మెలంగెడు దేవకన్యయో
యీసతి యెవ్వరో మెలఁగు ◆ నిందు మనుష్యులజాడ లే దెటన్॥

కం॥ ఆమనుష్యులభ మయినను, సమావిశేషంబు సూడఁ ◆ జాలఁగ నాశ్చ
ర్యము దోఁచెడు నీసుందరి, క్రిమ మెరుఁగఁగ నడుగఁ దప్పు ◆ గాఁ గనదుకదా॥

తే॥ అని వితర్కించితుదకు ధైర్యము వహించి, భూసురాగ్రణి యాపూవు ◆ బోఁడిఁ గ
యడిగె నిట్టినిర్మానుష ◆ మైనకాన, మెలఁగెదవు నీతెరం గెల్ల ◆ దెలుపుమిపుడు

కం॥ అనిమిషకాంతవొ నాగాం, గనవో మరి సిద్ధసాధ్య ◆ గాంధర్వనితం
బినుల నొకర్తువొ కా , వనదేవతవో నిజంబు ◆ వచియింపు మనెన్॥ ౧౬

యజ్ఞనారాయణునకు విప్రిక యచటి వృత్తాంతము దెలుపుట.

ఉ॥ ఆవికచాంబుజలోచన జ ◆ యంతవసంత లతాంతకుంత సం
భావితరూపయౌవన వి ◆ భాసురు భూసురరాట్కుమారు ల
జ్జావనతాస్య యై కని వ్యా ◆ దంబురుహాంకురమానారాగ
లావివశాత్మ యై యనెఁ గ ◆ లస్వనమాధురి చిందుపందుగన్॥ ౧౭

# జగన్నాథీయము

ఉ॥ ఓకమలానాయకా! పురు • షోత్తమనామక క్షేత్ర మిద్ది ల
క్ష్మీకమనుండు నీలగిరి • శేఖరమందుఁ బురందరాశ్మమా
ణిక్యకలనంబుఁ గైకొని పి • యంబున నిచ్చట సంవసించు న
స్తోక సపర్యలన్ గొనుచు • సంపరితోషిత మానసంబునన్ ॥ ౧౮

కం॥ సురసిద్ధసాధ్యవిద్యా, ధర గంధర్వాప్సరోవి • తానమ్ము నిరం
తరము మహోగ్ర సపర్యల, నరుదుగ సేవించుచుండు • హరి నిచ్చోటన్ ॥ ౧౯

ఉ॥ హరిపరిచర్య సేయుచుఁ బ్రి • యంబున నిచ్చట సప్తసంఖ్య మం
దిరములవార మీయవని • దేవవరేణ్యుల ముందు మేము గా
కరయఁగ నుర్వి నన్ మను • జావలి గల్గ నటం చెరుంగ మా
హరివిభుఁ డేము తత్ప్రియుల • మై తగుభృత్యుల మంచు నెంచుచున్ ॥ ౨౦

కం॥ సేవించుచు నుండుదు మా, శ్రీవిభు నాతండు మాను • సేవలకుఁ బ్రమో
దావిష్టుఁ డగుచు మాతో, నేవేళన్ బలుకు చుండు • హితమింపారన్ ॥ ౨౧

తే॥ ఇచటిభూసురకన్యక • నేను మాచ, రిత్రమిట్టిది మాయేడు • గృహములందు
కాక నరులెందు లేరను • జోకసుంద్రు, మాపురుషులిందు నిసుఁగన్న • మన్నిగొంద్రు॥

తే॥ ఎవఁడవో నీవు నీకథ • యెల్లఁ దెలిపి, వేగ నిచ్చోటు వీడి నీ • వేగు మనిన
యజ్ఞనారాయణుండు వ్యా • యవిధ మెరుఁగఁ, దెలిపె నావిప్రకన్యకు • నెలమిమీర॥

ఉ॥ శాకియు దూరనట్టు బలు • కారడవిన్ నరగంధ మింతయున్
లేక భయంబునన్ మది • జలించుచుఁ బెక్కుదినాలు వచ్చి పె
ల్లాకట నుగ్రికిక్కిరిన్ సుకృత • మబ్బ క్షుధార్తున కన్నమిడ్డ నా
శ్రీకదళాక్షి యిూ ది య • కముగా దిడు మించుకన్నమున్ ॥ ౨౪

మ॥ అని వేఁడన్ దరళాయతాక్షి కరుణా • యత్తాత్మ యై రమ్ము ర
మ్మని దివ్యాన్నము భక్ష్య భోజ్య బహులే • హ్యాపూపముల్ రత్నభా
జనమం దుంచి యొసంగఁ జూచి బహుళా • శ్చర్యంబునన్ విప్రనం
దనుఁ డాక్రొంజికురాఁ కుబోఁడిఁగని యా • త్సాహంబుతో నిట్లనెన్ ॥ ౨౫

యజ్ఞనారాయణునకు విప్రకన్య విష్ణుని జూపఁబూనుట.

ఉ॥ అటవి నివాసభూమి నుప • దాగములిందు నలభ్యముల్ పరి

స్ఫుట మగునట్టినాగరిక • ముద్ర విమృగ్యము మీకు నిట్టిచో
నటమట లేక భోజనప • దార్థములెల్ల నపూర్వదృష్టముల్
ఘటకుచ వింత యయ్యెడును • గా దన లేఁగ నేమొ చెప్పుమీ॥ ౨౮

చ॥ అన విని యాసరోరుహద • ళాక్షి దరస్మిత ముల్లసిల్ల ని
ట్లనె నిట నీలశైలవిభు • నచ్యుతు నిచ్చలు వచ్చి లేల న
య్యనిమిష సంచయంబులు మ • హార్హ సపర్యలఁ గొల్చి యీనివే
దనము లొసంగి పోదురు స • దా యవి యేము భుజింతు మిచ్చటన్॥ ౨౯

తే॥ భక్తవత్సలుఁడగుజగ • త్ప్రభుఁడు నీలశైలపతి మాయెడలదయా•సహితుఁడగుచు
ననిమిషనివేదితాన్నము• లనవు మాకొ, సంగు మాతోడఁబలుకుఁ బ్ర•సంగములను॥

తే॥ అనుచుఁ జెప్పిన విని విప్ర • తనయుఁ డిట్టి, దేని నాయెడ దయచేసి • దేవదేవుఁ
డతులకృప నన్నుఁజూచి మా•టాడునట్లు, సేయుమందాఁక నేనుబో•సేయజాలు॥

మ॥ అతిలోకం బగునట్టివింత యిది స • త్యం బెంచు నాలించి శ్రీ
పతి దర్శించి త దుభవ్యకృపకున్ • పాత్రుండఁ గా నేని యా
కితచూడామణి యన్న మేమిటికి జీ • వం బేల నాపై దయా
మతిఁ బాటించి రమేశుదర్శనము స • మ్యక్ప్రేమఁ జేయింపుమా॥ ౩౦

కం॥ అని వేఁడెడు విప్రసుతున్, గని కనికర మొదవి విప్ర • కన్యక దా ని
ట్లనె నీకోరిక దీర్చెద, మును నా కోరికయు నీవు నొగి దీర్పవలెన్॥ ౩౧

విప్రకన్య తనను వివాహమాడుమని యజ్ఞనారాయణునిఁ గోరుట.

కం॥ కా దనక నాదుకోర్కి దప, యాదృష్టిన్ దీర్చెదేని • హరి నాశ్రిత ర
క్షా దక్షు నీకుఁజూపెద నీదుమనోరథము దీర్త • నీయముగ ననన్॥ ౩౨

తే॥ అట్లు గావింతు నీకోర్కి • యడుగుమనిన, భూమిసురకన్య యవనత•ముఖి యగుచును
పొంగి లేసిగ్గు రెప్పలఁ • దొంగలింప, నింపుమీరఁగఁ గనుఁగొని • యిట్లుపలికె॥

చ॥ కృతకమనోజరూప యప • కిల్బిషభూసురవంశజాత స
ద్వ్రతనసముద్యమానవన • యౌవనఁ గావున నాభిజాత్య సం
గతి ననుతాప నైనను • గౌతుక యోగత నాదరించి యీ
ప్సితము ఫలింపఁ యీ మిది • విశ్రుతధర్మపథంబు గావునన్॥ ౩౪

తే॥ కన్నె సద్వరుశర్ధించి ♦ యున్న దాన, నీవు నవివాహితుండవు ♦ గావున దయ
చేసి నావాంఛితము సిద్ధి ♦ సేయుమవల, నిందిరేశుదర్శనము నే ♦ యించు దాన॥
॥ అని యడిగిన. ౩౬

తే॥ విప్రుఁడను నేను నిదిధరా ♦ విబుధకులజ, కన్నె యాచిన్నది వటుండ♦ నెన్న నేను
నరయ ననురూపసంబంధ ♦ మగుట పరిణ,యంబుధర్మమయగు సంది♦యంబు లేదు॥

కం॥ అని తలఁచి కన్నెఁ గనుఁగొని, వనితా నీకోర్కె తగున ♦ వశ్యముఁ దీర్తున్
మునునాకు నచ్యుతుని ద, ర్శనమున్ జేయింపు మవల ♦ సతిగాఁ గొందున్॥

తే॥ హరిపదంబులుసాక్షి యే ♦ నన్నతమాడఁ, జెలియరో నిన్ను నేఁ బెండ్లి ♦ చేసికొందు
విష్ణుసందర్శనోత్కంఠ♦ వెల్లివిరియ, చుండె మునునాకుహరిఁజూపు♦ముత్పలాక్షి॥

చ॥ అనుటయు సంతసంబు హృద ♦ యంబు రయంబున నిండి పైకిఁ గ్ర
మ్మెనో యన నేత్రకోణముల ♦ మేకొని సమ్మద బాష్పపూర మెం
తయు నఁ జనుదేరఁగా నవన ♦ తానన యై హృదయేశ! నీవు చె
ప్పినటుల విందు నమ్మితిని ♦ వే రొకచందము సేయకిందునన్॥ ౪౦

విప్రకన్య యజ్ఞనారాయణునకు విష్ణుదర్శనము చేయించుట.

కం॥ శ్రీహరిదర్శనమున కు, త్సాహం బలరారఁ బోవు ♦ దము రమ్మనుచున్
మోహమునఁ గరముఁ గైకొని, యా హరిణాంకముఖి వేగ ♦ నతనిఁగొని చనెన్॥

వ॥ ఇట్లు చని నీలశైల శిఖరాగ్రంబున జాగ్రదిందుకాంతశిలావేదికాతలంబున జల ధుపలకలిత ప్రతిమారూపంబునఁ బురుషప్రమాణసందర్శ యమూర్తి విశేషం బలర శంఖచక్రగదాపద్మవిరాజిత చతుర్బాహుండును రత్నకంకణకేయూరకిరీటాంగదస్రై వేయహార శ్రీవత్సవనమాలికాద్యనేక భూషణాలంకృతుండును జారుకాంచన కౌశేయ యుగళ పరిధానుండును, నప్రాకృతదివ్యతేజోవిరాజమానుండును నై విలసిల్లు పురుషోత్తమదేవుని సన్నిధానంబున కరిగి యాభవిష్యద్వధూవరు లత్యంత భక్తిపూర్వకంబుగా సాష్టాంగనమస్కారంబు లాచరించి యిట్లని సంస్తుతించిరి. ౪౧

పురుషోత్తమ స్తోత్రము.

చ॥ జయజయభక్తరక్షణ వి ♦ చక్షణ పద్మదళాయితేక్షణా
జయజయపద్మనాభ పద ♦ సంశ్రయ రక్షణలాభశో తా

జయజయశంఖచక్రధర ♦ సంస్తుతశంబరారాదినిర్జరా
జయజయనీలశైలకృత ♦ సంశ్రయ సంప్రసన్నవరోదయా॥ ౪౩

మ॥ సజలాంభోధర నీలదేహా నతశ ♦ శ్వాసంచితోత్సాహ భ
క్తజనాపత్పరిహార సర్వజగదు ♦ ద్ధారా మహోదార సా
రజితామిత్ర సరోజనేత్ర దితిపు ♦ త్రవ్రాతజైత్రా హరా
బ్జజ సంస్తోత్రచరిత్ర భూరికరుణా ♦ హారీణ నారాయణా॥ ౪౪

పద్మనాభవృత్తపంచకము.

1 శ్రీమానినీచిత్తచోరా శుభాకార ♦ శ్రేయఃప్రదాన ప్రసిద్ధప్రచారా
దామోదరా భక్తమందార దుర్వార ♦ దైత ప్రకాండోరుగర్వాపహారా
శ్యామాంబుముక్తల్య చంచచ్ఛరీరాల ♦ సత్కౌస్తుభాలంకృతోరః ప్రకారా
మామీఁదఁ గారుణ్య మేపార నేరంబు ♦ మన్నింపు మోశ్రీధరా సద్విహారా॥
2 లోకంబులం దీవు నీకుక్షిలో నెల్ల ♦ లోకంబులుం సంవసింపన్ గదా లో
కైకస్తుతం బైనయవ్యాసుదేవాఖ్య ♦ యామ్నాయ మార్గంబులన్ బ్రాకటం బై
నీ కొప్పు శంభుండు నీకేజగర్భుండు ♦ నీయంద వర్తింతు రీవిశ్వ మెల్లన్
జోకన్ సృజింపంగఁ బాలింపఁ దుంపంగ ♦ నూరిస్తుతా నీవ శక్తుండ వెందున్॥
3 మాయాఖ్య యాశక్తి నీయంద వర్తించు♦మార్తాండునందున్ బ్రభాయుక్తి తానే
చేయున్ సమస్తంబు నీ వయ్యధిష్ఠాన ♦ చిన్మూర్తి వై యుంకి నీవెల్లచేతన్
నీయిచ్ఛ యున్ లూంగి సర్వేశ్వరత్వంబు ♦ నీకందుచేఁ గల్గు నీవిశ్వమందున్
నీయాజ్ఞ లేకుండ నింతేని యల్లాడు ♦ నే మమ్ము రక్షింపుమీ విశ్వనాథా ౪౭
4 శ్రీకృష్ణ గోవింద సర్వేశ్వరేశా హృ♦షీకేశ నాకేశసంరక్షణైకా
శోకానుకంపావిధేయా విధేయార్తి ♦ శోకాపనోదప్రవీణా గుణాఢ్యా
వైకుంఠవాసా లసత్స్వర్ణవాసా భ♦వచ్ఛేదనోల్లాససమ్యన్వికాశా
నీకున్ నమోవాకముల్ సేతు మెల్లప్డు♦ నేరంబులన్ సైఁచి మమ్మేలు మీశా॥
5 నీలాచలావాస లక్ష్మీమనోల్లాస ♦ నిర్వ్యాజకారుణ్య లీలావిలాసా
నాకగర్భాదివంద్యా సమస్తైక♦నాథా సనాథీకృతామ్నాయమార్గా
బాలేందుకోటీరమిత్రా పవిత్రాంఘ్రి♦పద్మార్చనానీతభక్తేప్సితార్థా
చాలన్ గృపన్ మాకు దోషంబులన్ ద్రుంచి♦సద్భద్రమి మ్మోజగన్నాథదేవా॥

మందాక్రాంతవృత్తము.

నీలాద్రీశా ♦ నిఖిలవరదా ♦ నిత సత్తా వబోధా
ద్వేలాకారా ♦ అదిసుతహరా ♦ దీనరక్షావిచారా
నీలాంభోముఃజ్ఞ భశుభతనూ♦ స్నేమశేషాహితల్పా
చాలన్ గోర్కుల్ ♦ సఫలములు గా ♦ సల్పి మమ్మేలు మాశా॥ ౫౦

శ్రీహరి వధూవరులకు వరదుఁడగుట

మ॥ అని యీల వధూవరుల్ పరమభక్త్యా విష్ణులై పల్కరున్
వినుతు శ్రేయఁ గడున్ బ్రసన్నుఁడగుచున్ ♦ విష్ణుండు మీకోర్కులెన్
జను వొప్పారఁగ వేఁడుఁడిత్తు నని హాస్తస్పర్శనం బాచరిం
చిన నప్రాకృతదివ్యరూపధరులై ♦ చేతోముదం బొప్పఁగన్ ౫౧

ఆ॥ వధువు గోరె నితఁడు ♦ పాణిగ్రహణమున్సేయవలె ననుచు; నట్లు ♦ యగునని హరి
వరుఁడు గోరెభక్త♦వత్సల నినుఁ గంటి, న మతార్థసిద్ధు ♦ లందఁ గంటి॥ ౫౨

శా॥ నాకున్ బెంచినతండ్రి గల్గునిల నిం♦ద్రద్యుమ్న నాముండు ధా
త్రీకాంతుం డతఁ డెల్లవేళల భవత్సేవానురక్తాత్ముఁడై
నీకారుణ్యముఁ గోరి యుండు నవనిన్ ♦ నీలాద్రి నీవున్కి యా
స్తోకప్రీతి నెఱింగి నిన్నుఁ గనులన్ ♦ జూడంగఁ గాంక్షించెడున్॥ ౫౩

చ॥ అతని నియోగ మూదె జగ♦దాశ్రియ నిన్వెదుకంగ గోరి యీ
క్షితి సకలంబు గ్రిమ్మరితిఁ ♦ జేరి భవత్సముఖంబు నేఁడు గాం
చితి నిఁక నాపయిన్ గరుణ ♦ చిత్తమునం గలదేని భక్తవ
త్సలత గలదేని దర్శన మొ♦సంగుము వానికి లోకనాయకా॥ ౫౪

కం॥ ననుఁ బుత్రినిర్విశేషము, గను బెంచె నతండు తండ్రి ♦ గాఁడే నాకున్
జనకునికోరికఁ దీర్పని, తనయునిజన్మంబు వ్యర్థ♦తమ మగుఁ గాదే॥ ౫౫

కం॥ ఎన్నితపంబులు సేసియు, నిన్నుఁ గనం జాల రయ్య ♦ నిమిషులు మున్నే
పున్నెములు సేసితినో నినుఁ, గన్నుల కర వెల్లఁ దీరఁ ♦ గంటిన్ మంటిన్॥

కం॥ నీకరుణకుఁ బాత్రుఁడనైౖ, యీకాలఁదని దండ్రి మేలు ♦ నెంచక యున్నన్
లోకులు దిట్టరె భవదా, లోకనభాగ్యము పితకుఁ గలుగఁ జేయఁ గదే॥ ౫౭

# జగన్నాథీయము

ఆ॥ వరద భవదనుజ్ఞ • వడసి మాతండ్రి ని, చ్చటకుఁ దెచ్చి నీప్ర•సాదమునకు
భాజనంబు చేసి • పదపడి యీకన్నె, నాడినట్లఁ బెండ్లి•యాడువాఁడ॥ ౫౮

కం॥ కరుణించి దేవ నా , వర మొసఁగు మటంచు వేఁడ • వాత్సల్యమునన్
హరి యట్ల కాక యని యా, శరదిందునిభాస నపుడు • సమ్మతిపఱచెన్॥ ౫౯

యజ్ఞనారాయణుఁడు తండ్రినగరికి నచ్చుట.

కం॥ హరిచే సుందరిచే భూ, సురుఁ డిట్టు లనుజ్ఞ వడసి • జోఁక వెడలి స
త్వరగమనంబున జనకుని, పురి కరిగెన్ మది ముదంబు • పొంగి పొరలఁగన్॥

కం॥ చని•రాచనగరు చేరం, గని యచ్చటివారు తొలఁగఁ • గా నడ్డము లే
కను లోని కేగి భూమీ, శునిఁ జేర నతండు వినయ•చోదితుఁ డగుచున్॥ ౬౧

కం॥ ఎదు రేగుదెంచి కొని చని, ముద మలరఁగ నుచితపీఠ•మున నిల్పి క్రియా
విదుఁడై మహార్హపూజా, విధులు నడిపి యెదుటనిలిచి • వినతుం డగుచున్॥

చ॥ అతులదయామతిన్ మము గృ•తార్థులఁ జేయఁగ నెంచి యేగుదెం
చితి రిటు మీర లెన్న సుర•సిద్ధనభశ్చరులందు నొక్కరో
శతధృతివిష్ణురుద్రసుర • సంయములం దొకరో మహామహో
న్నతులు భవద్విధం బెరుఁగ • వేఁడెదఁ దెల్పి పవిత్రుఁ జేయరే॥ ౬౩

చ॥ అనవుడు రాజువిభ్రమము • నంతయుఁ గన్గొని యబ్బురంబు పై
కొన నిది యేమి భూరమణ • కుంజర వింతలు పల్కెదేను నీ
తనయుఁడఁ గానె నీముదలఁ• దెల్పి ధరిత్రిఁ జరింపఁ బోయి వ
చ్చిన నొరునట్లు నన్ను నతి•చిత్రముగాఁ గని ముచ్చటించెదే॥ ౬౪

తే॥ ఇట్లగుట కెంతయును బరి•కించి కొర, ణ మ్మెఱుంగఁగఁ జాల భూ•నాధ నీసు
తుండనగు యజ్ఞనారాయ•ణుండఁ గానె, వింతవానిగ నను జూచు•విధమిదేమి॥

మ॥ అన నప్రాకృతదివ్యతేజమున భ•వ్యంబైనరూపంబు దై
కొని విచ్చేసిననిన్ను నేకరణి నా•కుం బుత్రుఁ డంచున్ దలం
పున నెన్నంగల నిట్టిరూప మది యే•పుణ్యంబునన్ నీకుఁ గ
నదో తెల్పుము పుణ్యతీర్థమహిమా•తత్ప్రవృత్త మెల్లం దగన్॥ ౬౫

యజ్ఞనారాయణుఁడు తండ్రికి నీలాచలము తెఱఁగెఱింగించుట.

సీ॥ అనియడిగినఁ దండ్రిఁ • గని యిట్టు లనె దేవ, నీయాజ్ఞఁ గొని తీర్థ•విచయమెల్ల

ద్రిమ్మరుచుండి ఘో ♦ రమ్మగునిర్జనా,రణ్య మొకట్టి నము ♦ ద ప్పుచెంతఁ
గని చొచ్చి చనఁ జరి ♦ జను లెల్ల భీతులై, వెనుచిక్కి ధైర్యంబు ♦ విడువకీన
యటఁ జని కంఠీర ♦ వ్యాఘ్రమం బొక్కటి, యచట నేఁడిండ్రబా ♦ హ్మణులుగలర
గీ॥ వారికన్యనొక్క ♦ వరరూపవతిఁ గాంచి, యామె చేత వింటి ♦ హరి పరాత్ముఁ
డందు నీలశైల ♦ మునుకొండపై నుండి, తత్సపర్యలను ము ♦ దమునఁ జొక్కి॥ ౭౭

కం॥ వారిం గని భాషించుచుఁ, గోరిక లిడు ననుచు నమ్మ ♦ గుద దయచే న
న్నారాయణు దర్శించి యు, దారకృపాదృష్టివలన ♦ ధన్యుఁడ నైతిన్॥ ౭౮

చ॥ సరసిజనాభుఁ డప్పుడు ప్ర ♦ సన్నతతోడ వరంబు వేఁడు మీ
వరదుఁడ నైతి నన్న నత ♦ వత్సల మ నకుండు మాశివే
శ్వరుఁడు త్వదీయదర్శన వి ♦ చారముతో నినుఁ గొల్చుచుండు న
న్నరపతికోర్కి తీర్పఁదగు ♦ నాపయి సత్కృప గల్గె నేనియున్॥ ౭౯

కం॥ అని వేఁడితి నన్నారా, యణుఁడు సమంచత్కృపా ప ♦ రాయణుఁ డై తో
కొని ర మ్మనియెఁ దదాజ్ఞం, గొని యిచటికి వచ్చినాఁడ ♦ గువలయనాథా॥ ౮౦

వ॥ అది పురుషోత్తమ క్షేత్రం బనియును భగవంతుం డచ్చట నీలశైలశిఖరం బున నిత్యసన్నిహితుం డై సురసిద్ధసాధ్యాది సపర్యలం బరితోషంబు నొందు చుండు ననియు వింటి. చిరకాలంబుననుండి నీ వెద్ది చూడం గోరి యుండువో యది నేఁటికి సఫలం బయ్యె నింక జాగు సేయక నాతోడ నచటికి విచ్చేయ నవధరింపవలయు నను టయు ధరణీనాథుండు పరమసంతోషకందళితాంతరంగుం డై యి ట్లనియె. ౮౧

కం॥ జనకుని కోరికఁ దీర్చెడు, తనయుండె సుపుత్రుఁ డనఁగ ♦ ధరఁ జె న్నొందున్
దనయుఁ డని నిన్నుఁ బెంచిన, ఘనసుకృతమువలన విష్ణుఁ ♦ గంటిన్ మంటిన్॥

ఇంద్రద్యుమ్నుఁడు నీలాచలమునకు బైలువెడలుట.

వ॥ అని యభినందించి మిత్రామాత్యపురోహిత బంధుబృందంబుం బిలి చి యయ్యిలానిలింపభర్త కుమారోదంతం బంతయు నెరింగించి పురుషోత్తమసందర్శనం బున కిప్పుడ కదలిపోవలయునని చెప్పి నిజప్రయాణంబు పురంబునం జాటం బంచి తా నును బ యాణోచితవేషంబు ధరించి బ్రాహ్మణా ర్వాద పురస్సరంబుగా బయలు వెడలు నప్పుడు. ౨

కం॥ చంద్రోదయావసథమున, సాంద్రతరతరంగరంగ ♦ సంగత మై ని
స్తంద్రిత సుఘోషంగెడు నల, సంభ్రమునగతి నగర మెల్ల ♦ ఘంభ మ్మెం దెన్॥

కం॥ పౌరసమూహం బంతయు, నారీసుతమిత్రపరిజ • నయుతంబుగ ల
క్ష్మీరమణ దర్శనోత్సవ, పారీణత నేగుదెంచెఁ బార్థివుతోడన్ ॥ ౭౫

కం॥ ఉరురత్నపుంజరుచి శిం, జరితం బగురథము నెక్కి • జనపతి వసుధా
మరపరివేష్టితుఁ డై భూ, పురందరుం డనఁగ వెడలెఁ • బుత్రునితోడన్ ॥ ౭౬

కం॥ శరదంబు లనఁగఁ బొదలెడు, నరదంబులు ద్విరదములు తు • రంగంబులు వీ
ర రసారభటులు భటులునుఁ, గర మలరెడుసైన్య మెల్లఁ గదలెన్ మొదలన్ ॥

వ॥ ఇట్లు నానావిధసైన్య పరివేష్టితుండును మిత్రామాత్యపురోహితపౌర జనానుగమ్యమానుండును, నపరిమితధరణిసురపరివారితుండును నై; వివిధవినియోగంబులవారలు నయ్యైవిధంబుల నుపచారంబుల ననుగమింప మహోక్షక్రమేళక శకటాది సాధనంబుల సకలపదార్థంబులుఁ గొని వణిక్కులు ననుదేర నర్తకగాయక వైణిక వాంశిక వైతాళికాదిజనంబు లుచితఁగతి గలసి రా రజకాంబష్టబారవాహకతంతువాయ కులాలస్వర్ణకారలోహకారరథకారప్రముఖు లసంఖ్యాకులు వెంబడింప వెడలి విడిదలలు నిరూపించుచు సకలవిశేషంబులతోడి మహానగరంబు నడచుపోలిక నడచునప్పుడు

## సూర్యాస్తమయవర్ణనము.

చ॥ అపరదిగంగనామణికి • నైంద్రి ప్రియంబునఁ గానుక నంపు ని
ద్దపుఁ జిగిఁ గుల్కుమానికపుఁ • దలుకునిగారపుఁ బల్లెరంబనన్
దపనుఁడు పూర్వభూధరము • నన్ వడి వెల్వడి పశ్చిమాశ కై
యపు డరుదెంచి యస్తశిఖ • రాగ్రమునందు వసించె నొప్పగన్ ॥ ౭౯

మ॥ వరుణాశాజలరాశిగర్భమున దృ • ప్యల్లీల వర్తించు ను
మ్మక్కర రాత్రించరవారమర్దనజిష్ణు • తాసక్తుఁ డై యప్పురం
దరుఁ డంపించుశతఘ్నినిర్గళితమా • ద్యద్వహ్నిగర్భాయసో
ద్ధురగోళంబన భానుమండలమటన్ • దోఁచెన్ బ్రతీచీదిశన్ ॥ ౮౦

కం॥ తరియనుకమ్మరి చదలను, బరపుకొలిమిఁ బొద్దుపేరఁ • బరఁగునినుపగుం
డెరవడఁగఁ గాచి పద నిడఁ, జరమాంబుధినీళ్లపనఁటి • సరగున ముంచెన్ ॥

కం॥ ఇనుఁ డరుగుదెంచె నని చ, య్యన నీళ్లలరేఁడు తనస • భాంగణమునఁ గెం
పెనయూదివాచిం బరచిన, యనువున సాంధ్యా రుణాంశు • లలమెఁ బ్రతీదిన్ ॥

# జగన్నాథీయము

కం॥ చదలను వని మొలఁగినవారి, పదపడి యపరాద్రిగుహా ని ♦ వసియింప మదిన్
బెదరుడిగి వెడలుదట్టఁపు, మదదంతావళకదంబ ♦ మన నిరు లలమెన్ ॥ ౮

చ॥ ఇదె చనుదెంచు రా జనుచు ♦ సెంచి జగం బనుమంటపంబునన్
జదలను నల్లపట్టున సె ♦ సం గురువారపు మేలుకట్టుఁ గ
ట్టి దలముగాఁగ ముత్తెముల ♦ తీవగునట్టి సరాలు సుట్టి నో
ప్పిదమునఁ దోఁచె నయ్యెడలఁ ♦ బెల్లుగఁ జొక్కపుఱిక్కలొక్కటన్ ॥ ౮౦

తే॥ రాజు గర్భీకరించిన ♦ ప్రాగ్దిశాంగ, నామణిముఖంబునందుఁ గ ♦ న్పట్టు వెలరు
ఛాయవిధమునఁ బ్రాచిఁ గై ♦ సేయఁజొచ్చె, నల్లనల్లన మొల్లమై ♦ వెల్లఁదనము

ఉ॥ ఇందురుచి మేడమీఁద రవ ♦ ణించెడు శ్రీమ్మగరాలకూర్పు ని
స్తంద్రముగా నెసంగినవ ♦ సం దగు కుందనపున్ వెడంద చా
యం దరిసరించు కుంభము వి ♦ ధంబునఁ బ్రాగ్గిరి నగ్గలించుచున్
జందురుఁడు దోఁచె నెల్లెడలఁ ♦ జల్లనివెన్నెల చెన్నెసంగఁగన్ ॥ ౮౨

కం॥ చదలనెడి కామధేనువు ♦ పొదుగనఁ దగుచంద్రబింబ ♦ మున దరిగొల్లం
డదనునఁ బిదికినక్షీరము, చదురున జగ మెసఁపనఁటిఁ ♦ జంద్రిక నిండెన్ ॥

వ॥ అట్టియెడఁ బటకుటీరంబు లెత్తించి యొక్క రమణీయ ప్రదేశంబున
క్షితీశుండు సపరివారంబుగ విశ్రమించినంత. ౮౩

పరిభ్రాతవర్ణనము.

కం॥ తిక్కలపేరిటిబలగం, బక్కజముగ నడపి వెనుక ♦ నరుదెంచెడు న
న్మొక్కలపువాహినీపతి, చొక్కంబునఁ బ్రాచి వేగుఁజుక్క జనించెన్ ॥ ౮౪

కం॥ మాత్రిత తయావస్థితి, సూత్రమునకు నస్మదీయ ♦ సూక్తి నిదానం
బ్రతయునని తెలిపెడునన, ధాత్రిన్ బ్రోసెన్ బదాయు ♦ ధములు త్రిభంగిన్ ॥

కం॥ ఇనుఁడు సనుదెంచునుత్సవ, మునకున్ బ్రాక్సైలశిఖర ♦ మున నింద్రుం డె
త్తిన వెలిపట్టుగుడారం, బన గాఁ దూరుపునఁ దెలివి ♦ యధికం బయ్యెన్ ॥

ఉ॥ తూరుపుఁగొండచాటు విడి ♦ దూకొని యాకములాప్తభానుసం
భారమునందు నొక్కొకటి ♦ పై కరుదేరఁగ లెక్కపెట్టునో
నారహిఁ దమ్మిరేకులు మ ♦ నాగ్గతి విచ్చుచు నొక్కటొక్క టే
తేర సహస్రపత్రవిత ♦ తిన్ దలనూపె వికాస మయ్యెడన్. ౮౬

# జగన్నాథీయము

చ॥ చదలనునిప్ప్రమానునఁ బొ • సంగినతారకపుష్పవారమం
దొవవుమరందసారమున • నొ ప్పగునిర్గసుతేనెటీఁగ ల
భ్యుదయము మీరఁ గూర్చిన వి • ధూజ్వలసన్మధుకోశ మాపత
త్త్రిదివన ంత మై యపర • దిక్కునఁ దోఁచెను వెల్లవారుచున్॥ ౯౪

కం॥ తారలపేరిటిలూతలు, దారాంశుగుణంబు లల్ల • దలఁ ముంగిటిపైఁ
గూరిచిన సాలెగూఁ డనఁ, దీరెన్ శశిబింబ మపర • దిశ జిగి దొరఁగన్॥ ౯౪

శా॥ వ్యోమ క్షేత్ర • మునందుఁ గాలకృషికుం • డొప్పారఁ గాఁ దిప్పి స
ద్వ్యామర్శంబుగ నారదిప్పినసుప • క్వాంచత్ఫలాండువ్రజం
బై మీరెన్ వెలువెల్కతో నుడుగణం • బాచెంతఁ జండుండు దృ
ష్ట్యామర్యార్థసుధావలిప్తఘటి మై • యవ్వేళ దోఁచెన్ దగన్॥ ౯౫

ఉ॥ వేదలతాప్రతానకథ • విష్ణుసమంచితమూలకంద ము
త్పాదనకర్త చేత నవి • భావితజాగరణాప్తికిన్ గ్రియా
పాదనసాక్షి వెల్లుల కు • పాశ్రయ మంబుజకోటికిన్ బ్రబో
ధోదయకారణాయితమ • యూఖుఁడు సూర్యుఁడు దోఁచెఁ దూర్పునన్॥ ౯౬

వ॥ అప్పు డింద్రద్యుమ్నక్ష్మాకాంతుండు శిబిరంబు విడిచి బయలువెడలి కతి పయప్రయాణంబులఁ బురోహితదిష్టమార్గంబునఁ బూర్వసముద్రతీరంబున నడచి య చ్చటిఘోరారణ్యంబు సొచ్చి యందలి క్రూరసత్త్వప్రచారంబున కులుకుచు దుర్గమం బగుమార్గంబున నరిగి యరిగి సుందరాశ్రమంబు దరియునప్పుడు.

ఇంద్రద్యుమ్నునకు నీలశైలవాసులతోడి యుద్ధము.

॥ ఆసేనకలకల • మాలించి యచ్చటి సప్తగృహమ్ముల • జనులుఁ గడగి
బాణతూణీధను • ష్పాణు లై యేతెంచి, వివిధాస్త్రశస్త్రముల్ • వెల్లిగొలుప
సంకటమార్గప్ర • చారంబునను బాణ, హతులచే రాజసై • న్యములు చిందు
వందు గాఁ బడఁ జొచ్చి • రందలివీరయో, ధులును మహోగ్రులై • తొడగబహువి

తే.॥ ధాయుధంబులు బరపిన • నవి సరోజ, నాభుకరుణాప్రవాహంబు • నను ద య
సేవకులకును నుపహతి • సేయ లేకపొ మ్మగుచు నుండు టది యచ్చు • త మ్మెనర్చె॥

మ॥ హరిసంసేవకపాణిసంచితధను • ర్వ్యాముక్తనానాస్త్రని
ర్భరపాతంబుల నొచ్చి నల్లడ గజా • శ్వస్యందనాదుల్ పరం

పర లై కూలఁగఁ జొచ్చె యోధవరులున్ • భగ్నాంగులై వ్రాలఁ జొ
చ్చిరి తద్ఘోరనిపాత మోర్వక నశిం • చెన్ సేనలున్ బెల్లుగన్ ॥

కం॥ పడుకరులు మ్రొగ్గుహరులును, జిడిముడిపడుభటులు గూడసి • చెడియెడిరథముల్
నడఁకెడియోధులునై తల, సెడిపాఱఁగఁ జొచ్చె రాజు • సేన వెఱపునన్ ॥

యజ్ఞనారాయణుఁడు పురుషోత్తమునకు దండితెఱం గెఱింగించుట.

సీ॥ అప్పుడు యజ్ఞనా • రాయణుం డొకభంగి, దప్పించుకొని పెడ • దారి నరిగి
నీలశైలాగ్రస • న్నిహితు నచ్యుతుఁ జేరి, సాష్టాంగ మొరఁగి యం • జలిఘటించి
జయజగన్నాథ ప్ర • సన్నుఁడ వగుమని, వినుతించి దేవ నీ • యనుమతిఁ గొని
మజ్జనకుని జగ • న్మాన్యు నింద్రద్యుమ్ను దెచ్చితి నిచటి • తీర్థవాసు

తే.గీ॥ లైనమీ సేవకులు క్రూరు • లగుచు గేల వింట్లు నమ్ములుఁగొని ధరా • విభుని సేనఁ
జించి చెండాడుచున్నారు • శ్రీశ వార, లిట్లు సేయంగ నీవు పే • క్షింపదగునె

కం॥ అని విన్నవింప వీరలు జనుల నెఱుఁగ కునికి వన్య • సత్వము లని నీ
జనకుని సేనావిధ్వం, సనమునకుం బూని రెఱుక • చాలనికతనన్ ॥ ౧౦౨

శ్రీహరి నీలశైలవాసుల మందలించుట.

కం॥ అని పలికి యొక్క సేవకుఁ, గనుఁగొని నీ వేగి వారి • గడువడి నిటకున్
గొని తెమ్మని పంచిన హరి, యనుమతి నతఁ డేగి తెచ్చె • నందఱి నటకున్ ॥ ౧౦౩

ఉ॥ వచ్చినవారిఁ గన్గొని పె • ద్దా సిది సెల్లునె నన్ను గొల్వగా
వచ్చినవాఁడు సేవకుల • పైజని క్రూరత వారి నొంపఁగాఁ
జొచ్చితిరే విమూఢు లగు • చున్ మిము దండన జేతునంచుఁ గో
పోచ్చలితోష్ఠుఁడై యటు ప • యోరుహనాభుఁడు మందలించినన్ ॥ ౧౦౪

కం॥ వెఱపున వడఁకుచు వారలు, కరములు ముకుళించి తప్పు • గావు మనుచు న
న్నారు లానతు లగుడును శ్రీ, హరి సైఁచితి రాజుఁ దెం డ • టంచుం బలికెన్ ॥

శ్రీహరి యింద్రద్యుమ్నునిఁ దోడ్తెమ్మనుట.

॥ వారేగి యచట భూ • వరుఁ గాంచి రాజేంద్ర హరి, కరుణించె మి • మ్మటకుఁ దోడు
కొనిరం డటంచు మ • మ్మును బంచె రమ్మన, నా రాజు గడుఁ సంది • యంబు నొంది
యిదియొక్క కపటమూ • హించి మమ్మందఱ, క్రమ్మందింపఁదలఁచి • యిమ్మాడ్కిఁ బిలుచు
చున్నారె యని రాక • యున్న వారిర్వార్త, యిందిరేశున కెఱిం • గించి దరిగి

గీ॥ హరియు యజ్ఞనారాయణు•నంపె నీవు, రాజు దెమ్మని యతఁడు శ్రీ•రమణు వాజ్ఞ
నరిగి తనతండ్రి వీక్షించి • యనఘ వాసు, దేవుఁ డంపెను మిమ్ము దో•డ్తెమ్మటంచు॥
కం॥ హరియాజ్ఞఁ బ్రోచి పుచ్చఁగ, నరనాయక తగునె యజ్ఞ•నారదనుఁ జూడక్
జిరముగఁ గోరియు నిటు సే, తురె సన్నిధి కేగుదెంచి • దుర్మతి పగుచుక్॥
చ॥ ఎరుఁగ రిఁక న్యమానవుల • నెన్నఁడు నిచ్చటివారు మిమ్ము
కరమ్ము గకోటిగాఁ దలఁచి • గాసి యొనర్చిరి నేను వారిజో
దరున కెఱుంగఁ జేసితి న•తండును వారలమందలించె నే
యరమర లేక వచ్చి పర•మాత్ముని శ్రీహరిఁ జూడు మేర్పడక్॥ ౧౦౮
కం॥ అని తెల్పినఁ దనవిభ్రమ, మునకు న్నొచ్చుకొని రాజ•మూర్ధన్యుండుక్
దనయునితోడం జని యా, జనార్దనుం జూచె జన్మ•సాఫల్యముగక్॥ ౧౦౯

ఇంద్రద్యుమ్నుఁడు శ్రీహరిని సందర్శించుట.

కం॥ శతకోటిభానుబింబ, ద్యుతి నతులితదుర్నిరీక్ష్య • దుర్వారమహో
న్నత తేజః పుంజ సమం, చితరూపముతోడ నున్న • శ్రీహరి యెదుటక్॥ ౧౧౦
కం॥ నిలిచి కనుంగొనఁ జాలక, బలమరి కూలఁబడి లేచి • ప్రాంజలి యై యు
లజాతనాభు నతిపు, ష్కలవాన్విభవంబు మెరయ • సన్నుతిఁ జేసెక్॥ ౧౧౧

కవిరాజవిరాజితం.

జయజయ దేవ జనార్దన నిర్జర•సన్నుత చక్రగదాసిధరా
జయజయ నీలవలాహకసన్నిభ•చారుశరీరవిభారుచిరా
జయజయ శ్రీధర భూరికృపాగుణ•సాగర పోషితశంబకరా
జయజయ పద్మభవాండ నిరంతర • సంభరితోదర శార్ఙ్గధరా॥ ౧౧౨

శిఖరిణీ.

జగంబుల్ గావింపక్ • సమవన మొనర్పక్ విలయముం
దగక్ జేయక్ నీవే • తలఁప విధివిష్ణ్వీశతలచేఁ
బొగడ్తం బొందంగం • బురుషపర నీ వొక్కఁడవె యీ
జగన్నాథాఖ్యాప్తిక్ • సమకొనెదు లోకైకవినుతా॥ ౧౧౩

మత్తకోకిల.

లోకజాలము లెల్ల గర్భము•లోలఁ దాల్చి తదంతరా
లోకనీయత నిల్చి వేదము•లుక్ నుతింపఁగ లేని య

స్తోక దివ్యమహత్వ మొప్పఁగఁ • దోఁచె దీవు సమస్తలో
కైకనాయక వాసుదేవ దయామతిన్ మముఁ బ్రోవవే॥ ౧౧౪

తరల.

పరమపూరుష భక్తలోకవి • పద్విఘాలనదక్ష ము
ష్కూరనిశాచరలోకశిక్షణ • సర్వనిర్జరరక్షణా
నిరుపమాన దయాపయోనిధి • నిత్యనిర్మలరూప నీ
చరణముల్ భజియించుభాగ్య మొసంగి మమ్ములఁ బ్రోవవే।

చంద్రశ్రీవృత్తం.

జలేరుణ్ణాభా నీమహిమఁ గన • శక్యంబె లోకం
బులన్ నీకుం దుల్యుం డధికుఁడును • బోలంగ లేఁడ
త్యలంఘ్యం బౌనీయాజ్ఞ జగమున • నత్యంత తేజో
బలైశ్వర్యంబుల్ నీగుణము లగుఁ • బాలింపు మీశా॥ ౧౧౬

మహాస్రగ్ధర.

పరమేశా సర్వలోకే•శ్వర నిగమములున్ • బార మొందంగ యుష్మ
త్పరమాశ్చర్యప్రభావ•ప్రవచనమునకున్ • ప్రౌఢము ల్గావు కన్నుల్
దెరువన్ మాయంగ లోక•స్థితివిరతు లగున్ • దీనరక్షా నితాంతా
దర మొప్పారంగ మమ్మున్ • దలఁచి పరమభ•ద్రంబు లిమ్మీశ్వరేశా॥ ౧౧౭

ఓష్ఠ్యకందము

భూపామాపాభపభా, పాపాభ్రివ్యాప్తిఘాప్ర•భామద్భామా
ప్రాపాపద్భీఘాభా, వాపాభౌమప్రభావ•వై భవభవ్యా॥ ౧౧౮

నిరోష్ఠ్యము.

నిను జగదేకనాయకుని • నిత్యు నిరంజను నిర్గుణున్ గుణా
ఢ్యు నిఖిలలోకరక్షకు స•దోషు దయారసనీరధిన్ జనా
ర్దను నిఖిలార్థసాధనని•దాను సదా హృది నాశ్రయించి కో
ల్చిన సకలేష్టసిద్ధులును • జేరుఁ గదా శరణార్థి కెల్లెడన్॥ ౧౧౯

గోమూత్రికాబంధము.

వరదాయక కరుణాశ్రయ, శరణనఁగను గావ నేవ•సలుపఁగఁ గలదే
నిరతాయత కరుణామయ, నెరతనమును దేవదేవ • నిలుపఁగ వలయున్॥ ౧౨౦

చక్రబంధము.

శా॥ రక్షశ్శిక్షణజన్య భవ్యకరుణా ప్రాధమ్యలోకస్తుతా
పక్షోపస్థిత గణ్యరత్నకనక పారికల్ప కోటీరభా
దక్షా వేంకటనాథ భద్రకరపాదా ధర్మసంయంత్రితా
తాక్ష్యోభ్యారచితావనా ముదసమేతా భూరిభాగ్యశ్రితా॥ ౧-౨౧

కంద .త గర్భితచంపకమాల.

హరి, పరమేశ్వరా, వరదయా, ఘ్య రమాధిప వాసుదేవ, హా
ర్ణర, సమయా, మహాసుగుణ, సంశ్రియ సంతతసూరిపోషణా
దర, సుర వితా రవిసుధాకరలోచన రత్నహార కం
ధరమహితా, కృతీ, విబుధనాయకవందిత విశ్వపాలనా॥ ౧-౨౨

చ॥ అని వినుతించి ఫాలతటి నంజలిబంధము మోపి దేవ నా
జననము ధన్య మయె నలసారసగర్భ ముఖామరౌఘముల్
గనఁగాన లేనినిన్నుఁ గనఁ గల్గెఁ గృతార్థుడ నైతి భాగ్య మే
మనఁ గల సర్వనిర్జరులకంటె మహోన్నతిఁ గంటి నీశ్వరా॥ ౧-౨౩

అని సాష్టాంగం బాచరించి లేచి నిలువంబడిన యింద్రదు మ్న మహీపాలుం
గని శ్రీనివాసుండు సుధారసపోషణంబు లగు మేఘగం ర భాషణంబుల ని
ట్లనియె. ౧-౨౪

జగన్నాథుఁ డింద్రద్యుమ్నునకు వర మిత్తు ననుట.

మ॥ తలఁపన్ భక్తజనేప్సితార్థఫలసంధానవ్రతుండన్ ననున్
జాలన్ జూడఁగ రాదు భక్తికలనన్ జూడంగ సిద్ధించినన్
ఫలియింపన్ వలెఁ గోర్కు లెల్ల ధరణీపాలోత్తమా నీమదిన్
గల యర్థంబు లొసంగుదున్ వెరవకే కాంక్షింపు మిష్టంబులన్॥ ౧-౨౫

మ॥ అనినన్ హర్షరసోద్గమంబునను దేహం బంతయున్ బుల్కరిం
పను దీర్ఘప్రమదాశ్రుపూరములు ప్రబ్బన్ నేత్రకోణంబులన్
ఘనగాద్గద్యము పల్కులం దొదవ శ్రీకాంతున్ విలోకించి భ
క్తి నమస్కారము లాచరించి యిటు పల్కెన్ మానవేంద్రుం డొగిన్॥

ఇంద్రద్యుమ్నుడు శ్రీహరిని వరమర్థించుట.

మ॥ తగ బ్రహ్మేంద్రముఖామరావళికి దుర్దర్శంబ వైనట్టిని

న్నఁ గనం గలై భవత్పదాంబుజము లెం • తో ప్రీతి సేవింప గ
ల్గెఁ గదా యింతటికన్నఁ గోరికలు వే • ఱింక గల్గునే నీవు న
న్న గరిష్ఠంబగు ప్రేమఁ గోరు మనఁగ • న్గోరం దగున్ ॥గోరికల్ ౧౨౭

ఉ॥ ఈదృశరూపయుక్తి నిట • నెప్పుడు సన్నిహితుండ వౌచు దా
మోదర యుండు మీవు పర • మోత్సవ మొప్ప నిరంతరంబు నీ
పాదసరోజయుగ్మ మన • పాయత సేవ యొనర్చు చుందు నా
పై దయ గల్గు నేని నత • వత్సల యీవర మిమ్ము కోరితిన్ ॥ ౧౨౮

ఉ॥ ఎండల నెండి వానలకు • నెంతయుఁ గ్లిన్నత నొంది యిట్లు నీ
వుండఁగ నేల నయ్య పురు • షోత్తమ యాజ్ఞ యొసంగు మిందు నే
దండిగ గోపురాలయవి • తానముఁ గట్టి మహోత్సవంబులన్
మెండుగఁ జేతు భూప్రజలు • మిమ్ము భజించి కృతార్థతన్ గనన్ ॥ ౧౨౯

శ్రీహరి యింద్రద్యుమ్నునకు వర మిచ్చుట.

తరల.

అనుచుఁ గోరిన రాజుఁ గాంచి ద • యామతిన్ బురుషోత్తముం
డనియె నింక సమీపసంగత • మయ్యెడున్ గలికాల మి
నఘ యిందు వసింపరా దిట • నాలయాదు లవేల యై
నను ద్వ్యప్సితసిద్ధి సేయుట • నాయ మట్టులు గావునన్ ॥ ౧౩౦

చ॥ జలనిధిగర్భమందు నొక • చందనవృక్షముఁ గల్గు దాని నీ
వలయక తెచ్చి మత్ప్రతిమ • లందు రచించి ప్రతిష్ఠ సేయు మేఁ
దొలఁగక యందు నిల్చి దయ • తో భవదర్చనలం గ్రహింతు న
క్కలియుగమందు లోకులకు • గాంక్షితలాభ మనుగ్రహించుచున్ ॥ ౧౩౧

మ॥ వసుధీశా కలివేళఁ దాల్చెదను నే • బౌద్ధావతారంబు భ
క్తసమాజంబును బ్రోవ నప్పుడు తదా • కారాంశనిందావహిం
చి సదా వర్ణవిభేద మెంచకయ మ • వాప్తి చేతన్ మను
ష సమూహంబున కిచ్చు చుండెదను మో • క్షం బల్పకాలంబునన్ ॥ ౧౩౨

॥ అటవీ నరికించి యిచట మహా నగరము, సేయుమయ్యది పురినాఁ బ్రసి నొందు
ల శైలంబు నేఁటినుండియు నిసుక, తిన్నె యౌనందుఁ గోవెలల్ • రచ్చ వు

తే॥ భక్తి బలరామకృష్ణను ♦ భద్రల నెడు, మూడుప్రతిమలుగా వించి ♦ ముదముతోడ
నందును బ్రతిష్ఠ సేయింపు ♦ మజుని చేత, నేను బౌద్ధస్వరూపినై ♦ నిలుతునందు॥

కం॥ సవురుగ మున్నాటరుపబి, యావసరముల నారగింతు ♦ నహరహమును భూ
ధవ యిదియె ప్రసాదస్థల, మవుఁగావుత నాకుదృప్తి ♦ నదింపంగన్ ॥ ౧౩౭

తే॥ జాతిభేదంబులెన్నక ♦ జనులు మత్ప్ర,సాదమిందు గ్రహించి ప్ర ♦ శాంతదురిత
లగుచుఁ గైవల్యమందెద♦రది గ్రహింప, కెవరునిందింత్రు వారురౌ♦రవముఁగాంతు

వ॥ అని నిర్దేశించిన సింద్రద్యుమ్నుండు మహాప్రసాదంబని యంగీకరించె.
అప్పుడు యజ్ఞనారాయణుండు దేవా నన్ను భవత్సన్నిధానంబునకుఁ దోడుకొనిచనవే
యని ప్రార్థించిన స్వామి యిట్లనయె. ౧౩౮

స్వామి యజ్ఞనారాయణునికి వరంబిచ్చుట.

॥ ఇదినీకుఁ దగ వగు ♦ నే నాదుసన్నిధి, నీయిందుముఖి వరి♦యింతు ననుచుఁ
బలికితి వారీతి ♦ సలుపక యున్నచో, నన్నృతదోషంబు ల ♦ భ్యమగు కుఁ
బుణ్యలోకములేదు ♦ ప్రానిక నెరపి యీ, యళినీలచికురఁ బెం ♦ డ్లాడి సుతులఁ
గని గృహస్థాశ్రమ ♦ కలన నిర్వర్తించి, యటమీఁద మత్పరా♦యణుఁడవగుచు

తే॥ నాదులోకమందు ♦ నాతోడులగు నిత్య, సూరివరులయందుఁ ♦ జేరువాఁడ
విపుడు నన్నుఁజూచి ♦యిటు మత్కృపాలబ్ధిఁ, గనిన నీకుదొసగుఁ♦గ దెపుడు॥

కం॥ అని యానతిచ్చినను హరిఁ, గనియాతం డనియె నేను ♦ క్షోణీసురవంశ్యుం
డను వీరు క్రియారహితులు, విను వీరల పొత్తుసేయ ♦ విడువరెవిప్రుల్ ॥ ౧౩౯

స్వామియానుజ్ఞచే సప్తగృహముల వారికి విప్రసంస్కారములు సేయుట.

కం॥ అని విన్నవింప నారా, యణుఁ డాతనిఁ గాంచి నిక్క ♦ మగునిది యని యం
దొనరిన యేడుగృహంబుల, జనులను బిలిపించి యా ప్ర ♦ సంగము తెలిపెన్ ॥

ఉ॥ వీరికి విప్రసంస్క్రియలు ♦ వేగమ సేయుము వీరు మత్ప్రప
ర్యారచనాదరం బలర ♦ నౌత్కలవిప్రు లనంగ నెల్లెడన్
బేరు వహింతు నా కెపుడు ♦ వీరలె పూజలు సేయుచుంద్రు మ
త్సార కృపానువర్తి దురి ♦ తంబు లడంగి కృతార్థులయ్యెదర్. ౧౪౦

వ॥ అని నిర్దేశించి తన సమక్షంబున యజ్ఞనారాయణునిచే వారికి విధిదృష్ట
ప్రాయశ్చిత్తాది విధానంబులు నడపించి యుపనీతులం బుతులం గావించి

బ్రాహ్మణ్యంబిప్పించి వారిచేఁ దత్కన్యకను యాజ్ఞ నారాయణునకుఁ గన్యాదానంబు సేయించి వివాహమహోత్సవంబు గావించి యింతటనుండి మీకుమాత్ర మీరూపంబుతో గోచరింతు చుందు నితరులకు భావ్యర్చారూపంబున దర్శనం బొసంగు చుండెదనని యాదేశించి యాదేవదేవుం డంతర్ధానంబు నొందె తదనంతరంబున. ౧౪౨

ఇంద్రద్యుమ్నుఁడు పురీనిర్మాణము సేయించుట.

కం॥ ఆయింద్రద్యుమ్నమహా, నాయకుఁ డప్పుడవి పదజ • నంబులచేతన్
జేయించెను నిష్కంటక, తాయత్తము పంచయోజ • నాయామముగన్ ॥ ౧౪౩

కం॥ ఆరమణీయస్థలమున, భూరమణుఁడు గట్టఁ బంచెఁ • బ్రోలొక్కటి నా
నారుచిరసౌధయాభగృ, హారాపసరశ్చతుష్ప • థాదులఁ బేర్మిన్ ॥ ౧౪౪

కం॥ అందు హరికిఁ బ్రాసాద ము, మందిరగోపుర విశాల•మండపములు సం
క్రందననిభుఁ డానృపతి య, నిందిత సౌందర్యములుగ • నిర్మించె వెసన్ ॥

కం॥ రాజభవనంబు దివిష, ద్రాజభవన సన్నిభముగ • రచియించె మహా
తేజుఁ డతఁడు నానాజన, రాజికి ననురూప మందిరములు ఘటించెన్ ॥ ౧౪౬

ఉ॥ అంబరచుంబితుంగ శిఖ • రాగ్రమహామణికుంభయుక్తి సౌ
ధంబులు మేరుభూధరప • ధంబుహసింప విచిత్రకేతనా
లంబితరత్నకాంతిపట • లంబు దివంబున కొక్కవింత చా
యం బురణింప నాలయచ • యంబు గరంబు మనోహరంబుగన్ ॥ ౧౪౭

చ॥ ఎనిమిది దిక్కులన్ బురుజు • లేర్పడి దిక్పతిసంశ్రయంబుల
ట్లనుపమదీప్తిఁ జూప వల•యాచల సన్నిభమైన కోటపెం
పెనయ నగడ్త వారినిధి • యేపున జూప నలోకవైభవా
భినవముగాఁ బురంబు రచించె మహీవలయంబు నాఁ గడున్ ॥ ౧౪౮

ఉ॥ ఆపణవీథులందు సుప•దార్థము లన్నియుఁ గొల్లఁగాఁ గడున్
జూపరు లద్దిరా యనఁగ • సొంపు వహింప నవీనరత్నమా
లాపటుదీధితుల్ దివిత•లంబుగ నిండి యలంకరింపఁగా
నాపురిరాజమార్గ ముది•తాద్భుతచిత్తులఁ జేయు నెల్లరన్ ॥ ౧౪౯

కం॥ అప్పు డింద్రద్యుమ్నధరా, ధిపుఁడు రమానాయకోప•దిష్టస్థితి భ
క్తిపరీతుఁ డగుచు జలరా, శ్యుపకంఠగమీషు లైపు • హోదో గమునన్ ॥

# జగన్నాథీయము

## ఇంద్రద్యుమ్నుఁడు సముద్రమునందలి వృక్షమున్ ఛేదించుట

మ॥ చని కాంచెన్ జలరాశిలోపల సముం•చత్తుంగ భంగావ
పునరభ్యర్ణనిహన్యమానము ముహుః•ర్వ్యాభియుక్తశాఖాసహ
స్రనితాంతావృతసర్వ దిగ్వలయముం • జంచచ్ఛదోద్భూత వా
యునిరస్తాంబుధరప్రతానము విశా • లోర్వీరుహోత్తంసమున్ ॥ ౧౫౧

మ॥ కని యావృక్షము భూరితేజమునకున్ • క్ష్మాభర్త యాశ్చర్యమొం
ది నిరూపించి తదీయజాతి యిదిగా • నిర్ణీతి సేయంగ లే
కనుమానించి జనార్దనోక్త మిదియే • యై యుండు నంచున్ దలం ౧౫౨
చి నిశాతోగ్ర పరశ్వథ ప్రహతులం • ఛేదింపగా నెంచుచున్ ॥

చ॥ కడు మృదుళంబుగాఁ దనరు • స్కంధమునన్ బరశుప్రహార మ
య్యెడ నొనరింపఁగా రుధిర • మేపునఁ జింది మహాప్రవాహమై
జడనిధినీర మంతయును • జయ్యనశోణితరూప మొందఁ
యుడు నృపుఁ డేమిచోద్య మని • యూహపడంగ వితాకు నొందగన్ ॥

## ఇంద్రద్యుమ్నునకు విప్రయుగంబు కనుపించుట.

శా॥ కడుదూరంబునఁ దోఁచి రిద్దరు జరా•క్రాంతాకృతుల్ విప్రు ల
య్యెడ భూనాథుఁడు సూచు చుండఁగనె వా • రేతెంచి రచ్చోటికిన్
వెడఁగున్ బోలిక నున్నయున్నరపతిన్ •వీక్షించి నీ వేల యి
క్కడ నున్నాఁడ విదేమి యీతరు విటుల్ • ఖండించె దో చెప్పుమా ॥

ఉ॥ అని యడుగంగ భూపతిమ • హామహులార ! హరిప్రతీక పూ
జనమున కిందు విగ్రహము • సల్పఁగ మాధవునాజ్ఞఁ జేసి యి
వ్వననిధి నున్న వృక్షమును • వారక ఘోరపరశ్వథాహతిన్
దునుముచు నుంటి రక్త మిటుఁ • దోఁచె నిదేమివిచిత్రమో యనన్ ॥ ౧౫౫

ఉ॥ ఇరువురియందు నొక్కఁడు స • మిద్ధమహానిధి పల్కె నిట్లు భూ
వర ధరణీజమున్ నరక • వచ్చునె నీ కటు రమ్ము దాని నీ
పరశువుచేత నీద్విజుఁడు • బల్విడిఁ ద్రుంచెడు నంతదాఁక నీ
శరనిధితీరవృక్షముల • చాయ వసించెద మంచుఁ బల్కినన్ ॥ ౧౫౬

ఉ॥ ఎల్లె యటంచు నయ్యవని • భర్త పరశ్వధ మిచ్చి వాని క
ల్లల్లనఁ జెట్టునీడలకు • నై చని చూచుచు నుండ వృద్ధుఁడున్

ద్రెళ్లఁగ వైచె గ్రొడ్డలి ధ ♦ రించి క్షణార్థములోన భూమిరు
ట్పల్ల జయున్ మహాద్భుతవి ♦ ధం బని రాజు ప్రశంస సేయఁగన్ ॥ ౧౫౭

తరల॥ అది గనుంగొని మీరు దివ్యుల ♦ టంచు నెంచెద మీ తెఱం
గుదితసత్కృప నానతిందు మ ♦ హోన్నతాత్మకులార యుం
చుఁ దగ వేఁడఁగ నెవ్వరైనను ♦ జోద్యమందఁగ నేల నీ
మదిఁ దలంచినకోర్కి చేసరు ♦ మాడ్కిఁ జేయుట చాలదే ॥ ౧౫౮

॥ ఈ గ్రామాను పురికిఁ బ ♦ ట్టించుక చనుమందు, నీవృద్ధవిప్రుడే ♦ యేగుదెంచి
నీవు గోరినమాడ్కి ♦ నెరవుగా బ్రతిమలు, గావించు మూటి న ♦ క్కజము గాగ
శ్వేతాంగు బలభద్రుఁ ♦ దగాత్రి సుభద్ర, నీలదేహుని గృష్ణు ♦ నిగఁ దలంచి
ధృతి బ్రహ్మచేతఁ బ్ర ♦ తిష్ఠ చేయింపుము, బౌద్ధావతారుఁ డౌ ♦ పద్మనేత్రుఁ
డందు వసియించి నీసపర్యలు గ్రహించుఁ, బుడమి గలవారికెల్లను ♦ భోగమోక్ష
దాయకుం డగు నీకు ని ♦ శ్రేయసంబు, నిచ్చునని చెప్పి విప్రుడ♦దృశ్యుడయ్యె ॥

రాజు వృద్ధవిప్రుని బ్రతిమలు సేయ నియమించుట.

తే॥ అతడు పరమేశ్వరుం డగు ♦ హరి యటంచు, దలచి భక్తి స్మరించి వం ♦ దనము చేసి
వృద్ధ విప్రుని బ్రార్థించి ♦ యద్ధరాధి, నాధుడాతని గొని తెచ్చె ♦ నగరమునకు ॥

॥ పట్టణంబున కరుదెంచి ♦ బలగములను బంచి యా గ్రామాను పురికి దె ♦ ప్పించివృ
విప్రునర్చించి దీని నీ ♦ విద్యకలిమి, మెరయఁ బ్రతిమలు గావింపు ♦ మీ యనఁగ ॥

॥ అతఁ డిట్లనె దారువు ♦ లాలయమునఁ, జేర్చి తలుపులుమూసి య ♦ చ్చెంత నరులు
మెలఁగ కుండంగ నియమింప ♦ వలయు నందు, నుండి ప్రతిమలు గావింతు ♦ నొప్ప మీర ॥ ౧౬౦

కం॥ పని పూర్తి సేయువరకును, ననుఁ బిలువఁగ రాదెవరును ♦ నరవర యవలన్
జనుదెంచి విగ్రహములు త, గ నివేదించెదను మీకుఁ ♦ గౌరవ మొప్పన్ ॥

వ॥ పని పూర్తియగులోపల దొందరపడి కవాటంబులు దెరచినను, దత్పరిసరంబు మనుజులు మెలంగినను, మీపూన్కి వ్యర్థ మగునని చెప్పిన నంగీకరించి రాజు తదుక్త విధానంబెల్ల నను సంధించిన నావృద్ధవిప్రుం డాలయాంతర్గతుండై పని చేయుచుం

డే వెలుపలివారికి దారుకాతనాది శబ్దంబులు కర్ణగోచరంబు లగుచుండె నిట్లుపంచదశ దివస పర్యంతంబును జరుగ నరనాథుండు కాలవిలంబం బోర్వలేని చిత్తవృత్తి వలని ప్రమాదంబునకు లోనై యొక్క నాడు.

రాజు కోవెలతలుపులు దెరచుట.

కం॥ పలుదినము లయ్యె విప్రుడు తలుపులుబంధించి లోన • దానుండెడు న
లజాతు ప్రతిమ లెన్నఁడు, సలుపునో యే నెపుడు పూజ • సవరించు ప్రదునో ॥

కం॥ పరికింపఁగ "ధర్మశ్చ, త్వరితాగతి" యనుటవినమె • తానెన్నటి
ధరణిసురుఁడు వెలువడెడినో, హరిప్రతిమలు సూచు టెప్పు • డలవడియెడునో ॥

కం॥ కానిమ్ము చూతు లోపల, దానేమి యొనర్చెడునో కో • ధరణిసురుడటం
చానరపతి ద్వారముదరి, గా నేగి వినంగ నించు • కయు సడి లేమిన్ ॥

కం॥ నిమ్మకు నీ రెత్తినగతి,నిమ్మళముగ నుండె లోన • నిజముగ ద్విజుఁ డిం
దిమ్మెయి నుండెనో లేదో, వమ్మయ్యె మ ప్రీతంబు • వంచన చేసెన్ ॥ ౧౬౮

ఆ॥ ముసలిబాపఁ డేడ • నసదృశస్థితి దారు, వులను జెక్కి ప్రతిమ • సలుపు టేడ
కూడు నీళ్లు లేక • నోడక నిన్నాళ్లు, నుసురుతోడఁ గూడి • యుండు టేడ ॥

తే॥ అని వితర్కించి యే మైన • నగు నటంచుఁ,బరిజనులఁ బంచి తలుపులు• దెరువఁ సి
చూడముది బ్రాహ్మణుఁడు గాన • రాఁడయంగ,హీనములుమూడు ప్రతిమల• య్యుంటనుండె ॥

ఆ॥ అతివికారరూప • యుతము లై హస్తపా, దావళిప్రసువిక • టాంగము లయి
యున్నవిగ్రహముల • నన్నరపతి చూచి,కడు విషణ్ణుఁ డగుచుఁ • గలవరించె ॥

వికృతవిగ్రహములఁ జూచి రాజు పరితపించుట.

చ॥ అకట యిదేటివిగ్రహము • లచు తుఁ జేయుదు నంచుఁ బూని వం
చకుఁ డగువృద్ధవిప్రుఁ డిటు • సల్పె మహీసురుఁ డేడ శిల్పకృ
త్యకలన మేడ నం చెరుఁగ • కద్దిర యీగతి మోసపోతి నే
నిఁక హరిమూర్తు లెట్లు విర • చింతుఁ బ్రతిష్ఠ యొనర్తు నియ్యెడన్ ॥ ౧౭౯

వ॥ "శ్రేయాంసి బహువిఘ్నాని" యను నార్యోక్తి వినమే అస్మత్కరిష్యమాణహరిప్రతిష్ఠావిధానంబున కిట్లు విఘ్నంబు సమకూరె నేమిసేయుదు నని పరిదేవనంబు సలుపుచున్నంత.

రాజున కాకాశవాణి హరియుద్దేశము తెలుపుట.

చ॥ నరవర చింత నొందకు జనార్దను నానతి యిట్టి దారమా
వరునితలంపు గా దనఁగ వచ్చెనె యీదృశరూపధారి యై
ధర వసియింప నెంచె మురదానవభేది విలంబ మేల నీ
వెరవుతలంప కిట్టులనె వే నిలుపం దగు నాలయంబునన్ ॥ ౧౭౮

తే॥ అని నభోవాణి పలుకఁగా నాలకించి, హరితలంపున కన్యథా యగునెయనుచు
నారడిలి తత్ప్రతిష్ఠకై నీరజాత, గర్భుఁ గొనితేర సత్యలోకమున కరిగె॥

రాజు విగ్రహప్రతిష్ఠ సేయింప బ్రహ్మగారకు సత్యలోకమున కరుగుట.

వ॥ అట్లరిగి సనకసనందన సనత్సుజాత సనత్కుమార, కశ్యపాత్రి వసిష్ఠ విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజాంగిరః పులహపులస్త్య విశ్రవః కణ్వగాలవరైభ్య వరతంతు వాల్మీకి భృగు పరాశర చ్యవనభార్గవాగస్త్య సుతపోవాలఖిల్య వైఖానస మంకిమంకిణమాండవ్య దళాదపిప్పలాద శుకశౌనకాద్యనేక మునిగణ పరివేష్ట్యమానుండును, ఋగ్యజుస్సామాథర్వణ వేదంబులును శిక్షాకల్ప నిరుక్త జ్యోతిష ఛందో వ్యాకరణములును, షట్ఛాస్త్రంబులును, పాణినీయ జైమినీయ వైయాసిక కాపిల కాణాదాక్షపాదదర్శనంబులును, నీశకేనకఠప్రశ్న ముండక మాండూక్య తైత్తిరీయైతరేయ ఛాందోగ్యబృహదారణ్య హంసపరమహంస కైవల్య శ్వేతాశ్వతరగూఢారుణిక బ్రహ్మనారాయణ మహానారాయణాదిక సహస్రాష్టోత్తర శతోపనిషత్తులును, మనుగౌతమశంఖలిఖిత పరాశర భృగ్వత్రిబుధ హారీతశాతాతపకణ్వ కాత్యాయన దక్షసంవర్త వసిష్ఠవ్యాసోశనయాజ్ఞవల్క్య నారదాదిస్మృతులును, బ్రాహ్మపాద్మకూర్మ వరాహవాయు బ్రహ్మవైవర్త భవిష్యోత్తర భాగవత మార్కండేయాగ్నేయ మాత్స్య స్కాంద వైష్ణవ నారదీయ లైంగ వామన గారుడ బ్రహ్మాండంబు లను మహాపురాణంబులు పదునెనిమిదియు, నారసింహసాంబ నందాదిత్య కాళికాద్యుప పురాణంబులును మొదలగు చతుర్దశ విద్యలును, నాకృతులు దాల్చి పార్శ్వంబుల ననువర్తింప నష్టాంగయుక్తంబులగు మంత్రలయ హఠాది యోగవిద్యలు దివ్యమూర్తులచే నోలగింప గంగా సరస్వతీ కాళిందీ నర్మదా కృష్ణా గోదావరీ కావేరీ త్యాది మహానదులతో సముద్రుం డొక్కప్రక్క సేవింప భృగుమరీచికశ్యప దక్షపుల హ పులస్త్యాది ప్రజాపతులు భవిష్యసర్గోపసర్గ వృత్తాంతంబులు నివేదింప, నింద్రాదిలోకపాలు రవసరంబు లెరింగి శాసన

ధారులై చరింప, నానానిలింపసంతానంబు లూడిగంబు లాచరింప, గంధర్వాప్సర స్సమూహంబులు నృత గీతంబు లాచరింప, సర్వతోముఖచాతుర్యంబున నవధరించుచు వామాంకంబున నాసనయై శారదాదేవి ప్రణవవీణం బలికించు సంగీతనాదంబు లాలించుచు, బరమానంద కందళితాంతరంగుం డై నిండుకొలు వున్న వేల్పుపెద్దం గాంచి సాష్టాంగ నమస్కారంబు లాచరించి, యవసరంబు వేచి క్షణకాలంబు తాళి యనంతరంబు మోడ్పుకేలు ఫాలంబునం గీలించి యద్దేవదేవుని నుద్దేశించి యిట్లనియె. ౧౭౬

సీ॥ నీవ విధాతవు • నిఖిలనిర్ణేతవు, దాస్పితార్థసం • ధాత వీవ
లోకంబులు సృజించి • లోకపాలుర నిర్ణ, యించి తత్పంవిధా • నేచ్ఛ వేద
ములు ప్రసాదించితి • వలఘుమహాత్వశా, లివి నీకుఁ దుల్యుండు • లేఁడు విశ్వ
మందు సురజ్యేష్ఠుఁ • డను పేరు దాల్చెద, వజుఁడవు నీవ వి • శ్వాతిశాయి
గీ॥ వీవ నీయాజ్ఞ లేనిది • తృణము గదల, నేర దేమని నిన్ను వ • ర్ణింప నేర్తు
శారదాదేవి నీసతి • సకలలోక, జనకుఁడవు నీవు దాత వి • శ్వప్రణేత॥ ౧౭౭

ఆ॥ అని నుతించి దేవ • యవధారు నీలశై, లేశుఁ డైన యిందిరేశునాజ్ఞ
చారువిగ్రహములఁ • దగ వినిర్మించితి, సంప్రతిష్ఠ నీవు • సలుపవలయు॥౧౭౮

రాజునకు బ్రహ్మ హరిప్రతిష్ఠ జరిగిన దని చెప్పుట.

కం॥ హరియాన తిచ్చె నీగతి, పరమేష్ఠి ధరిత్రి వు • పరతెంచి జగ
ద్గురుఁ డగుమాధవునర్చా, స్వరూపముల సంప్రతిష్ఠ • సలుపును దేవా॥ ౧౭౯

మ॥ అని ప్రార్థింప దరస్మితాస్యుఁ డయి యా • య్యబ్జాతగర్భుండు న
జ్జననాథుం గని నాదులోకమున నీ • వున్నకాల మై తోఁచు నీ
యునికిన్ భూస్థలి లక్ష లబ్దములు గా • నొప్పారుఁ గాలంబు పో
యెను నీరాకకు వేచి యుండెదరె లో • ష్మీశుఁ బ్రతిష్ఠింపఁగన్॥ ౧౮౦

తే॥ పెక్కువే లేండ్లక్రింద నే • పృథివి సంప్ర, తిష్ఠితునిఁ జేసి రా దేవ • దేవు నెల్ల
నరులు సేవించుచును జగ • న్నాథుఁ డనుచు, భక్తిఁ గీర్తించు చున్నారు •
పావేంద॥ ౧౮౧

కం॥ కలియుగమున బౌద్ధాకృతి, కలితుం డై విష్ణుఁ డా జగన్నాథునిలో
నిలిచె నిజాశ్రిత కోటికి, సులభంబుగ ముక్తి నిచ్చు • చున్నాఁడు సుమా॥

# జగన్నాథీయము

తే॥ అట్లు గావున నీ వింక • నరుగుచుర్వి, కాజగన్నాథు సేవించి • యభిమతముల
బడసి కైవల మొందుము • వసుమతీశ, యేను నీతోడ నటకు రా • నేల యింక

వ॥ అని చెప్పిన నిద్రద్యుమ్నుం డధోముఖుండును విషణ్ణచిత్తుండును
చేయునది లేక తోడనె వసుధాతలంబున కరుదెంచి.

రాజు భూలోకమునకు వచ్చి జగన్నాథుని దర్శించుట.

చ॥ కనుఁగొనె వర్ణభేదములు • గైకొన కెల్లరు వాసుదేవునిన్
జను వమరం భజించుచుఁ బ్ర • సాదము గైకొనుచున్ నితాంత పూ
జనలఁ బ్రసన్నుఁ జేయుచు స • జస్రము నూరులు మూడు సర్వదై
యొనరు నివేదనంబులు స • మువ్వలభక్తి నొనర్చుచుండఁగన్॥ ౧౭౪

॥ దేవదేవ జగన్నాథ • దీనరక్ష, నీలశైలేశ కరుణాల • వాల మమ్ముఁ
బ్రోవు మనుచును జను లెల్లఁ • బూజ సేయ, నాత్మసంచితమూర్తుల • నందు
గనియె॥ ౧౭౫

॥ సంపూర్ణచంద్రికా • చ్ఛాయఁ బ్రకాశించు, బలరాముఁ డొకప్రక్క • పరిఢవిల్లఁ
దప్తకాంచనకాంతి • దర్శనీయాకృతి, నడుమ సుభద్రవి • న్నాణ మొప్ప
సజలవలాహక • శ్యామాంగుఁడై జగ, న్నాయకుం డొకచక్కి • నలువు మీర
తాను యించిన • దారువిగ్రహములే, సంప్రతిష్ఠితము లై • సకలజనుల

॥ చేతఁబూజింపఁ బడుట వీ • క్షించి యతఁడు, దనకు నట్టిభాగ్యంబు లే • కునికిఁ
యాజగన్నాథుని నెదుర సా • ష్టాంగ మొరఁగి, యతివిషణ్ణమనస్కుఁడై • స్తు
యొనర్చె॥ ౧౭౬

దండకము.

శ్రీనాథనాథా జగన్నాథ మన్నాథ లక్ష్మీసనాథా సదాధార సద్భక్తమం
దార మాణిక కేయూరహారాదిభూషా రామాకృతీ శ్రీపతీ కేశవా మాధవా పుం
డరీకాక్ష భక్తానుకంపామహోదీక్ష సచ్చిన్మహానంద సద్విగ్రహా శాశ్వతానుగ్రహా
శంఖచక్రాబ్జశార్ఙ్గాదిహస్తాప్రశస్తా నిరస్తాశ్రితాపద్ఘనధ్వాంత నిత్యప్రశాంతా సహస్రా
ర సంకాశ భవ ప్రకాశా రమేశా సురద్వేషినాశా ముకుందా మహానందకందా
లిసీలాంబుముక్తాపురుశా ర భవ్యప్రకారా తటిద్వ్యాకచారుసౌవర్ణచేలా సముద్రక్ష
ణోద్వేల కారుణ్యశీలా హృషీకేశ పాపప్రణాశా నృసింహా విపన్నావనాత్యంతరంహా
విధూతాంహా నీబోలో మేడిపండ్లం బలెన్ నల్వ గ్రుడ్డుం బనంటుల్ దగన్ వేన

లుండు నిన్నిట్టివాఁ డంచుఁ గొండాడ నీ వేదముల్ పూని లెక్కింప నీయున్కి యీచంద మంచాడఁ బ్రాఁబల్కులే జాల వేవెన్న నెవ్వాఁడ నోరేఁడ నల్పోములం గల్గు నప్పోడ నీపొక్కిటం దమ్మిలోఁ బుట్టినాఁ డెల్లవేల్పుల్ నినుం జూడఁగాఁ జాలరో మాయకాఁడా తొలిన్ మేటి ప్రాఁబల్కులం మాటి మున్నీటిలోఁ దూఁటి తాటోటురాకాసి నల్పోములయ్యం దటాయింపఁగా నోపి బల్చేపవై యేపునన్ వాని పేర్మాపి తొల్మినుకులన్ బమ్మ వే కడున్ బల్మిఁ దొల్వేల్పులున్ వేల్పులుం బాలసంద్రింబుఁ ద్రచ్చంగఁ గవ్వంపు బల్కొండకున్ మోపు లే కట్టె నీటన్ మునుంగన్ గడున్ సూటి తాఁబేటి వై మీటవే బంగరుంగండ్ల బల్గ్రుక్కురేఁ డుక్కునన్ గ్రక్కునన్ నేల యెల్లన్ వడిం జుట్టి తాఁ జంకలోఁ బెట్టి మున్నీటిలోఁ డాఁగ నాఁగ్రాఁగకై పంది వై క్రిందుగన్ వాని మ్రిందించి యేపారఁగాఁ గోడపై మీరునమ్మన్ను చారం బలెన్ వేబులిన్ గ్రిచ్చి పై కెత్తవే, దిట్టఁడై పట్టితో నీసు రా పెట్టి యా చుట్టువాల్దాల్పు లేఁ డెందు లేఁడుం డె నే నిందుఁ జూపింపరా యంచు బల్గంబమున్ వ్రేయ నంతన్ దటానన్ బెటూలంచు నీయెల్లయున్ దల్లడిల్లన్ వెసన్ బ్రద్దలై కంబమురూపైత లూఁగన్ బొగల్ మంటలున్ జంటలై మింట నంటన్ మిటారించుమున్ వేఁడిచూపుల్ మిడుంగుర్లుగన్ గ్రుమ్మరింపంగఁ బెన్ బొబ్బలన్ నిబ్బరంబేది బల్బొమ్మగ్రుడ్డుం గముల్ పల్లటిల్లన్ బసన్ రోసమే రూపు గన్నట్లుగా మానిసిన్ సింగఁపున్ రూపుతో వచ్చి బల్కినల్లో హెచ్చఁగాఁ గ్రచ్చరన్ బూని రాకాసిమున్నీని వేగోరులం జీరవే మేన వేఁగన్నులం దాల్చు నప్పాదుషానిట్టి పారంబెరం బెట్టి దిట్టంబునన్ ముజ్జగంబుల్ ఖడాయించి తా నేలుచున్నట్టి తొల్వేల్పుఱేనిన్ గనన్ బొట్టికుఱ్ఱండ వై పట్టిగోఁచిన్ మెడన్ జన్నిదంబున్ బెడంగొప్ప గొడ్డుం వడిం బూని లేవడ్డు వేసంబునన్ డాసి మూడంజ లీ నేల యిమ్మంచు గోరిన్ వేఁడి మూడంజలన్ ముజ్జగంబుల్ దగం గొల్చి యచ్చ్యాగపున్ సోఁకుమన్ని నడుంగంటఁగన్ ద్రొక్కవే మొక్కలంపున్ ధరామండలాఖండలక్కార్త్తవీర్యార్జునస్ఫూర్జదూర్జస్వలోద్వేలబాహాసహస్రాటవీచ్ఛేద నోద్యత్కుఠార స్ఫురద్ఘోరధారా దురాలోక సమ్యక్ప్రచారాతివిచ్ఛిన్నరాజన్యమూర్ధన్యకంఠప్రణాళీస్రవచ్చంచదస్రప్రచారప్రక్లిప్త ప్రవాదాపాదితాంచన్నివాసాంజ విన్యాససంతర్పితాత్మీయ పిత్రౌఘసాహిత్యకృతస్వర్గ మార్గీయ సోపానభాక్క్షత్రమూర్ధప్రకాండ ప్రతిన్యాసకృత్తీవ్రశౌర్యప్రభావాండ మాసాబ్జగర్భాండభాండుండ వై జామదగ్న్యాన్వవాయాబ్ధిసోముండ వై మున్ను రాముండ

వై యుండవే తండ్రిసత్యంబు పాలింప భూపుత్రిసౌమిత్రియున్ వెంటరా గొంటు రాకాసి రామన్ని కూపట్టైన యా దండకారణ్యసీమన్ ద్విసప్తాబ్దసంచారివై చేర వేడన్నిరాచారిరాచారులన్ గావఁగా నెంచి చంచన్నిశాతాస్త్రధారాప్రవర్షంబులీలం బరగించి మాద్యత్ఖరాదిత్రియామాచరవ్రాతమున్ గూల్చి యాభ్రాతృవిద్వేషి యౌ వాలి మన్మాలితుం జేసి జాగ్రత్కృపాసక్తి సుగ్రీవు నద్రీవుఁ గావించి కిష్కింధ యేలించి మున్నీటిపై రాలు దేలించి శాఖామృగానీకినిం దెచ్చి యాలంక పై దండు వెట్టించి పౌలస్త్య సభ్రాతృపుత్రాశ్రితామాత్యబంధు ప్రకాండంబు గాఁ ద్రుంచి యా కైకసీభూకసీయున్ దయాయుక్తి లంకాధిపుం జేసి యుర్వీతనూజాతతోఁ బ్రీతి సేతించి సాకేతనాథుండ వై సర్వలోకాభిరాముండ వై నీదు నామంబు సంసారవారాశి సంతారకం బై విరాజిల్లఁగాఁ జేయవే యాదవేంద్రాన్వయం బందు నద్దేవకీగర్భవారాశికిం బూర్ణచంద్రుండ వై సాంద్రచంద్రాంశు దేహచ్ఛవిన్ దోఁచి సంకర్షణాఖ్యున్ వినీలాంబుముక్పూరుశారీరరోచిష్ణుతన్ గృష్ణనామంబునన్ దాల్చి కంసాది దుష్టాసురశ్రేణి మర్దింపవే దుర్దమక్ష్మాభరక్షేపణోల్లాసతన్ మించవే నీస్వభావం బనిర్దేశ్య మో దేవ నిత్యంబునన్ నిర్గుణంబున్ నిరాలంబమున్ నిర్వికారంబు నిష్కల్మషంబున్ నిరూహ్యంబు నిర్ద్వంద్వమున్ నిర్విశేషంబు శుద్ధంబు బుద్ధం బనాదనంత మాత్యంతికానందకందం బనిర్వాచ్య మేకం బనాలోక మున్స్తోక మప్రాకృతం బద్వితీయంబు నా వెల్లు నీవే త్రయీమూర్ధమార్గంబులన్ వ్యగ్యమౌ నీస్వరూపంబు పంబునుం బోలె నాజ్ఞామహాచక్రపీఠాంతరాలక్ష్యలక్ష్యంబు గాఁగన్ మహాయోగు లీక్షింతు రో దేవదేవా కృపాదృష్టి నీక్షించి రక్షింపవే మ్రొక్కెదన్ నా మొ రాలింపవే సర్వలోకైకనాథా జగన్నాథదేవా నమస్తే నమస్తే నమః

చ॥ అని వినుతించి దేవ యక • టా నను మోసము సేయ నెంచుటల్
చను నె భవదుక్తమార్గమున • సారసగర్భునిఁ జేర నేఁగఁగా
నను విడనాడి వేఱ గుణ•నంబుల చేతఁ బ్రతిష్ఠఁ గైకొనన్
జను నె ముకుంద నిన్ను మది • నమ్మిన యందునకున్ ఫలం బిదా॥ ౧౮౯

॥ అకట యింద్రద్యుమ్నుఁ • డాలయాదులు గట్టి, దేవునియందుఁ బ్రతిష్ఠ సేయ
జాలఁ డయ్యె నటంచు • జను లాడునపనింద, భరియింపఁజాల నో • పరమపురుష

  

పొసఁగ నన్నుఁ బెట్టఁ భుజియింపఁ జాలని, వానికై పడి రిత్తవాఁడ నైతి
జన్మ మింకేల రో జగదీశ నీపాద, సన్నిధి దేహ విసర్జనంబు

॥ సలుపుదునటంచు భూరివిషణ్ణచిత్తుఁ, డగుచు గళ మ్ముత్తరింపఁగా నలఘుపరశు
నెత్తి వేసికొనంగ నుంకించి యున్న, యమ్మహారాజు సాహసం బవధరించి॥

చ॥ వనరుహలోచనుండు బలవంతము సెల్లునె మానుమాను మో
జనవర యేటి తగని సాహస మూఁగు మవశ్యభావి యా
పని యటులాగునే తగని పట్టిది యేటికి యెవ్వ రెట్లు చే
సి భవదీయకర్తృతకుఁ జెందునె భంగము లెన్ని భంగులన్॥ ౧౯౦

తే॥ కర్తవును గారయితవు నిక్కముగ నీవె, మత్ప్రతిష్ఠకు నీపేరు మారఁగలదె
ధర్మకర్తవు నీవె సత్యముగ మాకు, సంశయం బేల నిందుకు జనవరేణ్య॥

వ॥ నృపాలా నీ కిందు సందియంబు వదల దేని నీపేర వేరుగ మండపాలయం
బులు నిర్మింపుము, ప్రతిసంవత్సరంబు నాషాఢశుద్ధపూర్ణిమ కచ్చటకు విచ్చేసి బ్రహ్మో
త్సవం బచ్చట నవధరించి యందుఁ బదిదినంబులు నివసించెద నప్పుడు మమ్ము సేవిం
చినవారిని సంవత్సరంబు నెడతెగక సేవించినఫలం బగు నిది నమ్ము మని యాశ్వాసించి
యందునకుఁ బూర్ణంబుగఁ బరితుష్టచిత్తుండు గా కున్కి యెరింగి మరల ని ట్లనియె.

తే॥ భూతలాధీశ కలి సంభూత మగుచు, నీవు జన్మింపఁ గల వప్డు నిశ్చయముగ
మత్కళాదారురూప నిర్మాణ మమర, నిలస్థలాంతరమున నన్ను నిలుపఁ గలవు॥

వ॥ అందు మత్కళావేశంబు గావించి జగన్నాథాఖ్య వహించి భక్తజనా
నుగ్రహంబు సలుపఁ గలవాఁడఁ గడచినపనికిఁ జింత సేయకుమని నిర్దేశించిన నింద
ద్యుమ్నుఁడు కొండొకదెరి యమ్మురారిచరణారవిందంబులకు సాష్టాంగ మాచరించి త
దుక్తమార్గంబున నూతనమండపాలయంబులు గట్టించె నందు భగవంతుం డనువత్సరం
బును బదిదినంబులు నివసించుచుండు నని చెప్పుటయు. ౧౯౨

ఆశ్వాసము.

శా॥ ద్రాగుత్సారిత భక్తసంచయ విపత్ప్రస్తావనిస్తాపక
ద్యోగీంద్రాంచితలక్ష్యచిన్మయపరవ్యోమాంతరాస్తోక తే
జోగణ్యాకృతి సారసారసభవస్తోత్రార్హచారిత్ర శ్రీ
ప్రాగల్భ్యాన్వితచారు సూర పుర విభ్రాజిష్ణుధిష్ణ్యశ్రియా॥ ౧౯౩

క॥ . షణతరవిక్రమ ఖర, దూషణదుర్వారగర్వ ◆ ఘూనదనుజ
ప్లోషణబాణధురీణ వి, షణరాజ్యప్రదాన ◆ విద్యాధీనా॥

మాలిని॥ సకల సుగుణజాలా ◆ సాధుసంత్రాణశీలా
ముకురనిభకపోలా ◆ మోక్షసామ్రాజ్యమూలా
వికటదనుజకాలా ◆ విస్ఫురత్కీర్తిమాలా
సుకృతచయవిశాలా ◆ సూరిలోకానుకూలా॥

గద్యం.

ఇది శ్రీమద్వృషాకపి కృపాకటాక్ష పరివర్ధిత సహజసారస్వత
సమ్పాదిత ప్రబంధకవిపంచాననబిరుదాభిరామ విశ్వామి
త్ర బ్రహ్మర్షి సంప్రదాయాడవి నందగిరివంశాబ్ధిసో
మసహజ సౌహృదమహోద్యమ సాంబ
శివవేంకటప్పరాయకవి లలామ
వినిర్మితంబగు శివవేంకటీ
య గ్రంథమాలయం
దుతృతీయపుష్ప
జగన్నాథీయ
మహాప్రబంధ
మునద్వితీ
యాశ్వా
సము.

# జగన్నాథీయము.

## తృతీయాశ్వాసము.

:0:

కం॥ శ్రీమత్పూర్వపురోత్తమ, ధామారవికోటిధామ దళితనిశాట
స్తోమాసమధికసద్గుణ, సీమాసంపూర్ణకామ సీతారామా॥ ౧

వ॥ సూతుండు శౌనకాదుల కిట్లని సెప్పె నప్పగిది నారాయణశర్మ శ్రీజగన్నాథస్వామిచేఁ బరిదత్తవరుం డైన యనంతరంబునఁ గొంతకాలంబునకు. ౨

కనకాకరపురవర్ణనము.

కం॥ అరిగెం గృతత్రేతాద్వా, పరములు కలియుగము సొచ్చె బల మరి ధర్మా
చరణము లోపించుటచే, నరులకు నజ్ఞానతమము నగ్గె బోధ మరన్॥ 3

తే॥ దురితభూయిష్ఠ మైనయత్తరిన బోధ,లిద్ధహృదయుల నరుల సముద్ధరింపఁ
బరమకరుణాస్వభావుఁ డౌహరిధృతావ,తారుఁ డగుటకు ననువగుతరి ఘటిల్లె॥

వ॥ అట్టిసమయంబున.

చ॥ కల దొకపట్టణం బవనికాంతకుఁ బాపటబొట్టు నాఁగ ను
జ్జ్వలతరసంపదాకరము బంధురధర్మచరిష్ణుమానవా
కలితము పూర్వవారియుపకంఠమునన్ గనకాలవాల మన్
నలు వగుపేరు సార్థక మొనర్పఁగ నయ్యలకాపురం బనన్॥ ౪

ఉ॥ వేధ జడస్వభావమును వ్యర్థతయున్ బయికొన్నసర్గసం
పాదన యారతారలుగఁ బల్మరు సేయువిధాతచెయ్వులం
గా దని వేదశాస్త్రములకల్మి సమంచితకార్యదక్షతా
సాదరచిత్తు లైనచతురాస్యులు బాడబు లుందు రచ్చటన్॥ ౫

ఉ॥ ధాత లి ంచినట్టిలి తంబులు చెల్లును వానితోడ నే
భూతలమందు బుద్ధిపరిపూర్ణత నచ్చటిరాజకార్యవి
జ్ఞాత లమాత్యశేఖరులు త్మ్యాసురు లోపిక వ్రాయువ్రాఁత లా
తమయాఖకారము నశింపక మించు జను ల్నుతింపఁగన్॥ ౬

# జగన్నాధీయము

మ॥ అపరోదోద్ధతటిల్లతావితతిభూ•యస్సర్వతో వ్యాప్తి చే
విపులాలోకన కరంబుగఁ దగన్ • వెల్గొందు శూరాగ్రగ
స్త పరిదోతితమండలాగ్రగతి కెం•చన్ దారిఁ జూపంగఁ దా
నిపుణామాత్య సమగ్రబు కలనా • నిస్తంద్రచాతుర్యముల్॥ ౯

చ॥ కడువడిఁగా మిడుంగురులు • గ్రమ్మి కనల్ మిరుమిట్లు గాంచఁ బైఁ
బడి నెడ లేనిశూరకర•వాలహతిన్ గికురింప వచ్చుఁ గా
కడ రెడు నీతిసారమున • నడ్డము లేని ప్రయోగవైఖరిన్
మడిమలు ద్రొక్కి వచ్చెడు న•మాత్యుని ప్రజ్ఞకు డాఁగ వచ్చునే॥ ౧౦

చ॥ అదిమి సమస్తవైరివసు•ధాధిపులన్ గడ కొత్తి రాజసం
పద లాగిఁ గ్రొల్లువార గరి•మ న్ననురాజ్యవిభూతి నిల్వఁ గాఁ
జదు రగు రాజుబాహుబల• సైన్యబలంబులు గావు కారణం
బుదయదమాత్యమంత్రబల•యుక్తి బలంబులు గాక యెయ్యెడన్॥ ౧౧

చ॥ అవనివిభుల్ సగౌరవస•మంచదమాత్యపదంబులందు ని
ల్ప విపులధీచమత్కృతులు•ప్రస్తుతి కెక్క దదీయరాజ్యవై
భవము నుదాత్తభంగిఁ బరి•పాలనఁ జేసి జగన్నుతప్రభా
వవిపుల ర్తులన్ గనిన•భవ్యులు గారె నియోగిభూసురుల్॥ ౧౨

లింగరాజు చరిత్రము.

ఉ॥ అట్టినియోగివంశకమ•లాకరభాస్కరులై సుకీర్తిఁ జేఁ
బట్టి హరీతమానివరు•పావనగోత్రభవుల్ వసింతు ర
ప్పట్టణమందు వారల న•భంగురధీవిభవోజ్వలుం డనన్
గట్టిగ భూమిభృత్సభల • ఖ్యాతి వహించెను లింగరాజనన్॥ ౧౩

కం॥ ఆలింగామాత్యవరుఁడు, భూలోకబృహస్పతి యనఁ•బొగడికఁ గని భూ
పాలాగ్రసరుఁడు మధ్వమ,తాలంకారుండు మెచ్చ • నలరెం జాలన్॥ ౧౪

ఉ॥ లింగని కీర్తిసంపద స•లింగనిషిద్ధునివామదేవమౌ
ళిం గని మేచకాంబరువ•లిం గని నీలగళాంకితున్ దిశా
లిం గని ప్రాంతసంచరద•లిం గని తెల్లనిఁ జమ్మిఁ బన్నగా
గ చ్ఛందనద్రుపట•లిం గని పల్లరు నీసడించెడున్॥ ౧౫

తే॥ అతనియిల్లాలు సద్గుణో♦న్నతికి మేలు, సాటి యనఁ జాలు సావిత్రిలో♦చనునియాలు
పున్నెములఁ బ్రోలుఁగ నికగం♦బునకుఁ జాలు, నలరు ప్రోయాలు తలబంతి♦ యనఁగ జాలు

కం॥ పౌలోమియు నింద్రుఁడుఁ గమ్ర లాలయయును హరియు శితి♦లాపలిభృద్వాం
శాలంకారయు శివుఁడును, బోలఁగ దంపతులు దగి ర♦పూర్వప్రీతిన్ ॥ ౧౭

ఉ॥ పూవును దావి వోలెఁ గడుఁ ♦ బొందిక యై కనువారు మెచ్చ న
ప్పావనశీలు రెందు నెడఁ♦ బాయని కూరిమి మన్చ నుండి రొం
డే విధమందునన్ గొఱఁత ♦ యించుక లేక మెలంగుచుండఁగా
నెవ్వ జనించె నంత సుత♦హీనత చే నటమీఁద వారికిన్ ॥ ౧౮

ఉ॥ కోమలలీలఁ బల్కు నెల♦కోయిల గ్రిమ్మరఁ జాలనట్టి క్రొ
మ్మామిడితోఁట చారుసుష♦మాసముదంచిత పూర్ణచంద్రిమ
శ్రీ మెఱయింప లేని నిశ ♦ చెన్ను గులొన్న పకంపు ముద్దులన్
జేసి మడిసూపు పుత్రకుఁడు ♦ దిమ్మర లేని గృహంబు నొక్క చే॥ ౧౯

చ॥ జిలుగు మెఱుంగు వెన్నెలలు ♦ చిల్కుచుఁ గుల్కు నలంతి నవ్వ ప
న్నొలకలఁ బర్వఁ గ్రమ్మి క్రొను♦ ముంగురు లేక కలంకజోకఁగా
జిలిబిలి ముద్దుపల్కు సుధఁ ♦ జిల్కు సుతానన పార్వణేందు మం
డలమును జూడఁ కబ్బ గను♦ నాగృహి జన్మఫలాబ్ధి యెట్లొడన్ ॥ ౨౦

॥ తినరుమాధుర్య మెం♦తయుఁ గల్గి మెచ్చఁగాం, చియుఁ బండు పండని♦ చెఱకు పెఱుకు
సకలదిక్కులు నిండు♦ సౌరభం బిడుపూవు, దగఁ గాయ కాయని♦ మొగలి దిగులు
సంతతామోదని♦స్యంద్రి మయ్యును బీజ, మహిమఁ గాంచని విరి♦ మల్లెయొల్ల
మహితసజ్జనపహు♦మత మయ్యు సత్ఫలో, త్పవము నొందఁగ లేని♦ లవలి కవలి

గీ॥ సతత నానావిధైశ్వర్య♦సహితమగుచుఁ, దనరు కాపుర మొనరియుఁ♦ దనయు ముద్దు
మోముఁ గన లేని గృహమే ♦గీముగోము, తలఁచి చూడంగ నెందు వ్యర్థములు గావె॥

లింగరాజు సంతానప్రాప్తికై చింతించుట.

తే॥ అట్లు గావున సంసార ♦ మనెడు వృక్ష, మునకు ఫలరూప మైనట్టి♦ పుత్రజనన
సిద్ధి లేమికి మిక్కిలి ♦ చింత నొంది, యెలమి తోరుగఁగ నద్దంప♦తులు గడంగి॥

చ॥ ప్రతిమలు పెక్కు చేసిరి సం♦పర్యలు భూసురకోటికిన్ సమం
చితగతి నాచరించిరి వి♦శేషవిధంబుల -గ నేవ లా

దృతి నొనరించి రీడితచరిత్రులఁ బెద్దల నాశ్రయించి రీ
ప్సితగతి దానధర్మములు ♦ పెక్కు లొనర్చిరి పూని దంపతుల్ ॥ ౨౩

కం॥ వన మెల్ల బత్తిరియు నెం, దును గలరాయెల్ల దేవుఁ ♦ డుగ వాతలు శో
చిననోము లేమి చెప్పుదుఁ, దనయోదయవాంఛితాను ♦ ధావితమతులై ॥

తే॥ విసిగి వేసారి యిట్టు లవ్విప్రదంప, తులు చిరం బగుకాలముఁ ♦ ద్రోచి యొట్టు
లేని నాశ్రితవితతిరక్షింపఁ గర్త, నిజము పురుషోత్తముఁడె యని ♦ నిశ్చయించి॥

కం॥ కలియుగమందు మానవని ♦ కాయము నెల్ల నుదగ్రదుష్కృతా
కలన మడంచి తత్సకల ♦ కాంక్షిత సిద్ధులొసంగ బ్రోవఁగాఁ
దలఁచి ధృతావతారుఁ డయి ♦ ధారుణి నీలగిరీంద్ర శృంగమం
దెలమి వసించె సర్వజగ ♦ దీశ్వరుఁ డౌ పురుషోత్తముం డొగిన్ ॥ ౨౬

వసంతతిలక

ఆర్చావతార కలితుం ♦ డగు వాసుదేవున్
జర్చించి కొల్చిన నరుల్ ♦ సకలార్థసిద్ధుల్
వర్చోయశోవిభవముల్ ♦ ప్రబలన్ ముముక్షా
చర్చానువర్తు లగుచున్ ♦ జరియింతు రుర్విన్ ॥ ౨౭

చ॥ అనుచుఁ బురాణసూక్తుల ♦ యందు వినంబడ నాలకించి త
న్మనసిన దుష్కృతంబు లెడలించి యభీష్టసిద్ధి సేయఁగా
ననుపమనీలశైలశిఖ ♦ రాగ్రచరిష్ణుఁడు వాసుదేవుఁడే
ఘనుఁ డగు వేల్పటంచు మది ♦ గాఢతరం బగు నిశ్చయంబునన్ ॥ ౨౮

జగన్నాథుని రాజదంపతులు గొలుచుట.

వసంతతిలక.

ఆవిప్రదంపతులు శ్రీహరినీలశైలా, గ్రావాసుఁ జక్రధరు సత్యనురక్తి మీరన్
సేవింపఁగాఁ దివిరి చెచ్చెర నేగి రాల, క్ష్మీవల్లభాఢ్యపురికిన్ జిరభక్తితోడన్

మ॥ పురికా దంపతు లేగి నీలకుధరంబుం జూచి తత్క్షేత్ర ని
ర్భరకల్యాణ ఫలంబు నాఁ దనరు నింద్రద్యుమ్న కాసారవా
పరిషిక్తాంగకులై సమస్తదురిత ♦ ప్రధ్వంసకుం డైన శ్రీ
హరి దర్శించి కృతార్థచిత్తు లయి రత్యంతప్రమోదంబునన్ ॥ ౩౦

తరల॥ హలధరుం డొకచక్కిఁ బూర్ణశశాంకబింబము కైవడిన్
వెలయునీలనలాహకద్యుతి వెల్గు కృష్ణుఁ డికొక్కెడన్
మెలఁగఁ గారు మెరుంగుపోలిక మించుమధ్యసుభద్ర తా
నలరఁ గన్గొని దృక్ప్రియుక్తి కృతార్థతన్ గన మ్రొక్కుచున్॥ 31

బంగారము

ఓ జగన్నాథ భువనోదయనిదానమై, పాలుపుఁగనునీదైనపొక్కిటఁ గలిగి
జలజాననుం డఖిలజగములను గలిగింప, సంరక్షకుండ వయి సతతము నీవు
పాలించుకర్త వయి పరమకృపాళుఁ డనుచుఁ, బ్రస్తుతి నొందుచునంబరమేశ
యెపుడు
మాబోఁటిదీనతతిమనఁ బ్రోచుచున్నావు, మానమస్కృతులుగొనుముమన్నించిదేవ॥

ఉత్సాహ

అనుచు నిన్ను వేడు చుంటి మఖిలలోకరక్షకా
వినుము నీలశైలవాస విన్నపంబు మాకు నీ
ఘనికరంబుకంటె దిక్కు గలదె యెందు నీదు ప
ద్వనజయుగమె శరణ మనుచు వచ్చినార మీశ్వరా॥ 33

వెండి

మాపాలికి నీసత్కృప మరివజాంగి గదవె పరాత్పరుఁడవునీవెగదాజగములు
నీవలనన్ విలసిల్లును నీలోపల వెలుపలను, నిండి యుండుదువుగదానిక్కముగను
వాసువాఖ్య నీ కొప్పెను వాసవాద్యమరవినుత, యీజగన్నాథాఖ్యయిట్లనీవు
సెల్లజగంబులు నేలుట హేతువుగాఁగలిగెఁజుమీయెన్నంగఁదరమెమాకు శనిన్ను
॥ శ్రుతిశిరోవీధులందు నీచొప్పెరుంగ, రాదు బ్రహ్మాదులకు నీ తెరంగు లేదు
నీకు సములును నధికు లెన్నినను లేరు, నీవ పరమేశ్వరుండవు దేవదేవ॥ 34

పంచచామరము

చరాచరాఖిల ప్రపంచసర్గరక్షణక్రియా
పరాయణాత్మ శక్తియుక్త భవ్యకీర్తిసంశ్రియా
నిరీశ నిర్వికార నిత్య నిర్వికల్పవైభవా
పరాత్పరా వరప్రదాత్మ భక్తపాలనోత్సవా॥ 35

కం॥ అని పెక్కుగతుల వారలు, వినుతించి నిష్టసిద్ధి నెస నగుటకు న

య నఘు జగన్నాథునిఁ జేం, తన చేయుచుఁ దపము సేయఁ • దలఁచినియతులై ॥

॥ అచట నింద్రద్యుమ్న • మని యెడు సరమ్ము, రమున బోధిద్రుమా • గ్రమున నిల్చి
తత్తీర్థమున గృత•స్నాను లై యిరువ్రొద్దు, నా జగన్నాథు న•త్యంత భక్తి
నారాధనము చేసి - యా దేవుని ప్రసాద, మర్థి భుజించి య•న్యంబు మరచి
తన్నామమంత్రంబు • తద్దయు నిష్ఠతో జపియించుచును ముని • శ్చయమనస్కు

ఆ॥ లగుచు రేల్పవళ్లు • నాతపశీతాది, బాధ లెల్ల మరచి • పరమనియతి
మెరయఁ జూచువార • లరుదిది యన గాఢ, తపము సలిపి రద్భు•తముగ వారు॥

వ॥ ఇవ్విధంబున న వ్విప్రదంపతులు తపోనియతిం బ్రవర్తించుచున్న సమయంబున. ౩౦

శరదృతువర్ణనము.

కం॥ ఒనరిన ఘనోపరోధము, చనఁ బంక మడంగి దిశలు • సరళేములుగ రా
జనుపమకాంతి వెలుగంగఁగఁ, జనుదెంచె శరదృతు వటఁ బ్ర• సన్నంబగుచున్

చ॥ అరయఁగ నెంత జీవనదు • లంచు ఘనుల్ పొగ డొందుచున్నబం
ధురవను సంప్రచారముల • తో నట రాజు వెలుంగఁ జొచ్చినన్
బొరిపొరి నిల్చి వెల్లనయి • బోవరె తా రవలంబహీనతన్
బొరసినవారిచందములు • పోలదలంచిన నిట్టివే కదా॥

కం॥ ఘనులయిన నేమి మరిజీ, వనదాత లైన నేమి • బహుళ్యైల్యముఁ గ్రి
మ్మిన వారిచెలిమిఁ బంకం, బెనసెను భువిరాజు దాని • నెడలించె వడిన్ ॥ ౪౧

॥ తమవిభుఁడు దక్షిణాసక్తిఁ •దవిలిమంద, రశ్మి యగుచుండఁ దమశత్రు•రాజు సద్వ
నూ లతనుత్తరస్థితి • ననికిఁ గొందు, కరణి హైన్యంబు ఘటియించె• గమలములకు

చ॥ వితతసితాభ్రఖండపరి • వేష్టిత మై గగనాంగణంబు శో
త మగుచున్ ధరిత్రియును • విస్ఫుటకాశసుమప్రకాశ భా
సిత మగుచున్ నభోనుకృతి • జెల్వమరెన్ గువలప్రకాండ సం
గతతటినీప్రతానము వి • కస్వర లఁ దనర్చెఁ దద్గతిన్ ॥ ౪

చ॥ ఉదయము నొంది పుష్కర ప • దోద్గతిఁ గైకొని చారుతారకా
పదమునఁ గుంభసంభవుఁడు • భాసిల దద్విమలాంబుసంగతిన్

బొదలి సపంక దిగ్గజల ◆ పూర మొగిన్ గతశానుషక్తి పై
నొదవిన కైనడిన్ విరిగి ◆ యొప్పె వినిర్మలతాస మున్నతిన్ ॥ ౪౪

తే॥ ఘటభవాయోగ మొదవఁ బంకంబడంగి, మహితమైతోఁచెజలము నైర్మల భంగి
సాధుసంగతిఁ బంకప్రసక్తి తొలఁగి, విమల మగునంతరంగము ◆ విధముగలిఁగి॥

రాజునకు జగన్నాథుండు వరంబొసంగుట.

చ॥ పొలు పగునచ్ఛదీధితులు ◆ పొంగ నభోంగణమందు నిండుఁ డిం
పలరఁగఁ బొంగి నింగి నొర ◆ యంగఁ దరంగము లుల్లసిల్లు న
క్కొలశపయోధిఁ గూర్కెడలి ◆ కంజగళాక్షుఁడు పాపసెజ్జపై
వెలయఁగ నావులించి కను ◆ విచ్చి సముద్ధితుఁ డయ్యె నొయ్యనన్. ౪౬

చ॥ మెలకువ నొంది నిష్కలి ◆ మిన్ దనమీఁద మనంబునిల్పి లో
నలయక నేకచిత్తత న ◆ హర్నిశముల్ దపమాచరించు న
య్యలఘుల విప్రదంపతుల ◆ నాత్మఁ దలంచి తదీయ వాంఛితా
కలనము సిద్ధిసేయఁ గృపఁ ◆ గైకొని యా కమలావిభుం డొగిన్ ॥ ౪౭

చ॥ తలఁ పఖిలంబు భక్తి భరి ◆ తంబుగ శ్రీహరిపాదపద్మ సం
కలితము చేసి భూసుర శి ◆ ఖామణి యాత్మమనోరథంబు స
త్ఫలదము సేయవే యనుచుఁ ◆ బ్రార్థనసేయుచుఁ గూరుకొం దఁగాఁ
గల నొకనాఁడు గన్పడి జ ◆ గత్పతి యిట్లనె నుప్రిసన్నుఁడై॥ ౪౮

ఉ॥ మెచ్చితి నీదుభక్తికి స ◆ మీహితవాంఛితసిద్ధి నీకు నే
నిచ్చితి నింకనీవు జని ◆ యుంచుఁ దనూజుఁ డొకండు మత్ప్రసా
దోచ్చయపాత్రుఁ డావరగు ◆ నోజ్జ్వలుచే భవదీయవంశము
దొచ్చెము లేనికీర్తి విభ ◆ వోన్నతిఁ గల్గు మదీయ సత్కృపన్ ॥ ౪౯

తే॥ అనుచు వరమిచ్చియాదేవుఁడంతమరిఁగి, పోవ మేల్కాని కలఁతే సాభూసురుండు
కన్నకలచంద మెల్లఁ దారార్కణ గాఁగఁ, దనసతికిఁదెల్పిసంప్రమోదంబుతోడ॥

వ॥ ఇవ్విధంబున లబ్ధవరం బై యవ్విప్రమిథునంబు వేగ మేల్కాని కాల్యకృ
త్యంబులు నిర్వర్తించి శ్రీజగన్నాథునిఁ బూజించి తత్ప్రసాదంబు స్వీకరించి ప్రమోద
మానమానసంబున నిజగృహంబున కరుదెంచె ననంతరంబ. ౫౦

వరపుత్త్రోదయము.

కం॥ కతిపయదినముల కాతని, సతికిని నెలదప్పె నడలు • జడనుబడియె ను
న్నతిఁ గాంచె నొకిలింతలు, సితరుచులన్ జెక్కు లలరెఁ • జిట్టుములొదవెన్॥

మ॥ గిరులన్ గ్రొమ్మొయిలత్తమిల్లె బయలన్ • గ్రొవ్వుబ్బుచున్ నల్లఁద్రా
చరుదైతోఁచె నవేందుమండలము•పై నాపక్వచంచన్మధూ
కరుచుల్గ్రమ్మెఁ దరంగభంగికలజో•కన్ డాఁగె వేర్పాటు ల
త్తరుణీరత్న మపూర్వదౌహృదరమో•త్కర్షంబు దా నొందుటన్॥ ౫౩

మ॥ పలుకంబారెను జెక్కుదోయి నడలన్ • బాటిల్లె మాంద్యంబుఁ గ్రొ
న్నలు పొప్పారెను జూచుకంబు లనువొం•దన్ గొను నానాటవ
ర్ధిలె నాస్యంబున నుప్పతిల్లఁ దొడఁగెన్ • మృద్గంధమున్ జెయ్యులం
దలతల్ దోఁచెను గర్భభారభర యై • యబ్జాక్షి రాజిల్లఁగన్॥ ౫౪

మ॥ సురలన్ బిల్వఁగఁ జూచు హవ్యములకున్ • సోమంబుఁ ద్రావింపఁగాఁ
బరితోషంబు వహించుఁ జక్రిధరునిన్ • భావించి చంచత్తపో
భరమున్ బూనఁ దలంచుఁ గోవెల రచిం•పన్ శ్రీజగన్నాథు ని
ల్ప రహిం గాంచు నెలంత గర్భగతడిం•భప్రాభవాయత్తయై॥ ౫౫

కం॥ తనవున గురుసంబంధం, బెనయఁగఁ ద్రిషడష్టరిఃఫ•గృహములఁ బాపుల్
బెనఁగొన దోషరహిత మగు, చును సుఫలద మైనయొక్క•శుభలగ్నమునన్॥

శా॥ కర్మస్థానమునందుఁ జంద్రబుధశు•క్రద్వాదశాత్ముల్ లస
చ్ఛర్మాపాదకులై వసింప శిఖి చం•చద్ధర్మసంరూఢుఁడై
నిర్మోహోద్ధవిబోధకారణము సం•ధింపంగ నానామహా
కర్మందిప్రవరుల్ నుతింపఁ బరమో•త్కర్షాఢ్యకాలంబునన్॥ ౫౬

కం॥ ఆలింగరాజునకు సుగు, ణాలంకారుండు గలిగె • నాత్మజుఁడు ముదు
ద్వేలా మునిఁగి పిత వి, ప్రాళికి నభిమతధనంబు • లర్థి నొసంగెన్॥ ౫౭

కం॥ పురు డీశిశువున కయ్యెం, బురుడా సనుఁడనుచు జనులు • పొగడఁగ వికచాం
బురుడాలోకను కరుణం, బురుడేగఁగ జాతకర్మ•ములు గావించెన్॥ ౫౮

కం॥ రాగ్రసరుఁడు శ్రీమ, న్నారాయణుకరుణఁ దనకు • నందనుఁడు గుణో
దారుండు కలిగె ననుచును, నారాయణుఁడనుచు నపుడు • నామ మొనర్చెన్॥

రాజపుత్రుం డగు నారాయణుండు తపంబొనర్చుట.

కం॥ అడరెడుపూర్వదళంబునఁ, బడమటిదెసఁ దోఁచి క్రమతఁ ♦ బ్రబలతఁ గను న
య్యుడుపతిరేక తెరంగున, బుడుతఁడు నానాటవృద్ధి ♦ బొంది వెలింగెన్ ॥౯౧

॥ అక్షరాభ్యాస మొనరించి♦యయ్యవారి, కడఁ జదువఁ బంప నత్యల్ప♦కాలమునఁ నె
యధికరించె సమస్త వి♦ద్యలుఁ గుశాగ్ర, బుద్ధి కరు దంచి పండితు♦ల్పొగడునట్లు॥

తే॥ లలితపదయుక్తి నవరసా♦లంక్రియాని, గుంభమాధుర్య భంగి వి♦జృంభితముగ
నవసుధాధారలనఁగవి♦న్నాణమెసఁగఁ, గవితరచియింప నేర్చెఁజా♦క్క ముగనతఁడు

శా॥ ఆనారాయణపండితుం డటు సము♦ద్యద్యౌవనారూఢుఁ డై
చానన్ బాణిగ్రహించి ధర్మకలనా♦సంసక్తి స్మార్తక్రియల్
దా నొప్పార రచించి పుత్రకుల ను♦త్పాదించి వేదోక్త క
ర్మానుష్ఠానధురీణతన్ నడపె గా♦ర్హస్థ్యంబు పూజ్యంబుగన్ ॥ ౯౪

ఆ॥వె॥ సప్తపాకయజ్ఞ♦సంచయంబును వావి, ర్యజ్ఞసప్తకంబు ♦ నధిగమించి
సప్తసోమయజ్ఞ♦సంప్రవర్తకుఁ డయి, సోమయాజి యనెడు♦నామ మూనె॥

కం॥ ధృతి నాహితాగ్ని యగుచును, హుతవహు నాజ్యమునఁ బ్రీతి ♦ నొందించి ధృత
వ్రతుఁ డై శ్రౌతక్రియలన్, మతిమంతులు మెచ్చఁ జేసె ♦ మాన్యుం డగుచున్ ॥

కం॥ వానప్రస్థాశ్రమమును, బూని నియతచిత్తుఁ డగుచుఁ ♦ బురుషోత్తమునిన్
మానసమున నిలిపి పటుత, పోనుష్ఠానంబు సలిపె ♦ నతినిష్ఠమెయిన్ ॥

ఉ॥ బోధవిభూతిఁ గ తన♦పూర్వభవంబునఁ ్రతుఁ డై జగ
న్నాథుఁడు స్వప్రతిష్ఠను నొ♦నర్పఁగ నిచ్చినయవ్వరంబు ని
ర్బాధముగా హృదబ్జమునఁ ♦ బైకొన నీప్సితసిద్ధి సేయఁగా
నేధితనిష్ఠ నాతఁ డొన♦రించెఁ దపంబు సమంచితస్థితిన్ ॥ ౯౭

శా॥ స్వచ్ఛం బైనమనోరవిందమున వి♦శ్వవ్యాపకుం సర్వదో
షచ్ఛేదవ్రతుఁ బుండరీకనయనున్ ♦ సద్భక్తితో నిల్పి తా
నుచ్చానప్రభ నిష్ఠతోడఁ దప ము♦ద్యోగించి కావించె న
ప్రచ్ఛాద్యప్రతిభాప్రభావము ముని♦వ్రాతంబు మేత్మే లనన్ ॥ ౯౮

మ॥ పటు తైక్ష్ణ్యోగ్రనిదాఘకాలమునఁ ! దాఁ♦బంచాగ్నిమధ్యస్థుఁడై

చటులాంభోధరధారసంసిహిత వ • ర్షాకాల మందుర్ హిమో
త్కటమాన చ్ఛలికాలమందు జలమ • ధ్యస్థాయి యై నిష్ఠతో
జటిలోకం బరుదంద నాతఁడు తప • స్స్యాయుక్తి వర్తింపఁగన్ ॥ ౭౦

గ్రీష్మకాలవర్ణనము.

మ॥ తతతృష్ణామృగతృష్ణికా సలిలసం • ధావన్మృగవ్రాత ము
ద్గత దావానల దహ్యమాన బహుకాం • తారంబు వ్రాత ప
క్షతి సంప్లోషితమృగ్యమాణతృణకం • సప్రాయభూమండలం
బతితాపావృతపాంథసంకులము గ్రీ • ష్మానేహ మేతెంచుడున్ ॥ ౭౧

మ॥ అవనీమండల జాయమాన సలిల • వ్యాపారమెల్లన్ మహో
గ్రవివస్వద్విసరన్మయూఖపటలీ • గ్రస్తంబు గాఁగన్ ద
యవిలోపం బడఁగింప నెందు నధిక • వ్యాప్తిన్ బ్రసారించె న
చ్ఛవిలోలన్మృగతృష్ణికా సలిల వి • స్తారం బపారంబుగన్ ॥ ౭౨

చ॥ అతిసుకుమారకేసర చ • యంబు ప్రియం బొనరింపఁ బుప్పొడుల్
జతనపుఁ గమ్మతావుల నెసంగఁగ దిర్వెనపూలు వ్రిసం
గతవితతాతపక్షతికిఁ • గందకఁ గ్రొన్ననకంబు గాంచుటల్
మతిదలఁపించెఁ గోమలులు • మన్మథతాపభరంబు నోర్చుటల్ ॥ ౭౩

తే॥ కరకు రెండఁ గ్రొన్నన • క మగుచివురు, దలల సైరించి యాత్మాశ్రిత ప్రతతికి
చలువ డలో సంగువృక్షములు జనుల, కిట్టిదిపరోపకారమం • చెఱుఁగఁ దెలిపె ॥

ఉ॥ తామరసాప్త విరికర • తాపమునన్ బరిపాక మొంది క్రొ
మ్మామిడిపండ్లు సన్మధురి • మామ్ఫుటసౌరభసంప్రచార ము
ద్దామముగా దిగంతములఁ • దార్కొలిపెన్ గనిసత్తరు ల్గదా
యామెత లిచ్చు నంచును మ • హాశుకవిప్రకరంబు సేరఁగన్ ॥ ౭౪

॥ చల్లనితెలి ట • జలకంబులాడి క్రొం, జిలుగుపూవన్నెచ • ల్వలు ధరించి
చలువపన్నీటితోఁ • గలపి గంద మలంది, పరువంపువిరిమల్లె • సరులుచుట్టి
క తలామ క • కాయమానావృతుల్, వెలువడి లేగాలి • పొలయ చుండఁ
దీయమామిడపండ్ల • తేనె చక్కెరతోడ, న మృతాహారంబు • లారగించి

## జగన్నాథీయము

సీ॥ పండువెన్నెల బయళులఁ • బవ్వళించి, మలయపవనాంకురంబులు • మలయుచుండి
హాయిహాయిగ సౌఖ్యంబు • ననుభవించి, రరిది భోగులు గ్రీష్మావ • సరములందు॥

చ॥ దల మగునాకుజొంపములఁ • దారొ్కని చల్లనివేపచెట్ల నీ
డల వనపుష్పసౌరభవి • డంబితనూతనగంధవాహకం
దళములు పైపయిన్ పొరయ • దట్టపుకూర్కులు హాయిహాయిగా
సలుపుదు రెండవేళలను • జాంగల మలఁ గర్షకావళుల్॥ ౭౭

ఉ॥ ఏపునఁ గాయునర్కకరకు • టెండఁ బ్రయాణ మొనర్చి చాలసం
తాపము నొంది మే నలయ • దారికెలంకుల నంబుపూర్ణతన్
పిత మాకొలంకుఁ గని • నిర్మలతత్సలిలాప్లుతాంగు లై
దూపయడంగఁ బాంథవిత • తుల్ సుఖియింతురు గ్రీష్మవేళలన్॥ ౭౮

॥ తనవిభావసునామ మం • త్రరిని సార్థ, కమ్ము గావించె నయుష్ణ • కరుఁడు వేఁడి
యాతపజ్వాల లడరించి • యబ్జజాండ, భాండ మంతయుఁ గడుఁ బొక్క •
పడఁగఁ సి॥ ౭౯

చ॥ సలిలవిగాహనంబు లతి • సౌఖ్యము లయ్యె వినూత్నపల్లవా
కలితమహామహీరుహని • కాయసమంచదనాతపస్థలీ
సులభసుషుప్తికంబు లగు • చున్ బరిణామమనోహరంబు లై
యలరె దివంబు లెల్ల మల • యానిలసంగతి నబ్బె సౌఖ్యముల్॥ ౮౦

శా॥ వంశక్షోభము హాని యా సుతరులన్ • వారిన్ సమీపించినన్
సంశీర్ణస్వసముచ్ఛ్రయస్థితి వినా • శం బొందు వా రన్యథన్
వంసముల్ దలఁపించె స్వోపహతిజ • జ్వాలల్ దమున్ బ్రాంతభూ
పాలింపదురిపరికరంబుతోడుత దహిం • పన్ బూన నవ్వేసఁగిన్॥ ౮౧

కం॥ ఆతపమున నాతపహతి, చేతఁ గృశీభావ మొంది • చెన్నారినన
వ్రాతము తపముగ శిశిరమా, హేతువు నిక్కం బటంచు • నెరిగించెదగన్॥

మ॥ అతులం బైననిదాఘ మిక్కరణిసం • మ క్రం బ్రవష్ణాతా
న్వితతాపాతిశయంబుతో నడరఁ గా • బ్యంహిస్థచండాంశుసం
తతిఁ బర్వించుచు మింట భానుఁ డిరవొం • దన్ నడన్ వహ్ని౦
వ్రతధార్చిల్ని గుణింపఁ జేసెఁ బవనున్ • బంచాగ్నిమధ్యస్థుఁ డై॥ ౮౩

నారాయణమూనికి హరి ప్రత్యక్షంబవుట.

మ॥ అతినిష్ఠాపరిచర్య దద్భుతతపస్స్వాత్మైక్యసంతాపసం
గతి నాబద్ధనిరూఢలక్ష్యపదవీత్సానన్నిరోధాభిక
ర్శితభానంబున నుద్గతుం డగుచు లక్ష్మీవల్లభుం డప్పు డా
ప్రతిచూడామణి భక్తిఁ జిక్కి యెదుటన్ బ్రత్యక్షు మయ్యెన్ వెసన్॥

కం॥ తనలక్ష్యదృష్టిఁ గ్రమ్మనఁ, గనుమొరఁగి మెరుంగుపగిది కన్పట్టెదుటన్ దోఁ
చినధ్యాయమానమూర్తిన్, వనజాక్షుం జూచి హర్షవర్ధితతనుఁడై॥ ౮౭

కం॥ లలితతను క్షేత్రజనిత, పులకనికర సస్యవిహిత పోషణకృత్యో
ద్గళదంబుస్రోతోగతి, విలోకనములు ప్రమదసలిలవృతములు గాఁగన్॥

తే॥ అధికసంభ్రమ మొలయ సాష్టాంగ మొరగి, పరిమటబాష్పాంబులహరిఁ దత్పా
దయుగము
గడిగి వలగొని గళము గద్గదిక దగుల, నలికమునఁ గేలుమోడ్చియిట్లు నుతించె॥

పంచచామరం.

నమోనమోస్తుసర్వలోకనాయకాయ నమో
నమన్నమస్తు భక్తరక్షణవ్రతాభిశోభనే
నమోనమస్సుపర్వరాజనందితాంఘ్రయే నమో
నమశ్శివాయవిష్ణవే జనార్దనాయతే నమః॥ ౮౮

మత్తేభకందగర్భిత. సం.

వి, లసమానాబ్ధిభవిష్ణశేషఫణితల్పవారింతని తోజ్జ్వలా, ముకుంద
ని, వసదాత్మజ్ఞవినిర్మలాత్మకుమారాబ్రహ్మాండభాండాధిపా, మహాత్మ
పరి, హాసదంభోరుహపత్రలోచనసమస్తారాధ్యలోకేశ్వరా, నిరీశ
ప్ర, విసరద్దైత్యవరగ్రసిష్ణుబరరుగ్విద్యోతచక్రచ్ఛవీ, రమేశ

గీ॥ పరమపురుషగిరిధరసచ్చరణకమల, నమితవిబుధజాలసదవనా, రమేశ
దురితభయహారణపరమేశ్వరపరమకృప, హాసముద్రపండితవినుతా, సర్వజ్ఞ॥

తరళద్రుతవిలంబితగర్భిత సం.

॥ స, లలితనీరదసన్నిభాంగబలద్విడర్చితపదు గాహరిముకుంద
లి, చలితదానవవీరనందక,చక్రశార్ఙ్గగదాధరా సరసిజాక్ష

సు, దళితపంకజశోభితాక్షనదభ్రిసత్కరుణాకరా సర్వవినుత
స, విలసితోదరసన్నివేశితవిశ్వశాశ్వతశై భవా సక్రహస్త

గీ॥ ద్రుతవిలంబిత దోషవిదూరధీ, క, మితకృపావిసమేతసమీహితా, త్త
శ్రుతిశిరోగ్రనిరూపితసుప్రభా వ, కృతసతావసకృత్యసుర్తితా, ర్థ॥

స్రగ్విణీభుజంగప్రయాతకందగర్భిత సం.

॥ జయా, హారిలోకరాట్సన్నుతా లోపితాంహ శ్చయా సర్వలోకాధినాధ
శుభ్రిత, కరిప్రాకట, స్తోత్రికప్రభా వా న్వితా దీనజనా గమ్య
ఘన, కర ప్రకచ, క్రాజగత్పేష్యమా నా త్మకా సర్వవిద్యాస్వరూప
తతే, ఝర శ్రీకృపా, ఘారసర్వేశ్వరే, శా విభూభూరితేజః ప్రసాద॥

॥ కనకవసనవనజపదయుగ్వినమదవన, ఘనవినీలవిపులసదంగా, మహాత్త
సనకవినుతవనరుహ భూవినుతచరణ, సకలలోకవిభుతాసరసా, ముకుంద॥

కందగీతద్రుతవిలంబితగర్భిత చంపకమాల.

చ॥ సురుచిరవైభవా, వనదసుందరభవ్యశుభప్రదాయి, తా
పరమదయాకరా, మునివిభావితమోదసముజ్జ్వలాత్మ, కా
హరిపరమేశ్వరా, దనుజహావరదావినుతప్రభావ, వా
ర్ధరరుచిరా, కృతీ మునిశరణ్యావిభుత్వసమున్నతాత్మ, కా॥ ౬౨

చక్రబంధము.

శా॥ రక్షశ్శిక్షభుజప్రకాండపరమార్థాధీరసంకల్పదా
జక్షోవస్థితగంధరత్నపటలస్వాయత్కిరీటాంచితా
రక్షోవేశఘనానుకంపపరమపాత్రిముఖ్యవిఖ్యాతిదా
దాక్షాప్తారసశాపనిర్భరప్రసాదావాంఛితానల్పదా॥ ౬౩

పాదభ్రమకందం.

ధీరామామారా, ధారాభాధావిధావిధాభారాధా
సారానిశానిరాసా, నారాభానాబ్జభాబ్జనాభారానా॥ ౬౪

కం॥ అనియి ట్లాతఁడు ఖనదీ, ఘనధీరతరంగరవవికస్వరఫణితిక్
వినుతింపజగన్నాథుం, డనితరకరుణాప్రసన్నుఁ డై యి ట్లనియెన్॥ ౬౫

కం॥ మెచ్చితి నీనిష్ఠకు నే, నిచ్చెద నీయభిమతార్థ ♦ మెల్లను మదినే
యొచ్చంబు లేక యడుగుము, చెచ్చెర నందియ మొకింత ♦ చేర్చకు మనుడున్

ఉ॥ దేవ మహాపరిభావ భవ♦దీయపదాంబుజదర్శనంబునన్
బావన మయ్యె నాజని భ♦వపరిభవాపవ లెల్లఁ బాసె నిం
కేవియు నేల పూర్వమున ♦ నిచ్చితి వీవు వరంబుగా ధరన్
దావకసంప్రతిష్ఠ యుచి♦తంబుగ నావలనం ఘటింపఁగన్ ॥ ౮

ఉ॥ భావిభవంబునం దవని♦పై జనియించి మదీయసంప్రతి
ష్ఠావిధి నీవు సల్పెదవు ♦ సమ్మతి నీలగిరిందరిమందు నే
నేవిధిసంచరింతు నటు♦లే వసియింతు భవత్ప్రతిష్ఠితా
ర్చావిధమందు నంచు వర ♦ మప్పుడొసంగితి వీవు శ్రీహరీ॥ ౯

కం॥ అటు గాన నవ్వరంబును, బటుతరకృప మెరయ నిపుడు ♦ ఫలియింపఁగఁ జే
యుట గోరెద భువియం దెచ్చోటను నొప్ప భవత్ప్రతిష్ఠ♦ చూపుము దేవా॥

మ॥ అని యర్థించినఁ బ్రీతరుల్లసితప♦ద్మాభాక్షికోణంబులన్
ఘనకారుణ్యరసంబు పొంగ నఖిలై♦కస్వామి నారాయణుం
డనె మేల్పదగుకోర్కె నేఁడు సఫలం ♦ బౌనట్లు గావింతు స
జ్జనసంస్తుత భవద శం బవని నా♦చంద్రార్కమై నిల్పుతన్ ॥ ౧౦

మ॥ విను మున్నే నలనీలశైలమున ను♦ర్విన్నిల్చుచో నన్ను స
ర్చనఁ గావించిరి వ్యాధతుల్యు లపరి♦జ్ఞాతాన్యసద్భావు లా
జను లే నిప్పుడు నట్ల తావకభవి♦ష్యత్సంప్రతిష్ఠాపరా
యణతన్ గైకొను చుంటి గ్రిమ్మర నిలన్ ♦ వా ధాళిచే నర్చనల్ ॥ ౧౧

శా॥ పాగర్ణోధియుపాంతభూమి గహన♦ప్రాంతంబునన్ మత్కళా
భోగస్ఫూర్తిసమేధమాన మగుచున్ ♦ బోధిద్రుమం బంబరా
భోగాచ్ఛాదిశిరఃప్రకాండ మగుచున్ ♦ బొల్పొందు నే నచ్చటన్
ప్రాగావిర్భవ మొందివ్యాధజనతా♦ర్చాదృష్టి నొందించెదన్ ॥ ౧౨

మ॥ అచటన్ బిల్లియ సన్నపాడన దగున్ ♦ వ్యాధాళి యచ్చోట నే
రచితావాస మగున్ నిరంతరము న♦ర్చల్ మత్కళావిభ్రమ

పరిచురంబై తగుబోధివృక్షమున గా♦రల్ సేయు చున్నారు నీ
వచటన్ నన్నుఁ బ్రతిష్ఠ సేయుము త్వదీ♦యాష్ట మీఁదేరఁ గన్ ॥ ౧౦౩

॥ నీలమహీధ్రశృంగమున ♦ నిల్చితి నే నభిలాష నీ జగ
త్పాలనవృత్తి కిప్పు డల♦భావమునన్ నిజసేవకావనో
న్మీలదపారసత్కరుణ ♦ నిల్చెద నుర్వరసన్నపాటిపైఁ
గ్రాలెడుబోధివృక్షముకు♦రంగట నీపయి సాదరంబునన్ ॥ ౧౦౪

॥ కల దట నంగలూరను నొ♦కానొకపల్లియ యప్పురంబునన్
గలఁ డమరేశ్వరుండను శశి♦ఖండశిఖండుఁడు తన్మహోషు కో
వెలదరిఁ గల్గు నొక్కబలు♦వృక్షము దానిని దెచ్చి దారుమూ
ర్తులు రచియించి భక్తిరతి♦తోడఁ బ్రతిష్ఠ యొనర్పు మచ్చటన్ ॥ ౧౦౫

॥ అననీలాద్రిశిరోపకంఠపురసీ♦మాంచ గన్నాథనా
మలసన్మూర్తిపసన్మదంచితకళా♦మాహాత్మ్య మెల్లన్ భవ
ద్విలసద్భక్తికరిష్యమాణతరుమూ♦ర్తివ్రాతమం దావహిం
చి లలిన్ భక్తజనావనప్రతకృపా♦ఖ్యాతిన్ బ్రవర్తించెదన్ ॥ ౧౦౬

॥ పరిపాటిన్ గ్రహియించినాఁడఁ గలిలో ♦ బౌద్ధావతారంబు త
ద్వరధర్మంబు లిలన్ బ్రతిష్ఠితము లౌ ♦ భావింపఁ గర్మక్రియా
పరిణామంబుల కప్రసిద్ధికరముల్ ♦ బాటిల్లు నట్లౌటచే
నరుఁ డత్యంతసుభక్తి నగ్గనినయుం♦తన్ మోక్షసంప్రాప్తుఁ డౌ ॥ ౧౦౭

పరిపాలింపుచు బౌద్ధధర్మములు నే ♦ భాసిల్లు చున్నాఁడ న
ప్పురియందున్ బురుషోత్తమాహ్వయమునన్ ♦ మున్నీకు నే నిచ్చితిన్
వర మాచందము నిర్వహింప నిచటన్ ♦ బౌద్ధాకృతి న్నిల్చి య
క్కరణిన్ భక్తజనానుపాలనజిష్ణు♦త్వాసక్తి వర్తించెదన్ ॥ ౧౦౮

దానము స్నానమున్ సలిల♦తర్పణమున్ బని లేదు భూరిని
ష్ఠానియమాదికవ్రతవి♦చారము భారము గాన నె యున్
బూనఁగ లేక మచ్చరణ♦ము ల్గడు భక్తిఁ గనుంగొనంగ న
మ్మానవుఁ డెల్లసత్క్రియలు ♦ మానక చేయుఫలంబు దాఁ గనున్ ॥ ౧౦౯

సువిరక్తిని యత్యాశ్రమ, మవధూతత్వంబు నస్మదాఖ్యయుఁ గొని

వు వెస జగన్నాథాకృతి నవరించి యిలన్ బ్రతిష్ఠ • సలుపును భక్తిన్॥ ౧౧౦

కం॥ వ్యాఘ్రాళిపురీతుల్యము, బోధిద్రుమము మద్ది నీల • భూధరసదృశం
బేధితమన్మూర్తి జగ, న్నాథసమానంబు బుధజ • నస్తుత వినుమా॥ ౧౧౧

ఆ॥వె॥ అనుచు వర మొసంగి • యంతర్హితుం డైన, వాసుదేవుమధుర • వాక్యసుధను
వీనుదోయి యలర • నాని యానందాబ్ధి, నోల లాడి యమ్మ • హోదయుండు॥

తే॥ తపము సాలించి లేచి యు • త్సవము మీఱ, నివ్విధం బెల్ల బుధులకు • నెరుకపరచి
క్రమతవిధ్యుక్తమగువి • ధానమున వ్యాక, రించెయత్యాశ్రమముపండి • తేంద్రుఁ డపుడు॥

తే॥ అతఁడు పురుషోత్తమానందుఁ • డనెడు పేరుఁ, దాల్చి యవధూతయై తరు • తలనివాస
మొసఁగఁ గరతలభిక్షగ్ర • హించికొనుచు, నెపుడు నిరపేక్షుఁడై సంచ • రించుచుండె॥

కం॥ ఇల సన్నపాడ దెచ్చటఁ, గలదో వ్యాఘ్రాళి యెచటఁ • గాపుర మోయి
మ్ముల బోధిద్రుమంబు నెచ్చటొ, యొలసిన హరి నెవరుఁ గొలుచు • చుండిరొ యనుచున్॥

చ॥ కలయఁగఁ బూర్వవార్థియుప • కంఠము నెల్లఁ జరించి పెక్కుకా
న లరసికొంచు వచ్చి యతి • నాథుఁడు కన్గొనె నెట్టకేలకున్
దళ మగుబోధివృక్షమును • దైవ మటంచు భజించు చున్నవ్యా
ధుల నతిముగ్ధమానసులఁ • దుష్టిసమేతుల నొక్కపల్లియన్॥ ౧౧౬

తే॥ భగవదుపదిష్ట మగుసన్న • పాడు బోధి, తరువు వ్యాఘ్రాళి యనునవి • తథ్యమవియె
యనుచు మది నిశ్చయించి యా • వ్యాధజనుల, నడిగె నిది యేమి పూజ మీ • కనుచు నతఁడు॥

తే॥ గురుఁడ యీరావిచెట్టు మా • కొలముసామి, యిందుఁ గలనల్లనయ్య మా • యిచ్చ పూజ
లెల్లఁ గైకొని మాకోర్కు • లిచ్చుచుండు, ననుచుఁ జెప్పిన విని జోగి • యబ్బురమందె॥

కం॥ భగవన్మహిమ మ్మద్భుత, మగు ననుచు నమస్కరించి • హరిఁ దలఁచి జయం
బగుఁ గాక యనుచు వ్యాధుల, నుఁ గనుంగొని వీరి తెరఁగు • నూతన మనుచున్॥

తే॥ ఎరుకులార! మీపున్నియ • మేమనఁ దగు, నిందుఁ గలిగిన మీసామి • యిచటఁ దనకు
గుళ్లు గోపురములు గట్టి • కొలువు సేయు, మనుచు నను బంచె నాకుసా • యంబుఁ గండు

చ॥ ఎఱుకులసాయముల్ గొని య • తీశుఁడు దేవళముల్ రచింపఁగాఁ
బరికరముల్ ఘటించికొని • భాసురశిల్పసమగ్రనైపుణీ

పరిణతి మేలు మేలనఁగ • భవ్యవిమానముతోడఁ గోవెలన్
గర మలరారఁగా నచటఁ • గట్టె నతిత్వరితోద్యమంబునన్ ॥ ౧౨౧

కం॥ కోవెలయును బ్రాకారముఁ, గావించి మనోహరముగఁ • గమలావిభు న
ర్చావిధిఁ బ్రతిష్ఠ సలుపం, గావలచి తదుచితమూర్తి • ఘటనాభిరతిన్ ॥ ౧౨౨

కం॥ హరి తనకాజ్ఞాపించిన, సరణిన్ వెస నంగలూరు • చని యట నమరే
శ్వరు కోవెలసన్ని నొక, తరువున్ జిరకాలభవ ము • దారముఁ గనియెన్ ॥

చ॥ కని హరిఁ గన్నరీతి నధి • కం బగుసమ్మద మొంది యప్పురీ
జనులకు నీశ్వరాజ్ఞయును • స్వాభిమతం బెరిగించి వారి దా
ననుమతిఁ గాంచి వృక్షము ర • యంబునఁ దాఁ గొనివచ్చి శిల్ప సా
ధన మిరవారఁ జేసి ద్వరి • తంబుగ మూర్తుల నంచితస్థితిన్ ॥ ౧౨౪

॥ పురి జగన్నాథమూర్తు లే • కరణినుండె, న త్తెరంగున మూర్తిత్ర • యంబు సంఘ
టించి భూసురకోటి సే • వింప వానిఁ, బెనుపమర సన్నపాటికిఁ • గొనుచువచ్చె॥

కం॥ శ్రుతివిఖనస సూత్రోదిత, తత వైష్ణవధర్మవిధి వి • ధానములఁ దదా
శ్రితుల కధివాసనాదిక, హితకృత్యము లెల్ల నిర్వ • హించెఁ గ్రమముగన్ ॥
వ॥ అప్పుడు. ౧౨౬

మ॥ వరనీలాదివిహారుఁ డైనహరి యా • వ్యాఘాళియం దంచితా
దర మొప్పన్ బరిపూర్ణ సత్కళలతో • భక్తరక్షైకత
త్పరతన్ గాంచుఁ బ్రతిష్ఠయంచు దివి ను • ద ల్లీలఁ జాటించి తా
నరిగెన్ జాట రసాతలంబునకు వా • ర్యశ్వుండు క్షీణాంశుఁడై॥

సూర్యాస్తమయ వర్ణనము.

కం॥ ధావత్తపన రథాశ్వ ఖు, రావేగ క్షతిసముద్ధ • తా స్త్రాది శిఖా
ప్లావిత గైరికధాతువి, భా విలసితసాంధ్యరాగ • మలమెన్ జదలన్ ॥ ౧౨౮

చ॥ అపరదిగద్రికూట బహు • శాంచదరణ చరద్విభావసూ
త్తపనకృదర్చిరుద్గతి వి • ధాన నిరంతర దహ్యమాన వృ
క్షపటల జాయమాన పరి • సర్పితధూమసమూహ మై తమం
బుపగత మయ్యె జ్వాలికల • యోజఁ దగెన్ బటుసాంధ్య దితుల్ ॥ ౧౩౦

చ॥ జగమను శుక్తిలోన నతి • సాంద్రతమం బనుస్వాతివృష్టి పెం
పుగఁ గురియంగ నప్పతిలు • ముత్తియపుంగుము లై నభోంగణం
బు గరము సొంపు నింప నుడు • పుంజము వెల్లుగ నుల్లసిల్లె భా
వి గరుడవాహనోత్సవ భ • విష్ణు సపుష్ప వితాన మో యనన్ ॥

కం॥ చలువలరేఁ డనుకొమరుని, నలవునఁ జాల్మోచి యున్న • యత్తొలి దెస యన్
వెలఁదుక మోమునఁ దోఁచిన, వెలరుంజాయ యనఁ దూర్పు • వెల్లం బడియెన్ ॥

చ॥ వెలయఁగ వేఁగు బోక నగు • వెన్నునిమే ల్తిరువాళ్లఁ గన్గొనన్
గలయఁగఁ జుక్క లన్న తెర • గంటిగుము ల్మనగాఁగ వచ్చువే
ల్పులదొర కెత్తువెల్గొడుగు • పొల్పు వెలార్చుచు నబ్బురంబుగా
చలువలరేఁడు తూరుపుదె • సన్ బసమీరఁగఁ దోఁచె నయ్యెడన్ ॥ ౧౩౩

మ॥ నిరు లొప్పెన్ హరికి గ్రిహప్రతతికిన్ • క్షీరాధివాసక్రియా
పరిపాటిన్ ఘటియింప శీతకరసౌ • వర్ణాణరాజ్ఞైచి
స్ఫురదా నత్ దుహ్యామానసుపయః • పూరంబు నాఁగన్ నిరం
తరవేధోండకటాహపూర్ణ మయి జ్యో • త్స్నాసంప్రవాహం బటన్ ॥ ౧౩౪

వ॥ అప్పు డప్పరమతపోధనుం డగుపరమహంస పరివ్రాజకాచార్య శ్రీమ
త్పురుషోత్తమానందావధూతస్వామిపరేద్యవిప్రతిష్ఠ్యమాణవిగ్రహంబులయందు శ్రీ జగ
న్నాధకళాన్యాసము గావింప సాక్షాదీశ్వరావేశం బగించి తపోనిష్ఠాగరిష్ఠుం డై
యుండె ననంతరంబున ౧౩౫

చ॥ హలధరుఁడున్ సుభద్రియు జ • నార్దనదేవుఁడు శోభవివ్యదు
ఏల నిజసంప్రతిష్ఠ నన • పద్య నిజాంశల నర్చ విగ్రహం
బుల వెలయింతు రంచు జగ • ము ల్వినఁ జాటెడు నాఁ బడాయుధం
బులు గలయంగఁ గూసె గృహ • మూర్ధము లెక్కి యుదారవంబులన్ ॥ ౧౩౬

కం॥ భావిజగన్నాధప్రతి, ష్ఠావిధిసందర్శనేచ్ఛ • సహసాగచ్ఛ
ద్దేవ సమూహపురోగము, భావంబున వేఁగుఁజుక్క • ప్రాచిన్ దోఁచెన్ ॥ ౧౩౭

# జగన్నాథీయము

శా॥ ప్రాతర్వేళ మహీసుపర్వనిచితార్ఘ్యస్పృష్టవార్విప్రుష
ద్వ్రాతోదారశరారపాతహతశర్వర్యద్ఘోరమందేహదే
హేతిస్యన్ననవాసరినిర్ఝరకృతవ్యాప్తిభ్రమాపాది యై
ద్యోతం బయ్యెఁ బ్రభూతసాంధ్యరుచి ప్రత్యూషంబునన్ బ్రాగ్దిశన్ ॥

కం॥ అరయఁగఁ గలికాలంబున, నురు వగుసత్పురుషకోటియునికి కరంబున్
విరళప్రచార మగు నను, కరణిన్ విరళ మయి తారకంబులు సురిగెన్ ॥

చ॥ తరి యను నూర్ణనాభ ముచితస్థితి నభ్రవిటంకపార్శ్వమం
దిరులను మక్షికాతతి గ్రహింపఁగ వెన్నెల యన్నతంతులన్
బరపినసాలెగూఁ డన విపర్ణత నైందవమండలం బొగిన్
బరఁగెఁ బ్రతీచియందుఁ బొరఁ బారినయీఁగలఁ బోలె నంకముల్ ॥ ౧౮౦

చ॥ అరయ సహస్రభానుఁ డితఁ డందురు లెక్క యొనర్చి చూత మీ
కరముల నంచుఁ బ్రాగ్గిరిశిఖన్ రవి భానువు లుద్గమించు వై
ఖరి ముకుళచ్ఛదాంగుళనికాయ మొగిన్ గ్రమ మొక్కి విచ్చుచున్
బొరిపొరి వేయిరేకులఁ బ్రఫుల్లతఁ జూపె సహస్రపత్రముల్ ॥ ౧౮౧

చ॥ తమిమధు వాని యంతట రొదల్ సెలఁగన్ జరియించుచో మద
భ్రమరమలిమ్లుచప్రతతి రాజటపంకజబంధమందిరాం
తములఁ జెరన్ దగుల్పఁ గని నప్రధితాజ్ఞ విముక్తికై కవా
టమహితపత్రముల్ దెరచుటన్ వెడలెన్ మధుపాళి క్రమ్మరన్ ॥ ౧౮౨

చ॥ తమి మదనాహవంబుల నితాంతపరిశ్రమఁ జిక్కి తాంతదే
హములు సముద్గతశ్రమజలార్ద్రితఁ గాంచఁగఁ జొక్కు దంపతుల్
గ్రమమున హోయి హోయి యన ఘర్మకణంబులు జోఁపి ప్రాతరా
గమ మెరిగించె గంధవహకందళముల్ మృదువిభ్రమంబులన్ ॥ ౧౮౩

ఉ॥ దూడల విప్పి ధేనువుల దోహనముల్ రచియింప ముంతలన్
గూడెడుఘూంకృతిధ్వనులు గోపవధూటులు చల్లఁ ద్రచ్చుచోఁ
గూడెడుకవ్వపుంఘుమఘుమారవముల్ వెసఁ దల్లిఁ జేరఁ జి

ట్టాడెడు లేఁగపిండురుచిరార్భటులన్ దలసూపె నెల్లెడన్ ॥

మ॥ అవధూతాగ్రణి మీఁది సత్కరుణ లోకారాధ్యుఁ డావిష్ణుఁ డీ
యవనిన్ నేఁడు ప్రతిష్ఠఁ గైకొను నటం చాసక్తి నీక్షింపఁ బ్రా
గవనీభృచ్ఛిఖరాగ్ర మెక్కె నసఁ బూర్వాశావధూఫాలభా
జ్నవసింధూరతమాలపత్రి మన మార్తాండుండు దోఁచెన్ దివిన్ ॥

చ॥ ధరణిఁ బ్రతిష్ఠ గైకొనఁ గదాధరుఁ డయ్యతిరాజుప్రార్థనన్
సరగునఁ దోఁచఁ దత్పరిలసత్కరయుగ్మగశంఖచక్రవి
స్ఫురణఁ బ్ర చిఁ జంద్రుఁడును బూర్వమహీధరశృంగసక్తి భా
స్కరుఁడును దోఁచి రొక్కటఁ లగత్త్రితలోహిత కాంతిమంజిమన్ ॥

వ॥ ఇట్లు సూర్యోదయం బైన యనంతరంబున.

॥ మంథాయమానసన్మంధరత్మాధర, నిర్మథ్యమానవార్నిధి తరంగ
సంఘట్టనోత్థఘుమంఘుమారవపరి పోషవిశేషసముద్యతతుల
తూర్యత్రయీరవాపూర్యమాణాంచిత, ద్యావాపృథివ్యంతరావకాశ
మగుచు ముహుర్ముహుర్వ్యాఢౌకమానగం,భీర రీమహోదార ..క

గీ॥ రారవంబులు సెలఁగ వీత్థార్థసముప, యాతబహువిధజనతానిరంతరప్ర
భూతకోలాహలధ్వని ఖ్యాతి మగుచు, శ్రీజగన్నాథసంప్రతిష్ఠాజయప్ర
దావసర మొప్పె వ్యాధాళియందు నపుడు ॥

మ॥ సుముహూర్తం బరుదేర నంత బహుళశ్రోణీసుపరోదితా
గమమంత్రధ్వను లాకసంబు నొరయంగన్ దూర్యనాదంబు లు
త్తమభేరీవిజయధ్వనుల్ జయజయధ్వానంబులున్ రోద
సముదీర్ణం బొనరింప శ్రీహరిప్రతిష్ఠానిష్ఠితోత్సాహి యై ॥

మ॥ అవధూతాగ్రసరుండు చిత్తముచితైకాగ్రస్థితిన్ నిల్పి మా
ధవు సద్భక్తిలతా బద్ధు మహితధ్యానావధానస్థితిన్
స్వవశుం జేసి నిరూఢవైష్ణవకళాసంపూర్ణవిన్యాసయం
త్రవరంబందుఁ బ్రతిష్ఠఁ జేసె విజయధ్వానంబు లేతేరఁగన్ ॥

॥ సంప్రతిష్ఠితయంత్ర•సహితపీఠంబు న, వేదనిర్ఘోషములఁ • విన్ను ముట్ట
దారుమూర్తుల నుచి•తస్థితిఁ బల, భద్రసుభద్రావి•భాసమాన
శ్రీజగన్నాథవి•రాజితవిగ్రహ, త్రయముఁ బ్రతిష్ఠించి • తదధికరణ
మందు వైష్ణవకళా•న్యాసంబు గావింప, నయ్యవధూత మ•హానుభావ

గీ॥ మున జనంబులు గనుఁగొన •బోధివృక్ష, మందుఁ బ్రాదుర్భవించి ది•గంతములు వె
లుంగ వైష్ణవ మైన వె•లుంగు విగ్ర, హంబులఁ బ్రవేశ మొనరించె • నద్భుతముగ॥

మ॥ హరితేజంబు ప్రవేశ మొందుటయు స•మ్యగ్ద్యోతమానంబు లై
స్ఫురదాకారవిలాసభాసురము లై • పొల్పొందె నమ్మూర్తు ల
ప్పురిలో నున్న యపూర్వ వైష్ణవమహో • స్ఫూర్జ జ్జగన్నాథసుం
దరమూర్తి త్రితయానుకారి విభవో•న్నత్యంబు నిత్యంబుగన్॥ ౧౫౨

వ॥ ఇట్లు సంప్రతిష్ఠితంబు లైన యవ్విగ్రహంబులు శ్రీజగన్నాథ కళాంశ ప్రవేశంబున నుపబృంహిత తేజోవిశేషంబునం బ్రకాశించుటయు నయ్యవధూతవల్లభుండు సముల్లసితభక్తికలితుం డై ముకుళితకరకమలయుగళుం డలికఫలకంబునఁ గదియించి సాష్టాంగనమస్కారం బొనరించి యిట్లని వినుతించె. ౧౫౩

జగన్నాథస్తవము.

మ॥ శ్రుతిసీమంతపరిష్క్రియా మహిత •జోభాజనాంఘ్రిద్వయా
శతపత్రాంచిత భక్తిపూర్వక నమ•స్కారక్రియాధూర్వహా
ప్రతిలోకప్రతిపాలన ప్రవణదీ•వ్య త్సత్కృపావైభవో
న్నతసర్వైక నియామకప్రథ జగ•న్నాథా ప్రసాదింపుమా॥ ౧౫౪

మ॥ అతులానంద సమేధమానమహనీ • యజ్ఞానవిద్యోతితా
కృతిసంభావిత లక్ష్యయోగిపరమ • శ్రేయఃప్రదానక్షణా
వితతశ్రీపరిణీత భూరిమహిమా • విఖ్యాత దుష్కల్మషాం
ధత మచ్ఛేదినఖేందుయుక్పద జగ•న్నాథా ప్రసాదింపుమా॥ ౧౫౫

మ॥ అతిదుర్లంఘ్య భవత్ప్రశాసనమహా•త్త్వావాప్తిచే వీచు మా
రుతముల్ వహ్ని జ్వలించు సూర్యుఁడును జం•ద్రుండున్ బ్రకాశింతు రీ
క్షితి సర్వంబు భరించు నీయఖిలముల్ • వ్యయప్రచారప్రథా
నత వర్తించుట సత్య మౌఁ గద జగ•న్నాథా ప్రసాదింపుమా॥ ౧౫౬

మ॥ చతురాస్యుండు త్వదీయనాభిజలరు ♦ ట్సంజాతుఁ డీ విశ్వమున్
చితశక్తిన్ సృజియించు సత్వగుణ సం ♦ స్థితిన్ సమంచత్కృపా
యతిఁ బోషింపఁగ గర్త వీ వగుచు వి ♦ శ్వాధీశతన్ గాంచె దో
నతరక్షావిధసంచిత ప్రథ జగ ♦ న్నాథా ప్రసాదింపుమా॥ ౧౫౮

మ॥ అతులం బవ్యయ మప్రతర్క్యము ప్రబో ♦ ధానంద మాత్రంబు న
చ్యుత మక్షోభ్య మనంత మద్వయము సంద్జ్యోతి స్స్వరూపంబు శా
శ్వత మాద్యంతవిహీన మై తనరు తే ♦ జం బవ యంచున్ సను
స్నతిఁ గీర్తించుఁ ద్రయీశిరమ్ములు జగ ♦ న్నాథా ప్రసాదింపుమా॥ ౧౫౯

దండకము.

శ్రీశారమేశా జగన్నాథ సంపూర్ణబోధా సమంచత్ప్రభావా మహాదేవదేవాది దేవా సదానందగోవింద దామోదరా భక్తరక్షాదరా శ్రీధరా వాసుదేవా సమంచత్ప్రభావా భవానీశ సంస్తూయమానా గుణానూన భావింపఁగాఁ బాలలోనన్ ఘృతంబున్నచందాన నీవిశ్వమం దీవు నీయందు నమ్మేడిపండ్లన్ గ్రిమివ్రాత మట్లీజగంబుల్ వసించున్ బ్రసూనంబునన్ దావి కైవిన్ జగద్ధేతు వౌ నాత్మవిచ్ఛక్తి నీయంద యుండున్ దదీయోరుమాయా ప్రభావంబునన్ రజ్జుసర్పభ్రమత్వానుకారిక్రియాభావరూప ప్రపంచోద్భవం బౌఁ ద్వదీయ ప్రవేశంబుచే సత్యమా నట్లు దోఁచున్ దదావిద్యకోపాధి యందంబు కుంభాంతరాబింబిత బ్రధ్నబింబాకృతిన్ గల్పితాభాస రూపంబునన్ జీవభావంబు ప్రాపించి మిథ్యాప్రపంచైక భోక్తృత్వ మధ్యాసరూపంబునన్ బాపుచున్ గ్రీడ గావించుచున్నావ విద్యాప్రభావంబుచే జ్ఞానవృత్తిన్ దిరోధానమై ప్రస్ఫుటాహంక్రియావ్యాప్తి సంసారియై యావిమోక్షంబు వర్తించు జీవుండు విజ్ఞానదృష్టిన్ స్వరూపానుభూతిన్ దగన్ దాన నీ వౌట భావించి నిర్ధూతబంధుండు గా జీవభావంబుఁ బోఁ ద్రోచి నీ వై ప్రకాశించు నో దేవదేవా నినున్ గన్గొనన్ నిన్ను సేవం విధప్రాభవోపేతుఁ డం చెంచ బ్రహ్మాదులున్ జాలు వారే జడుండన్ ధృతి న్నిన్ను వర్ణింప శక్తుండనే దేహభావంబునన్ దాసుఁడన్ జీవభావంబునన్ దావకాంశోద్భవుండన్ సదాత్మానుభావంబునన్ నీవ నేనౌదు నాయందు నిర్వ్యాజకారుణ్యయుక్తిన్ ద్వదీయప్రతిష్ఠాప్రభావంబు నాకున్ గటాక్షించి మహాకారితోదార సద్దారుమూర్తిత్రియున్ దివ్యతేజః ప్రవేశంబు గావించి నాకున్

చిరఖ్యాతి నందించితో దేవ యిమ్మూర్తులందిట్లు యెల్లప్పుడున్ నిల్చి భక్తానుకంపార
తిన్ లోకముల్ బ్రోవు మో భూరితేజస్స్వనాథా జగన్నాథ దేవా నమస్తే నమస్తే
నమః॥ ౧౫౯

చ॥ అని వినుతించి ఫాలమున ♦ నంజలి బంధముఁ జేర్చి దేవ నీ
తనయుఁడ నాపయిన్ గరుణ ♦ దాసజనావనదీక్షఁ బూని యిం
దవిరతంబు నిల్వుము మ ♦ దంచిత కీర్తి జగంబునందు శో
పానరఁగఁ - యుం మాదినక ♦ రోడుపతారక మై వెలుంగఁగన్॥ ౧౬౦

క॥ పురి నీచందంబగు నా, దరమున నివసించి తో గ ♦ దాధర నాపైఁ
గరుణన్ వ్యాధాళిని న, క్కరణిన్ వసియింపు మీ జ ♦ గన్నాథ విభూ॥

క॥ పురుషోత్తమ యిటుఁ దానక, చరణాంబుజయుగముఁ గాంచి ♦ సద్భక్తి రతిన్
నరుఁడు భజించిన నతనికిఁ, బరమశ్రేయంబు లొసఁగి ♦ పాలింపు హరీ॥

॥ ఆజగన్నాథమందుండు ♦ నట్లుమత్కృ, తార్చ్యవిగ్రహములనుండు ♦ నంచువరమొ
సంగితివి నాకు నియ్యది ♦ సత్యముగనో, నర్చి పాలింపు భక్తజ ♦ నంబు నిచట॥

వ॥ అని విన్నవించి పునఃపునస్సాష్టాంగ నమస్కారంబు లొనర్చి యప్పుడు వైఖానస సూత్రోక్త విధానంబున భూసురసహాయంబునఁ బ్రతిష్ఠోత్సవంబులు యథావిధి నిర్వర్తించె నంతరంబున. ౧౬౪

వర్షర్తు వర్ణనము.

ఉ॥ తోరపుఁగ్రొమ్మొయిళ్లలమెఁ ♦ దూరుపుగాడుపు లెచ్చె వింట నిం
డారి మెరుంగుదీవియల ♦ డా లలరారె నుదారభూరిభే
కారవముల్ నభం బొరసె ♦ నంబుదగర్జితము ల్వెలంగె నే
పారెడు ప్రావృడాగమము ♦ నందు వలుంద బెడంగు మీరఁగన్॥ ౧౬౫

చ॥ వలనగుమంద్రగర్జితర ♦ వంబుల పేరిమృదంగ నిస్వనం
బులు మొరయంగ నిందిరిధను ♦ వుల్ పలురంగు మెరుంగుతోరణం
బులుగ నవోదబిందువులు ♦ ముత్తెపుసేసలుగా నభోంగణ
స్థలమునఁ గ్రొమ్మెరుంగునటు ♦ సల్పె సవిభ్రమతాండవం బొగిన్॥ ౧౬౬

ఉ॥ కారుమొయిళ్లు నల్గడల ♦ గ్రమ్మి నభంబు ధరావధూకచో
ధారతఁ జూప నందు సుచి ♦ త్స్థితి మీరఁ దురంగలించుచుఁబం

గారుమెరుంగుసొమ్ములనఁ • గాఁ దనరారెఁ దటిల్లతాతతుల్
పూరితరత్నభూషకము•పోల్కెఁ దగెన్ వళితేంద్రచాపముల్ ॥ ౧౬౭

చ॥ నెరయఁగఁ బండి నిండికొను• నేరెడు పండ్ల హారంగు మేదినీ
తరుణివలుందగుబ్బకవఁ • దాల్చిరచొక్క-పుటింద్రనీలర
త్నరుచిరహారవల్లరు లనం దనరారెఁ దదుగ్గళద్రావాం
కురపరిషేక మొప్పగులు•కుక్ మృగనాభవిలేపనస్థితిన్ ॥ ౧౬౮

చ॥ పరిమళభార మొల్లెడలఁ • బైకొన సంచితగాంచవద్యుతుల్
పొరిఁబొరిఁగ్రమ్మఁగా మొగలి•పూవులు చెన్నెసలారెఁ దన్నిళ
త్సుర ళిగంధముల్ గిలుబు•చున్ బవనాంకురముల్ మెలంగ ని
బ్బర మగునట్టికొవ్వలపు • పాంథజనంబుల కామతింపుచున్ ॥ ౧౬౯

చ॥ తరుణనిదాఘభాక్తపన•తాపసుతప్తసరిత్ప్రకాండబం
ధురజలపూరఘర్మవిత•తుల్దివి వారిదయంత్రసంగతిన్
బొరిఁబొరిఁ గ్రమ్మరన్ ద్రవతఁ • బూని స్రవించెడు దాపికం బనన్
బరఁగెను వృష్టి సత్తరు లు•పాగతసత్వము లయ్యె దానిచేన్ ॥ ౧౭౦

మ॥ అవనీమండలనాయికామణిపయిన్ • ద్యోరన్నయకుం డంచితో
త్సవ మొప్పార వినీలనీరదపుట•త్వద్రిత్నవిక్షేపయం
త్రవిశేషంబునఁ జల్లుగంధజలధా•రాపూర మోయంచు నెం
చ వినోదం బొనరించె నెల్లెడల న•శ్రాంతపర్షం బటన్ ॥ ౧౭౧

మ॥ వెలిమబ్బారి దివంబు ప్రొద్దునికి భా•వింపంగ రాకెప్పుడున్
బలితం బౌ జడివాన పెల్లు గురియన్ • గాటంబుగాఁ దూర్పుగా
లి లలిన్ వీవఁగ నేల చిత్తడి పడన్ • లీలన్ మృదంగధ్వనిన్
గలయంగా నురుముల్ సెలంగ నెసఁగెన్ • వర్షాదినంబుల్ గడున్ ॥ ౧౭౨

॥ కారొక్కన్నెక్రొమ్మెయిల్ • గప్పి ప్రొద్దెరుగంగ, రాకసపల్లొక్క•రహిఁ జెలంగ
జల్లువాన లడంగ • సన్నంపుఁ దుంపురు, లుడుగక యెప్పుడు • నొదవుచుం
నెడపక వీచెడు•నీదగాడుపు తాఁకు, డడరి పసు ల్వంచ • ముడిఁగి నిలువ
తడికొట్టు గుడ్డలు • దడవఁగాఁ బసులకు, గడ్డి గాదము వైచి • కట్టిపైవ

॥ సందడిం బడి సంసార్లు • జడిపయుదుగ, వేఁడనీళ్లను దానంబు • లాడిబెడ
మడుగులం గట్టి కూడు సా•పడి వెడంద, దుప్పటీ గప్పిగురవెట్టఁ•దొడఁగిరపు-

వ॥ ఇట్లు వర్షాగమంబు క్రమక్రమప్రవర్ధమానం బైన నదీనద తటాకకూపకుల్యాప్రకాండంబు కాండపరికాండంబున నిండారి కనులపండువు సేయ బహువిధ సస్యోపసస్య విన్యాసంబున భాసమానం బై వసుంధరాసతి పచ్చపట్టు పుట్టంబు గట్టి నట్టు విలసిల్లె నయ్యవసరంబున. ౧౩౮

అవధూతస్వామి కృష్ణానదికి స్నానమున కరుగుట.

కం॥ యతితల్లజుండు శ్రీహరి, ప్రతిష్ఠ గావించి తత్ప్రవర్తనకై యం
చితవృత్తి సంగ్రహింపఁగ, మతిలోఁ దలపోసి తత్క్రమము ఘటియింపన్॥

కం॥ శ్రుతిపారగు లగుక్షితిదైవతముఖ్యులు గొంద రధికభక్తిని దనతో
డుత రాఁగఁ గృష్ణవేణికి, నతఁడేగెన్ స్నానకాంక్షియై యొకనాటన్॥

మత్తకోకిల.

ఏగి యయ్యవధూత విప్రుల • నెల్ల సహ్యజాతటిన్
బాగు మీరఁగ నిల్వఁ డంచును • బల్కి నీట మునింగి నే
వేగ వచ్చెద నాదురాకకు • వేచి యుండుఁ డటంచు న
య్యోగి యన్నదిఁ జొచ్చెఁ దాఁ బురుషోత్తమున్ స్మరియించుచున్॥ ౧౪౧

తరల.

యతిశిఖామణి సహ్యజసలిలాంతరంబున మున్గి యా
యతిమహాయోగమహత్వ మొప్పఁగ • నాక్షణంబునఁ దేలె న
ద్భుతము మీరఁగ గోలకొండకుఁ • బొంత హైదరబాదులో
క్షితివరుం డగుమ్లేచ్ఛభూపతి • చెంత నిల్చె సభాస్థలిన్॥ ౧౪౨

అవధూతస్వామి నిజామద్దౌలా కొల్వులోని కరుగుట.

కం॥ ఆకస్మికముగ నాకృతిఁ, గైకొని సభలోన నిల్వఁ గాఁ గన్గొని యా
భూకాంతుఁ డద్భుతంబున, "యాకాహై" యనుచుఁ బలికె యతివరుఁ డంతన్॥

॥ పలికె నిట్లని "ఖుదాబక్ సునో కైఫతు, హంతో విరాగిసన్న్యాసి పౌర
అవధూత పురుషోత్తమానంద నామ్ముజే, అల్లాజగన్నాథ • ధ్యాకియాకి
అర్చాప్రతిష్ఠా మెహర్బాని ఖుష్క, రేఖబుల్ ధ్యా తుమా • రేఖదంసె
వునాక్ భిరా జాత్ బందర్ కే జహాగీర్ బ, హల్ ముసల్లంకర • నా మొకర్ర

॥ రనుచుఁ జెప్పియవల; హజరత్ తుమారదా, లతు ఖుషామతు సెమి • లా హోతాఖు
దాహుకుంసె యా బదస్తు బనానా య, టంచు విన్నవించె • నవని పతికి॥

కం॥ మునివల్లభుపలుకులు విని, జననాథుం డైనయానిజాముద్దౌలా
మనమలర మెచ్చి నీకో, రినగ్రామం బెచటనో వివరింపు మనంగన్॥ ౧౭౧

తే॥ ఆగుచు సర్కారుముస్తఫానగరు విన్న, కోటపరగణాలో మజుకూరు సన్న
పాడు వ్యాఖ్యాళి జగత్పతికి నునికి, గ్రామమిది మీరుజాఫీరుగా నొసంగ
వలె జగన్నాథునకు నుత్సవములకొరకు॥ ౧౭౨

స్రగ్ధర

ఆ లక్ దెల్పఁగా నయ్యతిపతివచనం బర్థితోడన్ నిజాము
ద్దౌలా యాలించి హంకే దవులతు ఖుబుహోతా జగన్నాథకే మా
లాకే ఖుష్‌పరమో మనుచు నెదుట నమ్రానసుం డౌదివాన్జీ
నాలోకించెన్ లిఖోకే యబిసనదనితానాన తిచ్చెన్ బిరానన్॥ ౧౭౩

నిజాముద్దౌలా స్వామివారికి జాఫీరిచ్చుట

తే॥ అప్పుడు దివాను స్వయముగా హస్తమునను, కలము కాగితమును గొని యె
లమి మీఱఁ
బాదుషా యాజ్ఞఁ బాటించి వ్రాసెనుఫర, మాన వ్రాసినఫక్కి క్రమముగఁ జదివె॥

నిజాముద్దౌలాసనదు.

వ॥ బ ఆమిలాను హాలు వ యిస్తకబోలు పరగణేవిన్నకోట సర్కార్ ముస్తఫాన్నగర్ నూబేహాయిదరాబాదు నిలిస్తమీమవదు మాంజె వడాలి సన్నపాడుఅమికే పరగణే మజుకూరు కామిలు ౧౫౦ జగన్నాథు ఆ రాజూతు లకిందను ఖుదమ్ నుంచి మెుక్రరరు జారీ గనుక దరింవిలాను బదస్తు మామూలు హాసబ్ బమను బనాము మామిలై బహాలు ముసల్లం చేయ సైనది. కాయదు కే మంజే మజుకూర్ మహర్నకే తసరఫున విడిచిపెట్టేది. అందువల్ల వచ్చిన మహాన్మ్యాలు అనుభవిస్తూ బదా ఆయే తరక్కి కింమరం యెక్ శాలు ఆబాదు యింతీసాలు హామషుగ ... లవుండేది ...లబాలు తాఖీదు గాన తెలిసేది.

చం ౧ షహర్ జమాదిలవల్ సన్ ౧౧౭౮ హిజురా
బమను బమోజబు సవాల్ దస్కత్ నల్॥ ౧౭౫

కం॥ అని చదువఁ బాదుషామున, మునను జగన్నాథుఁదలఁచి మ్రొక్కి స్వయముగా
సనదుపయి మొహరు వైచి స, వినయముగా నిచ్చె మానివిభునకు నంతన్॥

# జగన్నాథీయము

వ॥ సనదు తన చేతఁ గొనుచు నంచ్చటను వెడలి, తనమనోవేగమున వచ్చి తత్క్షణంబ
కృష్ణవేణి జలముల మున్గినప్రదేశ, మునను వెస లేచి తత్తటంబునకు వచ్చి॥ ౧౭౨

అవధూతస్వామి కృష్ణలోనుంచి లేచి సనదు బ్రాహ్మణులకు చూపుట.

॥ భూదేవతలఁ జూచి ◆ పాదుషాపరమాన దెచ్చితి మనదేవ ◆ దేవునకును
సన్నపాడు వడాలి ◆ జాగీరుగా నిజా, మద్దవులా బహుమతి యొసంగె
నిదిగో సన్నదు మన ◆ మేగుద మింక రండు, లెండన వార లా ◆ ల కద్భు
తము నొంది యొకముహూర్తమునిండగాలేదు హైదరాబా దెక్క ◆ డానిజాము
గీ॥ పాదుషాలెల్ల వెక్క డొప్పగిది నేగి, తెచ్చితిరి పరమాన మాకిచ్చెదరు వగ
మీమహాత్వంబు వర్ణింప మేరఁగలదె, యనుచు నవధూతఁ బొగడిరయ్యవనిసురులు॥

ఉత్సాహ.

యోగమహిమ మద్భుతం బహో మహానుభావ నీ
యీగురు ప్రభావమార ◆ యెన్న నెంతవార మో
యోగివర్య శిష్యులన్ సముద్ధరింపఁ గా మహా
భాగధాత్రి నవతరించు ◆ వ్యాసమాని వీవయా॥ ౧౭౩

వ॥ అనుచు బ్రాహ్మణసమూహము ప్రశంసింప నయ్యతిచంద్రుండు మగుడి
వచ్చి. ౧౭౪

అవధూత వడాలిలో చేసినయేర్పాటు.

॥ ఆజగన్నాథ దేవాలయంబునఁ బ్రీతి, దినమును స్వస్తి వాచన మొనర్ప
సంగీతమును బాడి ◆ సతతము హరిభజ, నము నొనర్పఁగ బ్రాహ్మణప్రవరుల
నియమించి వారికి ◆ నిత జీవనముగా, నౌకరీకొరకు నీనాములుగను
నగబాలుగ్రామ మొసంగి తక్కిన నగం బాజగన్నాథు నిత్యార్చనమును
॥ బక్షమాసవర్షబ్రహ్మోత్సవాదులు, జరుపుటకును నియతి ◆ సల్పియట్లు
జరుగునట్లు నిలిపెఁ ◆ బురుషోత్తమానంద, యతివరేణ్యుఁ డీశ్వరార్పణముగ॥

ఆ॥వె॥ వారణాశినుండి ◆ వచ్చినకతమున, భూరిసుగుణధనులు ◆ వారణాశి
వారనంగ విప్రవరులు స్వామికి నవ్వ, సలుపఁ జొచ్చి రచట ◆ శాశ్వతముగ॥

శా॥ ఆచంద్రార్కము గాఁగ నుల్లసిలు స్వా•స్థ్యం బిట్టు లార్జించి స
ద్ధీ నస్థితి సంతతోత్సవము ల•ర్థిన్ సంప్రవర్తించు న
ట్లాచందంబున నేరుపాటులను స•మ్యగ్భంగిఁ గావించి నా
ర్యాచీనప్రముదంబు నొందెను గృతా•ర్థంమన్యమానాత్ముఁడై॥ ౧౯౩

శా॥ బోధానందధురీణుఁ డయ్యతి ముదా•పూర్ణాత్ముఁడై జగ
న్నాథస్వామికి భక్తు లెల్లఁ బ్రమదో•న్మగ్నాత్ములై చూడ ని
ర్బాధప్రక్రియ బ్రాహ్మణప్రతతితో • బ్రహ్మోత్సవం బప్పుడా
వ్యాధాళిన్ రచియించె భూజనులు ధ•న్యంమన్యు లైకొల్వఁగన్॥ ౧౯౪

జగన్నాథస్వామివారి బ్రహ్మోత్సవము.

కం॥ ఆషాఢశు పూర్ణిమ, భాషాపతితుల్యుఁ డైన•బ్రహ్మర్షి సము
న్మేషితవిభవోత్సవపరి, పోషముగ రథోత్సవము వి•భున కొనరించెన్॥ ౧౯౫

సీ॥ బహువిధాలంకార•భాసురం బైమించు, పుష్యరథంబున • భూరికనక
భూషణాలంకృత•వేషంబు లలర సు, భద్రాజగన్నాథ•బలవిభులను
వేంచేపు సేయించి • చోపులను వీవ, సూర్యచంద్రప్రభల్ • సొంపు గులుక
వ్రాతాతపత్రంబు•చెలువుసూపఁగఁ బవల్, దివిటీలు వెలుఁగ స్వ•స్తిరవ మొప్ప

గీ॥ భూరిభేరీధణంధణా•త్కారనినద, మాకసము నిండఁ దూర్యత్రి•యములు మ్రోయ
సరసహరిభక్తు లెల్ల భ•జన లొనర్ప, నపుడు రథయాత్ర గావించి•రభినవముగ

తే॥ ఆజగన్నాథునిరథోత్స•వావసరము, నందు జనములసందడే • ముందుముందు
సేనలుగ పల్లుకుసుమముల్ • చిత్రిమవని, నొక్కచేనియుఁ బడదయ్యె•నక్క
జముగ॥ ౧౯౬

॥ పలుతుల నంగడులను, ఫలములు భక్ష్యములు గొనుచుఁ • బ్రజ లెల్ల మురా
కళితు లయి మెలఁగి రే మని, తెలుపుదు నయ్యుత్సవంబు • తెరఁగుఁగన్ మెరుఁ
గున్॥ ౧౯౭

మ॥ అలరంభోర్వశిమేనకాదులను గా•దంచున్ దటాయించున
వెలహోరియాంద్రవిలాసనృత్యముల•విన్ జెప్పఁగా శక్యమే
విలసన్నీలవలాహకాంచనలట • ద్విద్యుల్లతావిభ్రమం
బుల నెలన్ దలపించెఁ బ్రేక్షకజనం•బుల్ మేలు సెబాసనన్॥ ౧౯౮

# జగన్నాథీయము

చ॥ అలరుపొలంగురంగుగిలు ♦ బొడెడుకోమలహస్తపల్లవం
బులు భరతాంచితాభినయ♦ముల్ చవి చూపఁగ నవ్విపంచికా
కలరవమేళనంబుగను ♦ గాత్రరవం బమృతప్రవాహముల్
బలుమరు సెల్లెడన్ బరపఁ ♦ బణ్యసతీమణు లాడి రయ్యెడన్॥ ౨౦౦

చ॥ లలితవిలాసవిభ్రమము♦లన్ నెలకొల్పుచు నబ్బురంపుఁగో
పులభరతాగమాభినయ♦ముల్ రచియింపుచు నాట్యమాడు కో
వెలఁదులఁ జూడఁ బొల్పడలి ♦ విస్ఫుటతుంగతరంగభంగికల్
వెలువడి వచ్చునచ్చరల ♦ విన్నను విట్టి ద టంచుఁ దెల్పెడున్॥ ౨౦౧

ఆ॥వె॥ ఇట్లు సకలమాన♦వామోదదాయిగా, హరిరథోత్సవంబు ♦ నతులవిభవ
మలర జరిపి యవల ♦ ♦ సవధూత విప్రసం, తర్పణం బొనర్చె ♦ నేర్పుమీర॥

సీ॥ చారగీరయు లేని♦సన్నబియ్యంపు మే, లోగిరంబును మంచి♦యొలుపుపప్పు
నప్పడంబులు పచ్చ♦డంబులు బహువిధ,శాకపాకములు పం♦చ్చళ్ళుఁ బిండి
వంటలుఁ బలుకల♦వంటకంబులు చిటి, గారెలు బూరెలు ♦ చారు లూరు
గాయలు హో లు ♦ కమ్మని నేతులు, పరమాన్నములు బహు♦భక్ష్యములును
॥ నొదవు పులియోగిరమ్ము ద ♦ ధ్యోదనమ్ము, చక్రపొంగలి పలుచని ♦ తక్రములును
గొల్లలుగఁ దెచ్చి వడ్డింప♦ నుల్లసిల్లి, భూసురవ్రాత మెల్ల భో♦ నేసె నపుడు॥

వ॥ అట్లుత్సవాంతంబున భూరిసంతర్పణం బాచరించి చక్రతీర్థంబు గావించి విధ్యుక్త విధానంబున బ్రహ్మోత్సవంబు నిర్వర్తించి యప్పరమహంస పరివ్రాజకాచార్యుండగు శ్రీపురుషోత్తమానందావధూత శ్రీజగన్నాథ ప్రతిష్ఠోత్సవాదు లొనరించి పూర్వభవాభివాంఛితార్థ సాఫల్యంబుఁ గాంచి కృతార్థంమన్యమానుండై యుండె నంతరంబున. ౨౦౪

## పడాలి అగ్రహారనిర్మాణము.

తే॥ నన్నపాటికి దక్షిణా ♦ శను సమిద్ధ, బోధివృక్షంబుకడ జగ ♦ న్నాథు నాల
యంబునకు నుత్తరమున బ్రా♦హ్మణులకగ్ర, హారనిర్మాణ మొనరించె♦ యతివరుండు॥
॥ తనదు ర్తిధ్వజంబు చం♦ దమునస్వామి, కంచితధ్వజ మెత్తించి ♦ మించుమంట
పమ్ము ప్రాకారమును రుచి♦రమ్ములుగనొ, నర్చెఁ గావించె బహువాహ♦నములు హరికి॥

శా॥ దేవబ్రాహ్మణసంప్రీతిష్ఠలను భ ♦ క్తింజేసి శ్రీవిష్ణుసం
సేవాసిద్ధికి నుల్లసిల్లి జని ని ♦ శ్శేషంబుగా ధన్యతా

శ్రీవెల్గొందఁ గృతార్థచిత్తుఁ డగుచున్ • సిద్ధాగ్రగణ్యుం డనన్
బ్రావిర్భూత యశోవిశేష మహరన్ • భాసిల్లె యోగీంద్రుఁడున్ ॥ ౨౦

తే॥ అప్పుడు వ్యాఘ్రాళికినివాస • మగుటకతన,సార్థకంబుగ వ్యాఘ్రాళి• యనెడు పేరొ
సంగెఁ బురికది వాడుక• జరిగిజరిగి, యిప్పుడు "వడాలి" యను పేరనొప్పుచుండె

తే॥ ఆరు వేలనియోగి బ్రా • హ్మణకుల ప్ర, భూతపురుషోత్తమాఖ్యావ• ధూత యాది
వాకరేందు ననశ్వర • భవ్య రి కేతు వగుచు వడాలి వి• ఖ్యాతిఁ గాంచె॥

వ॥ అనిచెప్పి తత్ప్రభావం బిట్లని వక్కాణించె. ౨౧

వడాలి క్షేత్ర ప్రభావము.

మ॥ నరుఁ డెవ్వాఁడు వడాలివాసుని జగ • న్నాథున్ మహాభక్తిత
త్పరభావంబునఁ బర్వకాలమున సందర్శించి తత్పాదపం
కరుహధ్యానధురీణుఁ డైన వారి స • త్కారుణ్య సంయుక్తి బం
ధుర దోషాంధతమః ప్రకాండములు ని • ర్ధూతంబు లౌఁ గ్రక్కునన్ ॥ ౨౨

కం॥ ఆషాఢశుద్ధపూర్ణిమ, శేషశయానుఁ డగుహరి భ • జించిన నరు ని
శ్శేషాంహః పంకము పరి, శోషితమైపోవు సకల • శుభములు కలుగున్ ॥ ౨౩

తే॥ నరుఁడు దృఢభక్తితో జగ • న్నాథునవ్వ, డాలిపురవాసు సేవించి • నీలశై
నాథుఁ డైనట్టి శ్రీజగ • న్నాథు సేవఁ, జేసిన ఫలంబుఁదాఁగాంచు•సిద్ధమిదియు

కం॥ మధుమాధవమాసంబుల, మధుసూదనపాదయుగ స • మర్చన రతుఁ డై
ప్రథితమగు భక్తిఁగొలిచిన, విధుతభవుఁ డగుచు మోక్ష • విభవముఁ గాంచున్

కం॥ శ్రావణభాద్రపదంబుల, శ్రీవిభుపాదాంబుజములు • సేవించిన నం
హోలిసర మడఁగి మోక్ష, శ్రీవిభవముఁగాంచు నరుఁడు • సిద్ధమునుం ॥ ౨౪

కం॥ శరదవసరమున శ్రీహరి, చరణములు ప్రసూనతతుల • సమధికభక్తిన్
భరితుఁ డయి పూజ చేసినఁ, బరమశ్రేయః ఫలంబు • పొందించు నరున్ ॥

కం॥ హేమంతావసరంబులఁ, జామంతివిరు ల్ముకుంద•చరణాబ్జములన్
ప్రేమరయఁ బూజ చేసిన, నామానవుఁ డిహపరముల • నతిశుభముఁ గనున్

॥ మాఘశుద్ధైకాదశి • మధువిరోధి, యగుజగన్నాథు నర్చించి•నట్టిజనుఁడు
అశ్వమేధశతాధికం • బగుఫలంబుఁ, గాంచు హరిలోకముఁ•గాంచుఁదుదను

# జగన్నాథీయము

కం॥ రవికన్యాగతుఁడై తగు, నవసరమున శ్రీవటాళియందు సుభద్రా
ధవు నెదుట హిరణ్యశ్రా, ద్ధవిధి నడుపఁ బితల కధికతరఫలదముగన్॥

మ॥ రవికన్యాగతుఁడైనచో భరణితారన్ శ్రీజగన్నాథు భ
క్తివిశేషంబునఁ బూజ చేసి పితృముక్తిన్ గోరి వ్యాధాళి యం
ద్ధవిధిన్ శ్రాద్ధ మొనర్చి నేని యావిముక్తక్షేత్రమందున్ గయన్
సవిశేషార్పితపిండదానఫల మా సత్యంబు వాక్రుచ్చెదన్॥ ౨౨౦

కం॥ తపనుఁడు ధనురుపగతుఁడౌ, నపుడు జగన్నాథుఁ బాతరవసరముల న
చ్చపుభక్తిఁ గొలిచె నేనియు, వ్యపగతభవబంధుఁడయి శివము నరుడు గనున్॥

తే॥ బోధనైకాదశిని మహాబోధివృక్ష, మున జగన్నాథు నర్చించి భూరినిష్ఠ
జాగరం బొనరించిన జనుఁడు దళిత, సకలభవబంధుఁడగుచు మోక్షంబుఁ గాంచు॥

కం॥ రాధైకాదశిని జగ, న్నాథునికిన్ బానకంబు నైవేద్య మిడన్
సా తసకలేష్టార్థుం, డై ధన్యతఁ గాంచు జనుఁ డుదంచితనియతిన్॥ ౨౨౩

కం॥ ప్రౌష్ఠపదైకాదశి నతి, నిష్ఠాయుతుఁడై ముకుందుని పదాబ్జములన్
దుష్టిఁగఁ దుల-పూజ య, నుష్ఠించినజనుఁడు దాఁ గనున్ మోక్షరమన్॥

కం॥ మార్గశిరమాసమునను న, న్యర్గళ మగుభక్తి శ్రీజనార్దనునకుఁ బ్రా
తర్గంధార్చన సలిపి త్రి, వర్గఫలంబులను గాంచువాఁడు నరుఁ డొగిన్॥ ౨౨౫

కం॥ వ్యాధాళి కేని యధికవి, బోధం బొనరించి మోక్షము నొసంగినయా
బోధిద్రుమంబుఁ గనుఁగొని, సాధితపరమార్థుఁ డగు నిజము జనుఁ డవనిన్॥

కం॥ ఆసన్నపాటికిని గడు, నాసన్నం బగువటాళియందు హరి నరుం
డాసన్నతుఁడై కొలిచి ర, మాసన్నద్ధప్రబోధమహిమము గాంచున్॥ ౨౨౭

కం॥ ఎవఁ డాలి బిడ్డలను విడి, చి వటాలి వసించి యందు శ్రీహరి సేవిం
చి వటాలిరహితుఁడై ని, ర్చి వధూలింగననియుక్తిచే ముక్తిఁ గనున్॥

కం॥ అని యిట్లు సూతుఁ డమ్ముని, జనులకు వ్యాధాళియందు చక్రధరుఁడు పె
ంపొనర జగన్నాథాకృతిఁ, బునరధిగతుఁ డగుట తెల్లముగ వినిపించెన్॥

ఆశ్వాసాంతము.

శా॥ ఉష్ణాంశ్వన్వయదుగ్ధవారితుహినాంశూరీకృతాకార గం
గోష్ణీవప్రచలద్ధనుర్దళనబాహాహాత్యైక లోకత యీ

నిష్ఠాలోజ్జ్వలకీర్తివర్తితహిమాంశునీరుక్కాశామండలా
తృష్ణాదోషవిదూర సద్ధృదయ యఃశ్రీ రామచంద్రప్రభుః॥ ౭౦

కం॥ పాలకడలి పుట్టురతనము, గుల్కెడు నెదఁ బొదలు కల్మిఁజామతోడ జగా
శేలొక్కనుచుఁ గనికరము గదుఁ, జిలుకుచు లెంకలను బ్రోచుఁ జేరువ కాడా॥

పుష్పితాగ్రవృత్తము.

పరమపురుష ♦ భానువంశచంద్రా, ధరణిసుతాధిప ♦ దారితాసురేంద్రా
నిరుపమగుణ ♦ నిత్యకీర్తిసాంద్రా, ప్రరుచిరసూర్యపు ♦ రస్థరామచంద్రా॥

గద్య.

ఇది శ్రీమద్వృషాకపిక్రుపాకటాక్ష పరివర్ధితసహజ సారస్వతసమ్పాది
తప్రబంధ కవిపంచానన బిరుదాభిరామ విశ్వామిత్ర బ్రహ్మర్షి
సంప్రదాయాడవి నందగిరి వంశాబ్ధిసోమ సహజసౌహా
దమహోద్యమ సాంబశివ వేంకటప్ప రాయ
కవిలలామ వినిర్మితంబగు శివవేంకటీయ
గ్రంథమాల యందుఁ దృతీయ
పుష్ప మగు జగన్నా
థీయమహాప్రబం
ధమునఁ దృతీ
యాశ్వా
సము.



# జగన్నాధీయము.

## చతుర్థాశ్వాసము.

శ్రీమత్సమస్తసుగుణ, స్తోమాపాదాబ్జవినత♦సుత్రామసము
ద్దామరిపు మదనుజవి, రామా సూర్యపురిధామ♦రాజలలామా॥

వ॥ అవధరింపు మట్లు సూతుండు శౌనకాదులకు వ్యాధాక్షేత్ర నిర్మాణ ప్రకారం బెరింగించినంతట నవ్విశేషం బంతయు నాలకించి ప్రహృష్టతరంగితాంతరంగు లై వారలు సూతున కిట్లనిరి. ౨

క॥ సూత భవద్వదనాంబుజ, గీతంబగువిష్ణుకథ ప్ర♦కృష్టప్రమదో
పేతమతిఁ వింటిమి దురి, తాతంకములడఁగె సఫల♦మయ్యెఁ జనియుఁ॥ 3

జగన్నాధునకు సుభద్ర భార్య యెట్లయ్యెనని యడుగుట.

తే॥ ఆజగన్నాయకుండు కృ♦ష్ణావతార, మనియు నవ్విగ్రహ♦త్రితయంబు కృష్ణ
బలసుభద్ర లటంచును♦ బల్కితీవు, తచ్చరిత్రంబు కడు నద్భు♦తంబు వినఁగ॥

సీ॥ సాధుసన్నుతజగ♦న్నాధునకును నాను, భద్ర భార్య యటంచుఁ♦బలుకు చుండ్రు
తగఁ గృష్ణుఁడునుసుభ♦ద్రయునన్నయును జెలి, యలుగాఁ బ్రసిద్ధ మా♦నందునిప్పు
డాకృష్ణునంశయే♦యగుజగన్నాధున, కానుభద్ర యు దెట్టు♦లయె భార
సంశయం బెంతయు♦ జనియించె నీవిమ, యంబు విస్పష్ట మా♦నట్లు దెలిపి

గీ॥ మము గృతార్థులఁ జేయుము♦ మౌనివర్య, నానుదేవకథాసుధా♦వర్ష మతుల
హర్షసంధాయకము తృప్తి♦యగునెయెంత, వినిన నది దెల్పవేమాకు♦వివరముగను॥

కం॥ అని శౌనకాదులడిగిన, విని సూతుఁడు బహుపురాణ♦విజ్ఞానమహా
త్వనితాంతఖ్యాతుం డి, ట్లని సెప్పె లియన్నదీ క♦లారవపణితిఁ॥ ౬

చ॥ ఘనమతులార మీకు మదిఁ♦ గల్గినసందియ మెల్లఁ దీరగా
వినిచెదఁ బూర్వకాలికము♦వృత్తము చాలఁగ గోప మైతన
ర్చినయది సుండు దీన నల♦శ్రీహరి కైనను గర్మబంధభో
గనియతి తప్ప దంచెరుఁగఁ♦గాఁ దగుఁ గాన నవశ వేద మా॥ ౭

చ॥ మును యదువంశమున్ బరమ•పూ ము సేయఁ దలంచి యాజనా
ర్దనుఁ డఖిలేశ్వరుండు మధు•రాపురిలో వసుదేవ దేవ
తనయుఁడు గా జనించి వసు•ధాతలరక్షణ మాచరించుచో
ఘనుఁడు మురారికిన్ సహజ • గా జనియించె సుభద్రయయ్యెడన్॥ ౮

క॥ ఆ వకిగర్భసుధా, పాథోనిధిచంద్రకళ సు•భద్ర నవవయః
ప్రాదుర్భవమున నయనా, హ్లాదకరాకారకలిత • యై విలసిల్లెన్॥ ౯

తే॥ సకియకును బాల్యమంతంత•జారుపాంచెఁ, గొనునింతింతసన్నము•గాఁగఁ జొచ్చె
బడఁతికఁతటయౌవనో•ల్బణము గాఁగఁ, బొటకరించుచు గుబ్బలు•బ్బురము సూపె

॥ తలఁపు లూరనిచిన్న•తనపుఁజూపులు మాని, సొలపుబిత్తరిచూపు • నూడ నేర్చె
మురిపెంపుటల్లారు•ముద్దుమాటలు మాని, బలుమిటారపుఁబల్కు • పలుక నేర్చె
మురువుఁ జూపెడునద్దు•ముద్దుచందము మాని, దినుసైనకులుకుటొ•ద్దికలు నేర్చె
వలమెరుంగనిభంగి • యగుచు నుండుటమాని, తవితీపు సెరజాణ•తనము నేర్చె

॥ ఆటకోరుతనం బల•వాటుమాని, గరువతన ముప్పతిల మెలఁ•గంగ నేర్చె
నంబుజదళాయతాక్షి బా•ల్యంబు సడలి, మించుతేజవ్వనం బంకు•రించు వేళ॥ ౧

తే॥ గనుఁగొనఁగఁ జందమామకుఁ•గళలు పదియు, నారటందురు దానిచిం•న్నారి మో
కళలచెలువంపుసొగ సెన్నఁ • గాఁ దరంబె, యింతిమోమున ందున•కేమి రము

క॥ తెలిదమ్మిరేకుమీఁదను, దొలఁగక యెలదేఁటి నిలిచి • తోఁచినయేనిన్
దులఁదుగుఁ గన్నులకన్నన్, గులుకుం జూపుసొల పెచటఁ • గొని తేవచ్చున్

తే॥ పొలఁ నాసిక యై యెల్ల•పూలఁ గలుగు, పరిమళానుభవస్ఫూర్తిఁ • బడసి చూ
గంధఫలి సర్వసుమనఃప్ర•కాండసౌర, భములు వలచుచు నేటికిఁ • బ్రౌఢిఁ గను

తే॥ అబలకెమ్మోవి ప్రతిబింబ • మన్చుధాత, బింబము సృజించెఁగా కేమి•విపులమ
మమునొడంగూర్పనేర్చె నే•మరియునందు, చేత నేబింబమను పే•ఁరెందెన యి

• వనితయౌవనశృంగార • వనమునందు, గలుగునడబావి యనఁగఁ బొ•
నచటికృత కాచలద్వి•యంబు కర•, బటువుచనుగవ్వరోయి ని• ్రముస

తే॥ జఘనమండలి సైకత•స్థలిని బోదలు, నవఁటిబోఁదెలు పెందొడ • లత
శాఖలు జంఘికలు బాల•కమఠపృష్ఠ, సమ మంచితములు ప ప•దములు చె

కం॥ పల్లవములు తత్పదసం, పల్లవవిజిఘృక్షుమాధ వసముద్దేశ
పొల్లసనమునఁ దపస్థితి, మొల్లం బై చెడి విరాగ మునఁగస టొందెన్.

॥ క న్నెత్త్రి చూచెనా కడుభయభ్రాంతయై, హరిణిదిక్కులు నూచి యటమటించు
నిలిచి మాటాడెనా కలఁగి గద్గదికతో, మదిఁ దారుమారగు మంజుఘోష
మైత్రిగ మెరసెనా మలఁగి వివర్ణయై, కంది గ్రక్కునఁ గాకఁ జెందుహేమ
నగుమొగం బెత్తెనా నొగిలి కాంతి దొరంగి, శశిరేఖ వక్ర యై సన్నగిల్లు

॥ పెండ్లొడలయందమొక కొంత పెడఁగుసూప, వాడియారంభయొక పార విడిగ్రుక్క
నచ్చెరలు గిచ్చరలు దాని పౌనుగనిన, నిలువుకన్నులఁగనఁగొన వలదె యెపుడు॥

సుభద్రను కృష్ణుడు వరునిగోరుమనుట.

కం॥ ఈరీతి నవోజ్జృంభిత, తారుణ్యవిలోకనీయ తాసముపగతా
కార యగుచు నవ్వికచాం, భోరుహదళనేత్రి మిగులఁ బొలుపొందు నెడన్॥

మ॥ ఒకనాఁ డామురదైత్యభేది ప్రియ మిం పొందంగఁ దా నిష్టగో
ష్ఠికలాపంబున నుండి యచ్చెలియలిన్ జేసన్న రావించి మ
చ్చిక మీరంగను గారవించి రుచిర స్మేరాననుం డై వినో
దకథాసంగతిఁ బ్రొద్దు పుచ్చుచుఁ బ్రమోదం బొప్పఁగా నిట్లనున్॥ ౨౧

తే॥ ఇంతికో నీకునిటఁ బెండ్లి యీడు వచ్చెఁ, దడవు సేయంగ రాదింకఁ దలిరుఁబోఁడి
మనసు కెక్కినరాజకుమారు నొకని, గోరుకొను మమ్మ నీ కొడఁ గూర్తు నతని॥

కం గారాబుఁజెలియలవు నీ, కోరిక యొడఁగూర్తు సిగ్గు గొనక కలతెరం
గేరుపడఁ దెలుపు మీ యన, నారాయణుఁ గని తప్రాలి నమితానన యై॥ ౨౩

కం॥ తలవాంచి బొటనవ్రేలున, నిల వ్రాయుచుఁ గురులు కేల నెగఁ ద్రోయుచు లే
మొలకనగవు కెమ్మోవిని, దులకింపఁగఁ గులుకుపలుకు తో నిట్లనియెన్॥ ౨౪

సుభద్ర కృష్ణుని నీవంటిభర్త కావలెనని యడుగుట.

ఆ॥ అన్న నాపయిన్ బ్రియంబున నీరీతి, నెలమి మెరయుపలుకు పలికి వు
చెలియ లనుచు ముద్దు చెల్లించి వాత్సల్య, మలరఁ గోరి ర్వ వలయుఁ జెమ్ము॥

కం॥ రూపున గుణమున శౌర్యక,లాపరిణతి నెల్ల తెరఁగులను నినుఁ బోలన్
జూపట్టెడు రాకొమరుని,నాపతిగాఁ జేయుమీ జనార్దన కరుణన్ ॥ ౨౬

తే॥ ఎల్ల తెఱఁగుల నినుఁబోలు వల్లభుండు, గలుగవలెనందుఁగడుఁ గోర్కి గలదు నాకు
నెలమి వీరంగ ముద్దుసెల్లించి నాదు,తలఁపు చేకూర్పు మన్న వాత్సల్యమలర॥

కం॥ అని వేఁడ మందహాసం,బునఁ దల పంకించి శౌరి ముదితం గని యి
ట్లనియెన్ భవద లషితం,బొనరును చేకూర్చు సద్గుణోత్తరయొపుడున్ ॥ ౨౮

కం॥ విను నాకు నేన సరి గా,కనయము నను బోల నుర్వి నన్యుఁడు గలఁడే
వనజాక్షి నాకు సములును,ఘనులును లే రనెడు శ్రుతిప్రకారము గాదే॥ ౨౯

కృష్ణుడు సుభద్రను మందలించుట.

కం॥ అనుజా వాత్సల్యంబున,గొనకొని నీకోర్కు లిత్తుఁ గోరుము టంటిన్
మును మించి నీదు వాంఛిత,మనుకూలము గాని చంద మైతోఁచెన్ ॥ 30

ఆ॥ ఆఁడువారిబుద్ధు లసురబుద్ధు లటంచు,నాడు వారిమాట లన్ప్రత మగునె
నీటఁ జేఁపకాల్లు నెమక వచ్చును గాని,యింతిచిత్తవృత్తి యెరుఁగ నగునె॥

కృష్ణుడు సుభద్రకు వరమిచ్చుట.

ఉ॥ వినను వత్సలత్వమున నాడితిఁ గోరిక లిత్తు నంచు నె
ట్లైనను నోఁ బ్రసక్త విషయం బిపు సమకూర్ప రామి నో
మానిని వేరుజన్మమున మామక మైతగునంశసంచితం
బౌనవతారమందు సతివై తగఁ బొందుము ప్సితార్థమున్ ॥ 3౨

శా॥ సామాన్యము గాక నష్టయిన నార్యారూపమం దెన్నఁ బ్ర
త్యక్షం బైనపుడంశమూర్తికిఁ ద్వదీయాంశాసమావేశయు
క్తక్షేత్రింబు కళత్రమయ్యెడు నయుక్తం బౌఁ గదా యొందుఁ బ
ద్మాక్షి సోదరదంప తీత్వకలనం బత ంతనింద్యంబుగన్ ॥ 33

ఉ॥ కోరఁగ రానికోర్కి యలికుంతల ధర్మ మెఱుంగ నేరమిన్
గోరితి వన జన్మ మొనగూడెడునప్పు వికారరూపమున్

గూరిన విగ్రహంబుల నం♦గుక్ జుమి లోకవిరుద్ధనిందితా
చారకృతాపరాధమున ♦ జారునె భోగ్యము గాక దోషముల్॥ ౩౪

ఉ॥ అది యటు లుండ నిమ్ము వన♦జానన యెల్లతెరంగులందు నా
కుఁ దులితుఁ డౌధనంజయుఁ డ♦కుంఠితశౌర్యపరాయణుండునుక్
మదనసమాన రూపనువ♦మానసుదంచితుఁ డెల్లభంగులక్
మదవతి నీకునుక్ దగిన♦నాధుఁడు వాని వరింపు మియె డక్॥

చ॥ అని వర మిచ్చి కూర్మి నెర♦యక్ ప్రియసోదరి గారవించి ఫ
ల్గునునకుఁ బత్నిగాఁగ నొడఁ♦గూరిచె నప్పుడు శద్వరాభియు
క్తి నిపుడు నీలశైలపతి♦కిన్ సతిగాఁగ సుభద్ర స్వాంశచే
నొనరెఁ బురాణగాధ గల ♦ దొక్కటి దీనికిఁ గారణంబుగన్॥ ౩౫

శివునకు బ్రహ్మహత్యకలుగుట.

॥ పూర్వకాలమున నం♦బుజగర్భునకు నహంకారప్రధాన మై ♦ భూరిమహిమఁ
బంచమవక్త్రంబు ♦ ప్రభవించె నప్పుడు, బ్రహ్మణ్యులైనట్టి♦పరమమునులు
విశ్వాధినాధుఁ డౌ♦విభుఁ డెవ్వఁ డని యడు,గఁగ నేనయని యహం♦కారవక్త్ర
మున సముద్ధతిఁ బలి♦కిన మహాదేవుఁడు, ప్రస్ఫుటక్రోధభై♦రవమహోవ

సీ॥ కారమునఁదోఁచి నిజపాణి ♦ తలవిఱివాతి, మించి యైదవమోము ఖం ♦ డించినంత
హస్తమున నంటుకొనియె న ♦ మ్మస్తకంబు,తద్విమోచనమునకు నా♦తండు గడఁగి॥

కం॥ ప్రాయశ్చిత్తంబడఁగిన,ధీయుతు లగుమునివరులు ప ♦ తీవ్రతచే భి
క్షాయుక్తిఁగనిన ముక్తం,బై యిది పోవు నని చెప్ప ♦ రం కృతుఁడై॥

తే॥ అ లలోకకుటుంబిని ♦ యాదిలక్ష్మి హరికి ననపాయిని పతివ్ర ♦ తాద గాన
నామెచే భిక్షగొనిన నీ ♦ యఘముపాయు,ననుచు వైకుంఠమునకేగెనభవుడపుడు॥

విష్ణువు లక్ష్మిని శివునకు భిక్షయిడవద్దనుట.

తే॥ ఆతనియుద్దేశమెఱిఁగి ♦హరియుఁగమల, నిలయఁగనియిట్లుపల్కెమా♦ నిహరుండు
బ్రహ్మహత్యావినిష్కృ ( ♦ బడయఁ గోరి వేగనిటవచ్చునీచేత ♦ భిక్షఁ గొనగ॥

తే॥ హస్తనిర్ముక్తయై బ్రహ్మ ♦ హత్యయిచటఁ, బడియె నేని మహాశక్తి ♦ ప్రతిభదా
కడఁగియీలోకమెల్లభ్రమిం♦గంగఁదివురుఁ, జెడుగుఁ గలిగించునని వేర♦ చెప్పనేల॥

తే॥ కాన నీ వాహారుండు భి, క్షకరు వేర నటమటము చేసి తొలఁగుమె • స్లైననింట
లేదనుచుఁ జెప్పుమనుపని • లేనిపనికి, బోవఁగా నేల యాపదఁ • బొంద నేల॥

వ॥ అని యిట్లు వాసుదేవుం డుపదేశింపఁ గమలాలయయును దదుక్తమార్గం
బున నడచునది యైయుండె నప్పుడు శంకరుండును. ౪౩

మ॥ చని వైకుంఠము సొచ్చి భైరవుఁడు భిక్షాందేహి యంచు యాజనా
ర్దనుసౌధాంగణమం దనిల్చి పలుకన్ • దద్వాక్య మాలించి యా
వ్వనజాతాలయ యానతిన్ జెలులు దే • వా! శ్రీకుతో వాంగతా
యన శంభుం డిలు సేరెఁ గ్రిమ్మరియుధా • యాతంబుగా నయ్యెడన్. ౪౪

తే॥ మరలి కాన్నాళ్ళకరుదెంచి • మధువిరోధి, మందిరాంగణమునఁ బనిల్చి • మదనవైరి
ఘనరవమున భిక్షాందేహి • యనఁగ మునుప, టట్లు శ్రీయింట లేదని • రామె చెలులు॥

కం॥ ఈరీతి మూఁడు నాలుగు సారులు సనుదెంచి యెపుడు • సదనంబున నా
సారసగేహిని లేదను, ధోరణి నే పలుక వినుచు • ధూర్జటి కినుకన్॥ ౪౫

శివుఁడు లక్ష్మిని శపించుట.

కం॥ కను తెరగ్రిఁ జేసి లేదా, వనజాలయ యింటఁ జపల • వర్తనయగుచున్
జనెనా మంచిది యట్లనె, చనుఁగాక యపన్నఁ జెలులు • సభయ లయి వెసన్॥

కం॥ చని యంతఃపురి భార్గవి, గని యాభైరవుని కోప • కలనం బెరిగిం
చిన సభయ యగుచు సరభస, మున భిక్షముఁ గొనుచు వచ్చె • ముంగిటికి వెసన్॥

తే॥ వచ్చి యడుగులు దడఁబడ • వందనంబు, సలిపి కడుభక్తి మెరయ భై • క్షంబొసఁగి
ఈశ యపరాధమయ్యె క్ష • మింపుమాఁడు, వాఁ రెరుంగుదురే భవ • ద్రూపభవంబు॥

కం॥ అని వినత యగుచు వేఁడినఁ, దనయంతర్దృష్టి నామె • తప్పవ్యక్తం
బని యెఱిఁగి నెమ్మనంబునఁ గనికర మొంతయును గదురఁ • గా నిట్లనియెన్॥

ఉ॥ ఇందిర నాయెడన్ గపట • మిట్లొనరించుట నీస్వభావ మా
చందము గాదు నీపతి యొ • సంగిన యానతి చేసి తీవు నా
డెందము గంది తిట్టితివ • డిన్ వినుమా తగుపల్కు సత్యతన్
బొందును నీకుఁ జాపలము • భూస్థలి నెందు స్వభావధర్మమా॥ ౫౦

ఉ॥ ఎత్తినకాలె గాని యొక • యించుక నిల్కడలేక మాటలో
హత్తుట రిత్త యాటయును • నై చరియింపుము చంచలత్వమే

వృత్తిగ నిట్లు గాక నొక • పీరిడి యింటను ంటవెట్టి నీ
వెత్తరి నేనియుఁగ్ గదల • వసుధఁగ్ విపరీతవైఖరిగ్ ॥ ౫౨

॥ జగతి నీచాతినీచానుసరణకరణిఁ, జలనధర్మము నీయం దొసంగుఁ గాత
నీవు గదిసినవిజ్ఞాననియతి సడలి, ప్రాజ్ఞుఁ డైనను నజ్ఞుఁ • బడయుఁ గాత॥

తే॥ ఇట్లు గమలాలయనుశపియింప నామె, చెలులు హాహారవంబులు • నేయు దెరిఁగి
సరగ విచ్చేసె నచటికిఁజక్రధరుఁడు, శూలధరసాంత్వనక్రియాశాలి యగుచు॥ ౫౫

వ॥ అప్పుడు.

కం॥ పరమ పతివ్రతలకు శే, ఖర మగువిశ్వజనయిత్రి • కమలాలాలయచే
గురుభిక్షు గొనుట హత్య, దురిత మడఁగ విధిశిరంబు • దొలఁగెం జేతక్ ॥

బ్రహ్మహత్య శక్తి యగుట.

కం॥ నారకరనిర్ముక్తం బై, ధరణింబడి విధిశిరం బు • దంచిత మాతృ
ద్భరమున నోరు దెరచి కడు, మెరపెరవడ భువనచయము • మిగ్రంగందివి రేక్ ॥

కం॥ అపుడారభసము కనుఁగొని, శిపివిష్ణుఁడు వెరవగాఁ గు • శేశయనాభుం
డుపగతుఁడై యడుగుము వర, మిపు డిచ్చెదనుడుగు మిఁక గ్రసింపక జగముల్ ॥

తే॥ గడచె నష్టాదశమహాయుగంబులిట్లు, భైరవుని చేత నంటినప్పటియునుండి
ఘోర మైనట్టిక్షుధ నాకుఁగూరెనిపుడు, దాని ర్పంగవలయును గానవినుఁడు॥

బ్రహ్మహత్యాశక్తికి వరమిచ్చుట.

తే॥ అ లజగములు నిలుచు మీయందె గాన, మిమ్మునిరువురనిటఁ బట్టిమ్రింగవలయు
నిదియె నాకోర్కి దీని మీరిచ్చిరేని, మేలు కాకున్న నేఁజేయఁజాలుదు నిది॥

మ॥ అనినక్ గేశవుఁ డిట్లు పల్కె భవదీయంబైనతుద్బాధ దీ
రనుపాయం బొడఁగూర్తు నోర్మి చెలువారక్ నీవు వింధ్యాద్రికిక్
జని యచ్చో నిలు వింధవాసిని యనక్ • సంప్రీతిఁ గొల్వం జనుల్
ఘనతక్ భక్తజనానుపాలనజిష్ణుత్వ యుక్తవై యంతటక్ ॥ ౬౧

కం॥ ఇరువదియెనిమిదియవ ద్వా, పరమున భూభార మడఁప • బనివడి యేను
ర్వ్యర నవతరించి పటుసం, గరము ఘటింపింతు ధరణికాంతులలోనక్ ॥ ౬౨

కం॥ పదునెనిమిదియుగములు గా, నొదవిన పెల్లాక లెల్ల • నుడిగించుటకుక్
బదునెనిమిదియక్షోహిణు, లదయత బలియిత్తు నీకు • నాహవభూమిక్ ॥ ౬౩

ఆ॥ అనుచు వర మొసంగి • యమ్మహాశక్తిని, వింధ్యనగమునందు • విడిది సేయఁ
బనిచె నదియె ద్రుపదు•పట్టి యై హోమాగ్ని, కుండమున జనించెఁ•గూతురగుచు॥

కం॥ ఆపాంచాలతనూభవ, భూపాలవరులకుఁ బాండు•పుత్రులకుఁ గులో
ద్దీపకులకు సతి యగుచు మ, హాపాతివ్రత్యవిభవ•యై విలసిల్లెన్॥ ౨౬

వ॥ ఇట్లుండు నంత.

భారతయుద్ధప్రశంస

మ॥ ధృతరాష్ట్రాత్మజుఁ డౌనుయోధనుఁడు కుం•తీపుత్రులన్ ద్యూతసం
గతినోడించి ధరాతలం బఖిలమున్ • గైకొన్న ధర్మానువ
ర్తిత నోర్చిన్ విపినాధివాస మట పై • నజ్ఞాతవాసం బొన
ర్చి తగన్ బిమ్మట నర్ధరాజ్యమున కై•ర్థిన్ గోర్క గాలించినన్ ౨౭

చ॥ ఘనతరలోభదూషితుఁడు • కౌరవనాథుఁడు సంధిమార్గమున్
మొనయక వాడిసూదిమొన • మోపినమాత్రము భూమి వారి
కనుడును వారు వీరును మ•హారణకాంక్ష నుపక్రమించి పై
కొని రిలఁ గల్గుభూపతులు • గూడిరి యయ్యిరువాఁగులందునన్॥ ౨౮

తే॥ అవని బహుభారపీడిత • యగుచు వేఁడ, భూమిభారావతారణార్థ•ముగ జనించి
నట్టివను దేవసూతి యం•దర్జునునకుఁ బూనె రథచోదకత్వ ము•ప్పుడు గడంగి॥

ఆ॥ ఆపదలు దీర్చి సంపద • లందఁ జేయఁ, దాన యేడుగడంచుఁ జి•త్తమున నమ్మి
యున్న పాండుతనూజుల • ననుగ్రహణము, నందుఁ బడతుండఁ గాపాడ•నవధరించి॥

కం॥ పదునెనిమిదియక్షోహిణు, లుదితక్షుద్ధధీర శక్తి • కొసఁగుటకొరకున్
గదనక్షోణి నిజాప్తులఁ, బ్రిదికింపఁ దలంచి శౌరి • పనివడి యుంతన్॥ ౩౧

కం॥ ఒకనాఁడు రహస్యంబున, బకవైరిన్ బిలిచి యుచిత•వచనరచన మ
చ్చిక ముచ్చటాడి వసుదే, వకుమారుండటఁ బ్రసంగ•వశమున ననియెన్॥ ౩౨

. మునకు కృష్ణుఁడుపాయము సెప్పుట.

ఉ॥ వింటె వాయుపుత్ర యొక•వింత భవత్పతియాజ్ఞ నేని తాఁ
దొంటిభవంబునం దఖిల•దుష్టవిదారిణి యైనశక్తి సు
మ్మంటివితత్తున్ జగము • లన్నియు గ్రమింగఁ గడంగి మాన్పని
ప్పుంటికిఁ బుట్టె నియఖిల•భారతసైన్యములన్ గ్రసింపఁ గన్॥ ౩౩

కం॥ మొదటి పారిపారులపరమున, సుదితతద్విధ లప్పు డాఁచి యుండి ధరిత్రిన్
బదు నెనిమిది యక్షోహిణు, లదయత గ్రసియింప నిప్పు డవనిజనించెన్॥ ౭౪

కం॥ వినుమా శక్తి గ్రసింపఁగఁ, గొను నక్షోహిణుల మీరు గూడ ననికి నే
ననిశము మిము రక్షింపఁగ, మనమున వెర వరయు చుందు మారుతతనయా॥

ఉ॥ నీ వొక రాతిరిం గపటనిద్రవహించి పరీక్ష సేయుమా
దేవి నిశీథవేళఁ బరతెంచి భయంకరశక్తిసంఘ సం
సేవిత యై శ్మశానమునఁ జిందులు ద్రొక్కుచు నుండు నష్ట నీ
వావిధ మెల్లఁ జూచి భయమందక కెరుంగనియట్లు క్రమ్మరన్॥ ౭౬

కం॥ చనుదెంచి కేళిమందిర, మున నుండుము శక్తి సౌమ్యముగ ద్రౌపది యై
చనుదెంచునపుడు బలమున, మనోజకేళిఁ దనియింపు మా యవ్వేళఁదన్॥ ౭౭

కం॥ నప్పుడు సర్వలోకని, దానం బగు నాదుశక్తి తథ్యముగా నీ
లోనన్ జొనుపుదు నపరిమి, తానందము నొందుఁ దృప్తయై శక్తి కడున్॥

కం॥ సంతృప్తయైనశక్తియుఁ, సంతోషముతోడ వర మొసఁగుదు నడుగు నీ
యంతర్వాంఛిత మను నీ, వంతట మాయేవురకును నభయం బనుమీ॥

కం॥ ఇది నీచేఁ గావలసిన, యది వదను ల కసాధ్య మగుఁ గావున నీ
మదిఁ గొంకు లేక సాధిం, పఁ దగు మదుక్తివిధ మెల్ల భావించి యనన్॥ ౮౦

కం॥ మురవైరివాక్యపద్ధతిఁ, గరువ సుతుఁ డొక్కనాఁడు కైతవనిద్రా
పరుఁడై తనసతిచర్యలు, పరీక్ష యొనరించి చూచె భయ మెదఁగొనకే॥ ౮౧

వ॥ అప్పుడు. ౮౨

ముదు శక్తి కృత్యములుచూచుట.

మ॥ కనియెన్ వాయుసుతుం డనేకవిధకంకా స్ఫురద్భకర
ధ్వనికృద్ఘుర్ఘురికపాలకుండలరటత్కారామిళద్భూమని
స్వనన్నృత్యద్భహులోగ్రశక్తిపరిషత్సంసేవమానన్ లల
ద్ఘనదంష్ట్రాంకురదుర్నిరీక్ష్యభయదాకారోగ్రలాడంబరన్। ౮౩

కం॥ భైరవు లెనమండ్రు మహో, గ్రారవభేతాళ మునవధిభయదా
కారోగ్రశక్తిలోకముఁ, జేరి యుపాసింపఁ బభుతఁ జెంది వసించెన్॥ ౮౪

మ॥ అపు డాశక్తి సమూహముల్ భరతసైన్యప్రాగ్ర్యరోమోద్భవ
క్షపణ డసుఁ బొల్లు పంచికొనుచున్ • గాలించుకోలాహలం
బపరిజ్ఞేయభయావహం బగుచు దేహాంబెల్లఁ గంపింపఁగా
విపులత్రాసభరంబునన్ మగిడి యుద్వేగంబుతోడన్ జనెన్ ॥ ౧౫

కం॥ పదములు తడఁబడఁ గడువడి, సదనమునకు వచ్చి ఘోరసందర్శనస
వ్యథమై చిత్తము బెదరఁగఁ, బదపడి యొకభంగి శయ్య • పై వసియించెన్ ॥

ఉ॥ అప్పుడు సామరూపధర • యై వనజానన కృష్ణశయ్యపై
జొప్పుగ వచ్చి సంతత వనజోదరు వాక్యము సంస్మరించి తా
నప్పవమాననూతి కుసుమాయుధసంగరసంప్రవిష్టుఁ డై
యొప్పువు బోఁడి తృప్తి యగునట్లొనరించె బలంబు పెంపునన్ ॥ ౧౭

ఆ॥ సకలలోకభారసహమైన తనతేజ, మనిలతనయునందుఁ • జొనిపెఁ గృష్ణుఁ
డధికతేజుఁ డగుచు నవ్వాయుజుఁడు మహా, శక్తి తృప్తి నొందఁ సలిపె రతము॥

కం॥ మరుకేళితృప్తి నొందినఁ, బరవశ యై సుఖనిలీనభావ యగుచు నే
వర మిత్తు నడుగు మనుచున్, బరమోత్సాహమునఁ బలికెఁ • బావనితోడన్ ॥

ద్రౌపది భీమునకు వరమిచ్చుట.

కం॥ వరమిత్తువేని మాయే, వురి నీసంగరమునందుఁ • బోరి వుచ్చక నీ
వరయుము కృప నభయంబిడి, సర రుహనేత్రి సుప్రసన్నాశయ వై ॥ ౨౦

కం॥ అని పలుమఁ వేఁడికొనన, వ్వనజానన పల్లెయని యొఁ • బదపడి ప్రకృతిన్
గని తనపౌరపాటునకును, మనమున విభ్రాంత యగుచు • మానిని యంతన్ ॥

చ॥ కరువలిపట్టి నూచి యనెఁ • గారణ మేమి యిటు వునన్ను నీ
పరముడుగంగ ఖేద మగు • వైఖరి దోఁచెడు నేఁడు నీయెడన్
సరసిజనాభురాచన పానంగెను నేఁ డెరిగింపునిక్క మీ
పరమరలాడి తేని కుల • మారడివోవ శపింతు నియెడన్ ॥ ౨౩

చ॥ అన భయమంది వాయుసుతుఁ • డంగనతో ననె నేఁడు దేవ
తనయుఁడు నాకు దగువిధం బలంబు నెరుంగఁ దెల్పి యీా

యనిఁ బడ కుండ సోదరుల • నైదుగురిన్ బ్రదికింపు మంచు నిన్
జనవున వేఁడు మంచు నను శాసన మిట్లొనరించె నావుడున్ ॥ ౯౩

ద్రౌపది కృష్ణుని శపించుట.

చ॥ కనులెద నిండ మాధవునిఁ • గన్గొని సోదరి యంచు వాని నీ
మనమున నించుకేని యను•మానము నొందక నీదు తేజమున్
జొనిపితి వెంతయున్ బవన•సూనునిలోఁ గపటంపు నైజమై
తనరెడునట్టి నీదు చరి•తం బుచితంబె సురాసురాంతకా ॥ ౯౪

కం॥ చేస్సిన కర్మఫలంబులు, బోసేయక తీరునే ప్ర•భున కైనను నీ
వీసేఁత భవాంతరవి, న్యాసతఁ జెలియలికి సగఁడ • వై యుండు మిఁకన్ ॥

ఉ॥ వారక నాయెడన్ గపట•వర్తనఁ బూనితి గాన దీన నీ
వారయ దిక్కు లేక గహ•నాంతరమందుఁ గిరాతబాణపా
తోరుతరోపఘాతమున • నొంది జుగుప్సిత మైనతీరునన్
ఘోర ప్రజావు చావుమని • కోపము మీరఁగఁ దిట్టె నాతనిన్ ॥ ౯౫

కం॥ ఈదేహస్థితియుతంబుగ, నాదట మూర్త్యంతరంబు • నంది సుభద్రన్
సోదరి నిజపత్నిఁగఁ దా, మోదర గ్రహియింపు మనుచు • ముదిత శపించెన్ ॥

చ॥ అది విని కృష్ణుఁ డిట్లనియె • నక్కట నీవిపు డేమి త్రవ్వితీ
పొద లెడు తిట్టు తిట్టి పువు•బోఁడిరో కాఁ గలకార మిట్టిదై
యొదవె సుభద్ర కోరె నిది • యుగ్మలి కే వర మిచ్చితిన్ జగ
ద్విదితము సచ్చరిత్రము ప•విత్రము సంశయ మొంద నేటికిన్ ॥ ౯౬

కం॥ పురుషుండ నేను బ్రకృతియొ, పరికింపఁగ స్త్రీస్వరూప•ప్రకృతిపురుషయో
గరహస్యము సుమి విశ్వ, ప్రరోహకారణము శ్రుతిశి•రఃకథితం బౌ ॥ ౯౭

॥ నెలఁతరో విను మేను • నిర్గుణుం డనునిరం, జనుఁడ నస్సంగుండ• సాక్షి మాత్రుఁ
డనునాదు సాన్నిధ్య•మున జడప్రకృతిబ్బం, హణ మొంది యీవిశ్వ• మై వెలుంగు
నరయుమ యతేజోంశ ప్రవేశంబు, చేఁ జిదాభాసుండు • జీవుఁ డగును
నఖిలభూతసముండ • నగుట నా కెపుడను, జ్ఞాపరిహారముల్ • సంభ వంప

॥ నిట్లు గావున భ్రాతృపు•త్రాదిభావ, మెల్ల నీదేహసంబంధ • మింతె గాక
యాత్మ భేద మొసఁగునే • యంబుజాక్షి, యిది యెరుంగమిఁ బలికితి•విట్లు వు ॥

వ॥ అని ద్రౌపది వాక్యంబులు గీటునం బుచ్చి యాభక్తవత్సలుం డాత్మీయ భక్త ప్రాణరక్షణంబువలనం బరితుష్టుం డయ్యె నదనంతరంబున.

॥ భారతయుద్ధంబు • ప్రాప్తమయె ను బదు, నెనిమి దక్షౌహిణు • లౌనతెవారి
వీరిబలంబులు • విక్రమో న్నతులు , భీష్మద్రోణకర్ణులు•శల్యుఁడును గ్ర
మముగ సైన్యేశు లై • యమరి యష్టాదశ, దినములు కలన వర్తించి రందు
మార్జునులు సముద్ధామబాహాశక్తి, మీరసి మర్దించి ర•మిత్రసేన

గీ॥ మిగులు బలమునశ్వత్థామ•దెగి వధించె, కడకు నుభయసైన్యంబులు•గలనఁగూలె
పాండవులుగృష్ణసాత్యకు•ల్బదికిరిందుఁగృపుఁడుఁగృతవర్మద్రౌణిమి•ళ్లిరియందు.

తే॥ కాలచోదితమైయదు • గణముదెగి ప, రస్పరనిరూఢసంప్రహా • రముల సమసె
నటువి నీకాంతముగనుయో • గాప్తి నున్న, వ్యాధుడొకడమ్ముచే గృష్ణు • హతు
నిజేసె ॥

తే॥ ద్రౌపదీశాపవిధ మ • దధ్యమయ్యె, నవల ఫల్గునుఁడే తెంచి • వారియవస్థ
గాంచి శోకించి యపుడు సం • స్కారమిచ్చె, పొంగి జలరాశి ముంచి గ్రా • 
మో యె దనువు॥

జగన్నాథావతారము.

కం॥ కడలిఁ బడి కృష్ణదేహము, వడిదరఁగలఁ గొట్టికొనుచు • వచ్చి కలియుగం
బడరినయెడ బూర్వాంబుధిఁ బడివచ్చెన్ నీలశైల • ప్రాంతంబునకున్ ॥

కం॥ ఇంద్రద్యుమ్ననియానతి, నింద్రుని శిల్పి చనుదెంచి • హితమతితోని
స్త్రింద్రార్చ విగ్రహములు పేంద్రుని రచియించునప్పు • డీశునియాజ్ఞన్ ॥

కం॥ వననిధిఁ దోఁచినకృష్ణుని, తనుసంధులు దెచ్చి గూఢ • తమముగనందున్
జొనిపి హరివిగ్రహంబులు, పొనరించి యొసంగెనపుడు • భూమీశునకున్ ॥౧౦౭

సుభద్రను జగన్నాథునకు భార్యగా జేయుట.

తే॥ ఆసుభద్రకు హరియిచ్చినట్టివరము, ద్రౌప శాపమునుఫల • రూపమొంది
యాజగన్నాథునకును భార్యయయితోచె, నాసుభద మహిమను• లారవినుఁడి॥

॥ ఇది జగన్నాథునకు బ • యైసుభద్ర, పొసగుటకుగల్గినట్టి • పూర్వగాథ
యధికగో ము నివ్వ • త్తాంతమెల్ల, దెలిపితిని మీకునివ్వేళ • దెల్లముగను ॥

# జగన్నాథీయము

వ. అనియిట్లు సూతుండు సుభద్రా కళత్ర కారణంబెఱింగించిన విని ప్రహృష్ట చిత్తులయి మును లతనికిట్లనిరి. ౧౧౦

తే॥ పరఁగుకృష్ణావతారానుభావ ఘనము, నీజగన్నాథుఁ జెప్పెద • వితఁడుబుద్ధ
దేవునవతార మనుచు ను•తింతు రార్యు,లవ్విధం బేమి? సందేహ• మపనయింపు॥

వ॥ అని యడిగిన సూతుం డి ట్లనియె.

## బౌద్ధావతారము.

సీ॥ అవని యధర్మోప•హత మై జనంబులు, క్షుద్రదైవతపూజఁ • జొచ్చి. జంతు
హత్యలు బలులను • నాసురవిధిఁ జేయు,చును తమోనిరతు లై • వనరుచునికి
జనులను సత్యవి•శ్రాంతులఁ జేయఁగా, హరిబుద్ధరూపుఁ డై • యవతరించె
కపిలవస్తునగరా•ధిపతిశుద్ధోధనుం, డనుభూమిపతికి మా•యాఖ్యసతికి

గీ॥ నద్భుతావహజన్ముఁ డై • యఖిలసురలు, వినుతి సేయఁ గ్రమంబున • వృద్ధిఁ నొందు
నధిక వైరాగ్యమునఁ బ్రభో•ధాతిశయము,గాంచిబుద్ధుఁడనంగవి•ఖ్యాతినొందె॥

సీ॥ అఖిలభూతంబులందు ద•యానిరూఢి, యమరఁ గల దైన హాని సే•యకపరోప
కారశీలత నంచితా•చారనిష్ఠ, మెలఁగి మనుజుండు ముక్తుఁడై వెలయుననుచు

గీ॥ ఆత్మసిద్ధాంతపద్ధతి • ననుసరించి, జనులనందరఁ ద్రిప్పి దు•స్తంత్రఘోర
మతములజయించియాత్మీయ•మతమునిల్పి,జగములకు మేలొనర్చె నా•చక్రధరుఁడు

ఆ॥ అట్లు బుద్ధుఁ డైన•హరి తదీయావతా,రాంతమున స్వ యం•మైనయంశ
కలియుగమున నాజ•గన్నాథమూర్తి యం, దచ్చు పడఁగ నిలిపి • యరిగె దివికి॥

ఆ॥ సర్వజనులు మోక్ష•సామ్రాజ్య మొందంగ,సములు భ్రాతృభావ•సహితులగుచు
నొకరి కొకరు చాల • నుపకారశీలురై, మనఁగ వలయు సాధు•మార్గనియతి॥

కం॥ అనుసూక్తి బౌద్ధమతమున, కనయంబును ముఖ్యధర్మ • మగుటను జను లె
ల్లనువర్ణ ధర్మ భేదము, లెనయక మనుమనుట బుద్ధు • నీప్సిత మగుటన్ ॥ ౧౧౭

తే॥ ఆజగన్నాథునందు బు•ద్ధాంశ గలిమి, దత్ప్రసాదము వర్ణభే•దంబు లేక
రమణ గైకొందు రెల్ల వ•ర్ణములవార, నియమమందు నేటికి • నెసఁగుచుండు॥

తే॥ వర్ణభేదంబుదలఁచియె•వ్వార లచటఁ, దత్ప్రసాదము గ్రహింపఁ•దడయువారు
వార లాచంద్రతారక•నారకప్ర, యాతనల నొందువారు సం•త మిద వినుఁడి॥

# జగన్నాథీయము

ఉ॥ ఎండిన గుల్లిసన్ జెడిన ♦ నేకట నొందినఁ గంటి కింపుగా
నుండినఁ దత్ప్రసాదము శు♦భోన్నతి సేయుఁ బరిగ్రహింప మూ
ఢుం డెవఁడేని దానిని గ♦దుక్ వెగ టొంది గ్రహింప కుండునా
తం డిహాముక్ బరంబు సెడి ♦ దైన్యము నొందుఁ గృతాపరాధుఁ డై॥ ౧౨౧

శా॥ నీలాద్రీశునియందు నాసుగతుఁ డు♦న్మీలత్ప్రభావాఢ్యుఁ డై
పోలన్ నిల్చుట బౌద్ధధర్మముల సం♦బోధంబు తత్త్రైత్రిమం
దోలిం గల్గెడువర్ణధర్మనియమం ♦ బొక్కింత పాటింప కే
వేళన్ సర్వసమత్వలక్షణము భా♦వింపంగ నౌ నచ్చటన్॥ ౧౨౨

వ॥ ఇది జగన్నాథునందు బౌద్ధావతారసంప్రవేశంబు గలదనుట కుపలక్షణంబు గావున నీలాద్రీశునిబౌద్ధావతారయుక్తునిఁగా నెరుంగునదియని చెప్పిన బ్రహర్ష సమేతు లై శౌనకాదు లారౌమహర్షణి నభినందించి హరికథాశ్రవణవిధానకృతార్థంమన్యమానమానసు లై రని చెప్పుటయును.

॥ శాలివాహనశక ♦ సంవత్సరంబునఁ, బదియు నెన్మిదినూర్లు ♦ పైనమున్ప
దారగువర్తమా ♦ నానందవత్సర, వైశాఖపూర్ణిమా ♦ వసరమునందు
నవ్వడాలినివాసుఁ ♦ డగుశ్రీ జగన్నాథు, సమధికశుభరథో ♦ త్సవమునందు
నడవిసాంబశివను ♦ మాహ్వయుండును నంద, గిరివేంకటప్వాఖ్య ♦ బరగుమేను

॥ కలిసి శివవేంకటాఖ్య సం♦తక్కవులనంగ, శ్రీవడాలి జగన్నాధ ♦ దేవునెదుట
హితమతినిజగన్నాథీయ ♦ కృతిరచించి, యొసగితిమిశాశ్వతస్ఫూర్తి ♦ యొసగునట్లు॥

॥ పరమహంసయుఁబరి ♦ వ్రాజకాచార్యుండు, పురుషోత్తమానంద ♦ పూర్వకావ
ధూత యీదేవునిం ♦ దుఁ బ్రతిష్ఠగావించి గ్రామంబు నగ్రహా ♦ రముగ దెచ్చి
తాఁగొన్నిదినములు ♦ దృఢభక్తిఁబూజించి తనవెనక్గ్రాసుపా ♦ లనము భూమి
పతులకు స్వాధీన ♦ పరచి తా నేగె నవ్వల రాజ ధూర్వహు ♦ లల యతీంద్రు

॥ కట్టడల నెల్ల పాలించి ♦ గడపుచుండి, రంత నాంగ్లేయపాలకు ♦ లరసి దీని
పాలనమ్ము స్వదేశ భూ ♦ పతుల చేతి, కిచ్చు టవసరమగునని ♦ యెంచి యపుడు॥

॥ గురజ జమీన్ దారి ♦ గోల్పోయియున్న శ్రీరాజాదిబిరుద వి ♦ భ్రాజితుండు
కమదన పాపయా ♦ ఖ్యాతుఁడౌ గతజమీన్ దారున కిచ్చిరీ ♦ ధర్మకర్తృ

తనుపద్విభునియనం ♦ తరము దత్పుత్రుండుఁ, దద్భ్రాతృ పుత్రు లు ♦ త్తమవిధమున
బాలించి రవ్వల ♦ నోలి దేవస్థానపాలన సభ్యుల ♦ పరముఁ జేసి

గీ॥ రాసభికులకు ప్రతినిధి ♦ యగుచు దీని, నిర్వహించెను పిన్నమ ♦ నేనియచ్చ
యాఖ్యుఁడవ్వలప్రతినిధియయ్యెకొల్లి, శీతయాఖ్యుండు వినయ వి ♦ ఖ్యాతియుతుడు॥

॥ కొల్లి-తయసమా ♦ ఖ్యుఁడుపడాలి క్షేత్రి, జగదీశ్వరప్రతి ♦ ష్ఠాప్రకార
బోధకంబగుజగ ♦ న్నాథీయకృతినిశ్రీ, స్వామిసన్నిధినివి ♦ ద్వద్వరేణ
యుతసభఁజదివిశ్రీ ♦ యుతప్రబంధకవి పం, చాననబిరుదస ♦ మన్వితముగు
సౌవర్ణభూషఁప ♦ త్సంసద్విబుధులస, మక్షమందొసఁగెంద ♦ దనుమతమున

గీ॥ మాకుశివవేంకటాహ్వయ ♦ మహితులకును, శ్రీజగన్నాథుకరుణావి ♦ శేషమునను
బ్రిధితమగుచునాచంద్రతా ♦ రకముగాను, దీయకృతితల్లజంబుప ♦ ర్ధిల్లుఁగాత॥

ఆశ్వాసాంత్యము.

శా॥ ఉద్యద్భానుసహస్ర సన్నిభ విభా ♦ ప్యాధోల్లసత్కౌస్తుభ
ప్రోద్యద్భూరి భుజాంతర స్థగితభూ ♦ పుత్రీకుచద్వంద్వభా
కృద్యోలిప్త మృగీమదాంక విసర ♦ త్సౌరభ్య విభ్రాజితా
ఖ్యద్యోతాన్వయ వార్ధిచంద్ర త్రిజగ ♦ త్కల్యాణ సంధాయకా॥ ౧౨౮

పుష్పగుచ్ఛబంధము.

చ॥ పరమరమారసజ్ఞపద ♦ పద్మపతత్సురవార ధీరతా
కరవర నీరదాభ కన ♦ కప్రకటాంబర సారగీర సో
త్తరవరసారద ప్రత త ♦ తక్షత మానిజనాజవంజవా
చిరతర శూరతాఢ్యశివ ♦ శిష్ట శివంకర భూరమారతా॥ ౧౨౯

కం॥ అథ్రిధునీజనకపదన, దభ్రిదయారస నిదాన ♦ దరహీర లస
చ్ఛుభ్రాంశు నిర్మల యశో, విభ్రాజిత సూర్యపుర ప ♦ విత్ర నివాసా॥ ౧౩౦

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీకరసమస్తసుగు ♦ ణాకర జగత్త్రితయ ♦ సేవితపదాంబుజ వి ♦ లాసా
నాకసద స్తుత స ♦ మంచితచరిత్రినమ ♦ దభ్యుదయకారణ వి ♦ కాసా

## జగన్నాథీయము

ప్రాకటదయావిభవ ♦ పాలితసుధీనికర ♦ భక్తజనదుష్కృత ని ♦ రాసా
లోకచయరక్షణ వి ♦ లోల శశిభాస్కర వి ♦ లోకయుతమంగళ మ ♦ హాశ్రీ॥

గద్య.

ఇది శ్రీమద్వృషాకపికృపాకటాక్ష పరివర్ధితసహజ సారస్వతసమ్పాది
తప్రబంధ కవిపంచానన బిరుదాభిరామ విశ్వామిత్ర బ్రహ్మర్షి
సంప్రదాయాడవి నందగిరి వంశాబ్ధిసోమ సహజసాహ్వా
దమహోద్యమ సాంబశివ వేంకటప్ప రాయ
కవిలలామ వినిర్మితంబగు శివవేంకటీయ
గ్రంథమాల యందుఁ ద్వితీయ
పుష్ప మగు జగన్నా
థీయమహాప్రబంధ
మునఁ సర్వం
బును
చతుర్థాశ్వాసమును
సమాప్తము.
శ్రీ





# శుద్ధపత్రిక.

—:o:—

## కవిజీవితము.



| పుట. | పద్యసంఖ్య. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| I. | | ౨ | సంస్పృష్ట | సంస్ప్పృష్ట |
| | | ౩ | ద్వి యము | ద్వితయము |
| | | ౧౩ | జిన్నఁదన | జిన్నతన |
| | | ౧౮ | శైశవాల | శై వాల |
| II | | ౪ | చిన్నఁదనంబు | చిన్నతనంబు |
| III. | | ౮ | చిన్నఁ | చిన్న |
| | | ౧౦ | దనము | తనము |
| IV. | | ౩ | యణోద్భుణాత్త్ర | యణాద్భుతోత్త్ర |
| | | ౪ | కాంధ్రీకరణమగు | కాంధ్రీకరణము |

## గ్రంథము.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | కాంక | గాంక |
| ౨ | ౪ | ౩ | ద్యోగము | ద్యోతము |
| | ౫ | ౨ | నాలుగిటన్ | నాలుగిఁటన్ |
| ౩ | ౧౧ | ౪ | మురవన్ | మురహిన్ |
| ౫ | ౧౭ | ౨ | నాంశవి | నాంశవ |
| ౬ | ౩౪ | ౨ | నసివాయు | నశివాయు |
| ౭ | ౪౯ | ౧ | రాముఁము | రాముఁడు |
| ౮ | ౪౪ | ౧ | సోదృత్వ | సోద -త్వ |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౦ | ౫౫ | ౨ | కారించుకయుఁ | గారించుకయుఁ |
| ౧౨ | ... | ౫ | గాళరమైళరమైన | ఖాళరమైళరమైణ |
| | ... | ౮ | దీళరత్న | దేళరత్న |
| | | ౧౭ | జఘృతఁ | జేఘృతఁ |
| | | ౧౮ | సిబో | జే సెబో |
| | | ౨౨ | చలనంబుఁ | కలనంబుఁ |
| | | ౨౬ | లలితానం | లవితానం |
| | | ౨౮ | బరిషు | బరిఘు |
| ౧౪ | ... | ౧౮ | కినణ | వణ |
| ౧౫ | ... | ౬ | ధా్ర స | ధా్రగేశ |
| | | ౧౪ | స్థలముల | స్థలములు |
| | | ౧౮ | హాత్యకలిత | హాత్యకలిత |
| | | ౨౪ | శాక | శాకట |
| ౧౬ | ౧౧౪ | ౨ | డొనిఁ | డొగిఁ |
| | ౧౧౭ | ౨ | నిట్టులవుగ | నిట్టులడుగ |
| ౧౭ | ... | ౩ | నవికస్థల | నలికస్థల |
| | | ౭ | మదధికా | మదధికా |
| | | ౧౩ | పౌర్వడంగ | పౌర్వడగ |
| ౧౮ | ... | ౪ | సన్ద్రై | సన్ద్రంద్రై |
| | | ౧౬ | దరిదము | ద్రరము |
| ౧౯ | ౧౩౫ | ౩ | రే | రేఖ |
| | ౧౩౬ | ౨ | నుపనయాదుల | నుపనయనాదుల |
| | ౧౩౯ | ౩ | బొనిఁ | బొగిఁ |
| ౨౦ | ... | ౨ | డనుటయు | డగుటయు |
| | ... | ౪ | శా వు | వాదీవు |
| | ... | ౨౭ | వ్వరినియరిని | వ్వరిగియరిగి |
| ౨౨ | ౧౫౯ | ౫ | కర ర | కరవీర |
| | | ౬ | పరివాత | పరివృత |

| | | | | |
|---|---|---|---|---|
| | | ౭ | సమలంకవిష్ణ | సమలంకరిష్ణ |
| | | ౯ | రోరలీకృత | రోరరీకృత |
| | ౧౬౦ | ౪ | త్యాక్షీకాం | త్ర్యయకాం |
| | ౧౭౧ | ౨ | పరినీత | పరిణీత |
| ౨౪ | ౬ | ౧ | ముగిలి | మిగిలి |
| | | ౨ | యిక్కయర్ | యిక్కయనర్ |
| ౨౫ | ౧౭ | ౩ | మానారాగ | మానరాగ |
| ౨౬ | ౨౪ | ౧ | దూరనట్టు | దూరనట్టి |
| ౨౭ | ౩౦ | ౩ | కిత | పత |
| | | ౪ | కేయింపు | జేయింపు |
| ౨౯ | ౪౨ | ౨ | జలభి | బలభి |
| | ౪౩ | ౧ | శాయి | శాయ |
| ౨౮ | ౪౭ | ౪ | నీయజ్ఞ | నీయాజ్ఞ |
| ౩౦ | ౫౦ | ౨ | తిదిసుత | దితిసుత |
| | ౫౧ | ౧ | తావిష్ణ | త్యావిష్ట |
| ౩౦ | ౬౨ | ౨ | వినతం | విపతుం |
| | ౬౪ | ౩ | ల్చి | దాల్చి |
| ౩౩ | ౭౮ | ౪ | దెచిం | దొంచి |
| ౩౪ | ౯౪ | ౩ | సుట్టినో | సుట్టునో |
| ౩౫ | ౮౧ | ౧ | శ్రాకైల | శ్రాక్కైల |
| | ౮౬ | ౩ | వెల్లుల | వెల్గుల |
| | ౮౯ | ౫ | ప్రవాహాంబు | ప్రభావంబు |
| | ౮౮ | ౨ | నల్లడ | నల్గడ |
| ౩౭ | ౧౧౪ | ౧ | లోల | లోన |
| ౩౮ | ౧౨౫ | ౧ | తుండర్ | తుండక్ |
| ౪౨ | ౧౪౩ | ౧ | మహా | మహీ |
| | ౧౪౮ | ౩ | తలం | దలం |
| | ౧౫౦ | ౨ | మిూషశై | మిూషవై |

| | | | | |
|---|---|---|---|---|
| ౪౫ | ౧౬౬ | ౧ | ధర్మశ్య | ధర్మస్య |
| ౪౭ | ౧౭౭ | ౪ | ప్రశస్త్రా | ప్రశస్త్రా |
| | | ౬ | లినీలాం | వినీలాం |
| | | ౩ | నపోప్డ | నపోప్రిడ |
| ౪౯ | | ౫ | బల్ప్రశకై | బల్ప్రపవై |
| | | ౧౦ | గోడపై | గోరపై |
| | | ౧౧ | వేబులిక్ | వేబువిక్ |
| | | ౧౭ | నిట్టి | గిట్టి |
| | | ౨౬ | వాసాంజవి | వాపాంజలి |
| | | ... | క్ప్రతవ్వర్గ | కృత్వ్వర్గ |
| | | ౨౮ | వాండమా | హిండమా |
| ౫౦ | ౧౭౭ | ౩ | న్నిరాచారిరాచారులక్ | న్నిరాబారిరాబారులక్ |
| | | ౪ | భ్రాత్రు | భ్రాతృ |
| | | ౧౦ | నయం | న్యాయం |
| | | ౧౧ | చ్ఛలిక్ | చ్ఛవిక్ |
| | | ౧౬ | ముస్తోక | మస్తోక |
| | | ౧౮ | వెల్లు | వెల్గు |
| | | | మూర్ధ్న | మూర్ధ |
| ౫౧ | ౧౯౬ | ౨ | చిన్మయి | చిన్మయ |
| ౫౩ | ౨ | ౧ | నారాయణశర్మ | నిందప్రద్యుమ్నుండు |
| | ౩ | ౧ | అరిగోంగకృత | అరిగేంగకృత |
| | ౬ | ౩ | పూర్వవారి | పూర్వవార్ధి |
| | ౮ | ౧ | వేధ | వేద |
| | | ,, | వ్యర్థత | వృద్ధత |
| ౫౪ | ౯ | ౩ | జూషంగదా | జూపుంగదా |
| | ౧౦ | ౨ | బడి | బడ |
| | ౧౩ | ౧ | రాకర | లాకర |
| | | ౨ | బట్టి | పట్టి |

